# సోవియట్ దేశం - భూతలస్వర్గం

రచయితలు

మెల్లీ సోలింగర్
ఉప్పల లక్ష్మణరావు

★

అనువాదం

సెట్టి ఈశ్వరరావు

ప్రజా ప్రచురణాలయం, హైదరాబాదు.

ప్రజా ప్రచురణ నెం. 5. జూన్ 1945.

అ —— మ

గార్లకు

# ప్రేమాంజలి

కల్దార్ 1—0—0 హాలీ 1—2—8

# రచయితలు

## మెల్లీ సోలింగరు

ఈమె 1898 సంవత్సరం జ్యూరిచ్ ( స్విట్జర్లాండు ) లో జననం. వైద్యకళాశాలలో ప్రవేశించి పూర్తిచేయకముందే తండ్రిగారి రసాయినికపట్టువ్యాపారమందు ప్రవేశించిరి. 1928 వరకు అందులో పనిజేసి వ్యవహారరీత్యా యూరపు, ఇంగ్లాండులో పర్యటనచేసి 1929 లో ఇండియాకు వచ్చిరి. సత్యాగ్రహోద్యమం ప్రారంభంలో సబర్మతీఆశ్రమంవెళ్ళి అచ్చట ఖాదీపరిశ్రమలో తర్ఫీదుపొంది 1935 వరకు ఆంధ్రరాష్ట్రంఅంతటా ఖాదీప్రచారము చేసిరి. కలకత్తాలో శ్రీ సతీషుదాసుగుప్తగారి "ఖాదీప్రతిష్ఠాను"లో కొంతకాలము నివసించి, ఖాదీపరిశోధన సాగించుచు అచ్చట హరిజన ఆస్పత్రిలో పనిచేసిరి. డాక్టరు ఉప్పల లక్ష్మణరావుగారితో కలిసి ఆంధ్రలో పొందూరు సన్ననూలుపై పరిశోధనలుచేసి "భారతి", "మోడరన్ రివ్యూ" పత్రికలలో కొన్ని వ్యాసాలు ప్రకటించారు. 1937లో స్వదేశమునకువెళ్ళి జర్మనీ, ఇటలీలలో పర్యటన చేసి అప్పుడే రష్యాకూడా సందర్శించారు. చిరకాలమిత్రులగు లక్ష్మణరావుగారిని మాస్కోలోనే వివాహమాడిరి. 1938 లో ఇండియాకువచ్చి బెజవాడలో నివాసమేర్పరచుకొనిరి. 1940 వ్యక్తిసత్యాగ్రహములో రెండుసార్లు (ఏడునెలలపాటు) జైలుశిక్ష

ననుభవించారు. 1942 ఆగస్టు తరవాత గాంధీజీ జన్మదినోత్సవం జరిపించినందుకు వీరికి రెండున్నర సంవత్సరాలు శిక్షవేయబడెను. కాని సంవత్సరంనాల్గునెలలు శిక్షననుభవించిన తరువాత బేషరతుగా విడుదలచేయబడిరి.

## ఉప్పల లక్ష్మణరావు

1898 బరంపురంలో వీరిజననం. కలకత్తా (బి. ఎస్. సి), ఎడింబరో (ఎం. ఏ.), టూబింగెను జర్మనీ (డి. ఎస్. సి) యూనివర్సిటీలలో విద్యాభ్యాసం. స్విట్జర్లెండులో శ్రీమతి సోలింగరు గారితో కలిసి 1924 లో అచ్చటి కార్మికోద్యమంలో పాల్గొన్నారు. స్వదేశానికి వచ్చిన తరువాత 1926-1927 లో రైల్వేసమ్మెలోనూ, కార్మికోద్యమములోనూ శ్రీ వి. వి. గిరిగారి ఆంతరంగిక కార్యదర్శిగా పనిచేసేరు. తరువాత రెండుసంవత్సరములు సుప్రసిద్ధ వృక్షశాస్త్రవేత్తయగు సర్. జె. సి. బోసుగారివద్ద శిక్షణపొందేరు. 1929-30 లో కాకినాడ కాలేజీ, అలీఘరు మసిలిమ్ యూనివర్సిటీలలో అధ్యాపకులుగా ఉన్నారు. సత్యాగ్రహోద్యమమందు శిక్షణ పొంది, శ్రీమతి సోలింగరుగారితోకలిసి ఖాదీ ప్రచారమును, ఖాదీ పరిశోధనలు చేసేరు. 1934 లో విశాఖపట్నమందున్న ఆంధ్ర ఇంజినీరింగు సంస్థయందు చేరెను. 1937 లో వ్యవహారరీత్యా జర్మనీ వెళ్లారు. ఆ సందర్భంననే మాస్కో సందర్శించారు. 1939 నుంచి ఆంధ్ర సిమెంటు కంపెనీ మేనేజరుగా బెజవాడలో నివాసము.

— అనువాదకుడు.

---

ముఖచిత్రం : కాకసస్సు సమిష్టి వ్యవసాయక్షేత్రంలోని రైతులు

# సోవియట్ దేశం - భూతలస్వర్గం

## ఇదుగో సోవియట్ భూమి !

వార్సా, బైలిస్టాక్, బేరనోవిజ్ పట్టణాలనుదాటేం. పోలిష్‌దేశ మైదానాలమీదుగా రైలు కనుకుతూ ప్రాకుతూంది. ఇరవై యేళ్ళక్రితం, అత్తవారిసొమ్ము అల్లుడు ధారపోసినట్టు మహోదాత్తృత్వంతో నానాజాతి సమితి, ఈ ప్రాంతాన్ని పోలెండుకు ధారపోసింది. ఈ ప్రాంతంలో జీవిస్తున్న ప్రజలపట్ల అప్పుడు జారుచక్రవర్తు లెంత శ్రద్ధవహించేవారో యిప్పుడు పోలిష్‌ప్రభుత్వమూ అంతే శ్రద్ధపుచ్చుకుంటూంది !

రైలులోంచి యీప్రాంతాల్ని చూస్తూంటే మహావిసుగ్గావుంది. మురికిలోముగ్గుతూన్న గ్రామాలు. అక్కడాయిక్కడా శుభ్రతఅంటే యేమిటో తెలియనియిళ్ళూ, నికృష్టతకు నమూనాలుగావున్న మనుషులూ మృగాలు, కళ్ళకు కట్టినట్టు కనిపిస్తున్నాయి. ఒక్క కొత్త ఫ్యాక్టరీకాని, కొత్తగాకట్టిన నివాసస్థలంగాని, కొత్త పొలాలుగాని మచ్చుకైనా కని పించవు. రైలువంతెనలు మరామత్తులేక కీచుపెడుతున్నాయి. దేశపరిస్థి తులు అవకతవకగా నడుస్తున్నాయి. గత ప్రపంచ మహాయుద్ధం తరవాత యూరప్ ఖండం ప్రసవించినకుంటిబిడ్డ పోలండ్ ఇంత చక్కగానడుస్తూంది!

రైలుపట్టీల కిరుపక్కలా ముళ్ళతీగకంచె వేయబడివుంది. సాయుధులైన సైనికులు కాపలాకాస్తున్నారు. సుత్తీకొడవలితోవున్న ఎర్రజండా పెద్దకొయ్యమీద ఎగురుతూంది.

నెగొరొలొయె అన్న మొదటి సోవియట్ స్టేషన్‌లో రైలాగింది. స్టేషన్ - నాలుగుగోడలమీదా సువర్ణాక్షరాలతో — "ప్రపంచ కార్మికులారా ! ఐక్యమవండి" — అనిరాసివుంది.

* * * *

మేం యెన్నాళ్ళనుంచో ఆసించి కలలుకన్నది నిజమైంది — మేం సోవియట్ భూమిమీదవున్నాం.

ఈ "సాహసకృత్యా"న్ని విరమించుకోవలసిందని జర్మనీలో స్నేహితులు చాలా హెచ్చరించేరు. సెలవురోజుల్ని హాయిగా "సౌభాగ్య వంతమైన" జర్మనీలో గడపకండా, ప్రమాదకరమైన అనాగరక బోల్షివిక్

దేశానికి పయనమవుతూన్న మమ్మల్నిచూసి వాళ్ళు ఆశ్చర్యపడ్డారు. మాకుటుంబాల్లోనే దీనికి వ్యతిరేకత యెక్కువగా వుండేది; ఒకొక్కపుడు చాలా తీవ్రంకూడా అయ్యేది. సోవియట్‌దేశంలో హత్యలు విరివిగా అనునిత్యం జరుగుతుంటాయనీ, విదేశీయుల్నీ "అవాంఛనీయు"లైన యాత్రీకుల్నీ గూఢచారులు యెలా "నిష్కంటకం"గా చేస్తారో, ఆకలీ కరువుకాటకాలూ యెలాగ ఆదేశంలో తాండవిస్తున్నాయో........ మొదలైన కథలు కుప్పతిప్పలుగా మాచెవిని యేకరవుపెట్టేరు.

సోవియట్ పర్యటన అనుజ్ఞకోసం, బెర్లిన్ పట్టణంలోని సోవియట్ రాయబారి కార్యాలయానికి మేం వెళ్ళి నాలుగువారాలు గడిచింది. ఈ నాలుగువారాలు యెంతో ఆతృతగా నిరీక్షించేం. ఈలోగా మా పుట్టు పూర్వోత్తరాలు పరీక్షించబడ్డాయి. మాగురించి భోగట్టా చేయవలసిందంతా సోవియట్ అధికారులు దర్యాప్తుచేసేరు. చిట్టచివరకి, సోవియట్ దేశానికి వెళ్ళవచ్చుననీ యాత్రకోసం మేం ప్రయత్నాలు చేసుకోవచ్చుననీ మాకు తెలియజేయబడింది.

ప్యాసుపోర్టుకోసమే నెల్లాళ్ళు వృథాగా ఆగిపోవలసొచ్చింది. ఇక మా కార్యక్రమంప్రకారం మాకున్న తీరికకాలం వారంరోజులే. యీ వారం రోజుల్లోనే పర్యటన ముగించుకునిరావాలి. ఇంత తక్కువవ్యవధిలో వెళితే అంతా సరిగా చూడగలమా అనిపించింది. కాని....ఇన్ని సంవత్సరాలై ఎదురుచూస్తూన్న అవకాశం ఈనాడు లభించింది. ఈ అవకాశాన్ని విని యోగించుకుని, వారంరోజులు కాదుకదా - చివరకు పక్కరోజైనాసరే - సోవియట్ దేశాన్ని ఆ పరిస్థితులను కళ్ళారాచూసి, సోషలిస్టు నాగరికత, వాళ్ళ జీవితాన్ని మనం ప్రత్యక్షంగా అనుభవించాలి - ఒక్కనిమిషమైనా వృథా చెయ్యకుండా అన్నివిషయాలు జాగ్రతగాను తెలివిగాను కనిపెడితే పరిస్థి తులు బోధపడతాయి - అందుకు మనకున్న కొద్దికాలం, ప్రయాణాలలో వృథాగా గడపకుండా, పక్క మాస్కోపట్నంలోనే గడుపుదాం - అని నిశ్చయం చేసుకుని - ప్రయాణం ఏర్పాటుచేసుకున్నాం.

*   *   *   *

సరిహద్దు స్టేషన్‌లో మా సామాన్లు పూర్తిగా తనిఖీచేయబడ్డాయి. అయినా తనిఖీచేసిన సోవియట్ ఉద్యోగులు - వారిలో యెక్కువమంది స్త్రీలు - చాలా మర్యాదగా ప్రవర్తించేరు. వాళ్ళ కళ్ళనుండి ఒక్క వస్తువ కూడా తప్పించుకొని బయటపడలేదు. జోళ్ళకు చుట్టిన ఫల్‌కిషర్ బియ

బ_క్తర్ అన్న నాజీ పత్రికకూడా వాళ్ళదృష్టినుండి తప్పించుకోలేదు; దానిని వాళ్ళు తీసికొని అది తమదగ్గర వున్నట్టు రసీదుయిచ్చేరు! ఫోల్కి_షర్ బియోబాఖ్టరు సామానుల తనిఖీ హడావుడి అయిన తరువాత రైళ్ళు మార్చాం. సాయంకాలం అయింది. వెడల్పుగావున్న సోవియట్ రైలు పెట్టెలో సుఖంగా కూచున్నాం. రైలుబండి మాస్కో_ముఖంపట్టింది. సరిహద్దుకాపలా సైన్యాలనుండి మిన్స్కి_పట్టణానికి వెళ్తూన్న యిద్దరు ఎర్రసైనికులు, పట్టణంలో అమ్మకానికి ఒకబుట్టలో కర్బూజాపళ్ళూ, దోస కాయలూ, కోళ్ళూ, కోడిగుడ్లూ, బాతులూ, తీసుకెళ్తున్న ఒక రైతూ అతని పెళ్ళాం బిడ్డలూ, సెలవులయ్యాక మాస్కో_కు తిరిగి వెళ్తూన్న జర్మనీజాతికి చెందిన సోవియట్ కార్మిక యువకుడూ వీళ్ళూ బండిలో మాతోవున్నవాళ్లు. ఇతనొక్క_డితోనే మేం మాటాడగలిగేం. ఇరవైయేళ్ళ వయసుంటుంది. గతయుద్ధానంతరం సంధిజరిగిన తరవాత వెంటనే తన తలిదండ్రులు సోవియట్ దేశానికి వలసవచ్చేరనిచెప్పేడు. తాను సోవియట్ పౌరుణ్నయినందుకు గర్విస్తున్నానని అన్నాడు.

నిష్ఫలంగా పడివున్న పోలండ్ బీడు ప్రదేశాల్లో విసుగు ప్రయా ణానికీ, సోవియట్ దేశంలో ప్రయాణానికీ ఎంతతేడావుంది! ప్రతిస్టేషనూ ప్రయాణీకులతోకిటకిటలాడుతూంది. సంతల్లో అమ్మకానికి బరువుసామానులు తీసుకపోతూన్నరైతులూ, స్త్రీలూ, పురుషులూ సెలవుమీద వెళ్తున్న కార్మి కులూ, తోలుసంచులు పట్టుకుని ఠీవిగాను మంచి చహరాతోవున్న అధి కారులు-పీపుల్సు_స్తులు డాబుగాలేకపోయినా, వారి ముఖాలమీద ఉత్సాహమూ కార్యదీక్ష స్పష్టంగాకనిపిస్తున్నాయి. కొత్తపొలాలూ, కొత్తయిళ్లూ, యంత్ర సహాయంతో సాగుచేయబడుతూన్న విశాలమైన పంటభూములూ, పచ్చిక బయళ్ళలో ప్రశాంతంగామేస్తూన్న బలసిన పశువులూ ప్రతిచోటా కనిపిస్తు న్నాయి. కొత్తగాకట్టిన కర్రలఅడితెలు, రంపంమిల్లులూ, యిటిక పెంకు ఫ్యాక్టరీలూ, కొత్తగా అమర్చబడిన బ్లాస్టుఫర్నేసులు, కార్ఖానాలు లేందే ఒక మైలుదూరమైనా గడవలేదు. జలాశయాలతోనూ, పొగగొట్టాలతోనూ, విద్యుచ్ఛక్తి ఉత్పత్తికేంద్రాలతోనూ, పెద్ద గోధుమల గాదెలతోనూ యీ ప్రాంతం అంతా నిండివుంది. రైలుస్టేషన్ గోడలనిండా రెండో ఐదేళ్ళ కార్యక్రమం లెక్క_లూ నినాదాలూ కనిపిస్తున్నాయి; రెండో ఐదేళ్ళ కార్య క్రమం ఎంతవరకు నెరవేర్చిందీ, యింకా యెంత నెరవేర్చవలసివున్నదీ హెచ్చరిస్తూ రైలుస్టేషన్ గోడలమీద నినాదాలు వున్నాయి.

## ఇదీ మాస్కో నగరం!

ధూళిదూసరితంగా పదహారు గంటలు ప్రయాణంచేసేక మాస్కో పట్టణాన్ని చేరుకున్నాం.

ఉదయం పదకొండుగంటలు కొట్టేరు. మనుషులతో కిక్కిరిసి పోతూన్న స్టేషను. చాలా పరిశుభ్రంగావుంది. కిటికీలలో పుష్పాలగోలే లున్నాయి. ఆరితేరిన స్త్రీ రైల్వేఉద్యోగులు ప్రయాణీకులకు సలహాలిస్తూ సహాయాలు చేస్తూ పనిలో మునిగివున్నారు. స్త్రీలచే నడుపబడుతూన్న రైలుయింజనుల కోలాహలంతో స్టేషనునిండిపోయింది. స్త్రీల పర్యవేక్షణ కింద యింజన్లు అటూయిటూ తిరుగులాడుతున్నాయి.

కూర్చోడానికి సుఖంగా అమర్చబడిన మోటారుకార్లూ, పెద్ద బరువులుమోస్తున్న లారీలూ, చెవులుబద్దలుచేస్తూ కీచుపెడుతూన్న ట్రాంకార్లూ, స్టేషనుబయట వీధుల్లో నిండిపోయివున్నాయి. ప్రతిచోటా వీధికి రెండు పక్కలా నిర్మాణావస్థలోవున్న పెద్ద పెద్ద భవనాలు కనిపిస్తున్నాయి. రోడ్లు కడుతూన్న యంత్రాలశబ్దంతో ఆప్రాంతంఅంతా నిండిపోయింది. ఇటుకలు, సిమెంటు మొదలైనవాటి ధూళితోనూ, వాసనతోనూ వాతావరణం నిండివుంది. కొద్దిగజాలు ముందుకువెళ్తే, రెండవ ఐదేళ్ళ కార్యక్రమం లెక్కల్నీ, గ్రాపుల్నీ ప్రజలు గుమిగూడి శ్రద్ధగా చర్చిస్తున్నారు. ప్రత్యేకంగా పెట్టబడిన దీపాలవెలుగులో రెండవ ఐదేళ్ళ ప్రణాలికయొక్క విపులమైన లెక్కలూ, అభివృద్ధిసూచకంగా గ్రాపుల్లో మీదికిపోతున్న గీతలూ కనిపిస్తున్నాయి. భవనాల వెలుపల యేర్పాటుచేయబడ్డ హోటళ్ళు, ఉత్సాహంతో మనుషులుచేసే కోలాహలంతో మారుమోగుతూన్నాయి. ఇదీ మాస్కోనగరం! "ఇన్నాళ్ళకి చూడగలిగాం!" అని అనుకున్నాం.

## పోలికే లేదు

మాస్కోనగరం నిర్మాతలచేతుల్లోవుంది. మాస్కో పునర్నిర్మించబడుతూంది.

విప్లవానికి పూర్వం మాస్కో జనాభా 15 లక్షలు. ఈ నాటికి 40 లక్షల జనాభాగా అభివృద్ధిచెందింది. అంచేత నగరంలోవున్న యిళ్ళేమీ చాలేవికావు. నీచంగా కురూపంగా జారు పరిపాలనలో కట్టబడిన యిళ్లు పడగొట్టబడ్డాయి. ఇరుకుసందులు, చీకటికోణాలూ కిక్కిరిసిపోయిన



మాస్కో పట్టణంలో కార్మికుల ఇళ్లు

వీధులూ నేలమట్టం చేయబడ్డాయి. వాటిస్థానే కొత్తవీధులూ, కొత్తయిళ్లూ కట్టబడ్డాయి; మంచివీధులు, మంచియిళ్లూకట్టబడ్డాయి నగరమంతటా ఎక్కడ చూచినా కడుతూన్న భవనాలూ, క్రేన్లూ, తారుఇంజన్లూ, సిమెంటుస్లాబులూ, ఇనపదూలాలు, స్టీలుపంజరాలు మొదలైన నిర్మాణసామగ్రి కనిపిస్తాయి.

ప్రజలకోసం, ప్రజలప్రతినిధులు జాగ్రత్తగా ఆలోచించి నిర్మాణ విధానాన్ని యేర్పరచుకున్నారు. హద్దూపద్దూలేని అవకతవక కట్టడాలు లేవు; మురికిసందుగొందులూ గుర్రపుశాలలవంటి యిళ్లూ కట్టడంలేదు. మాస్కోనగరానికి అదృష్టం పట్టింది. ప్రజల్ని మురికితో కుళ్ళబెట్టే ప్రభువులు దానికిలేరు; తమ అద్దెలకోసమూ పెట్టుబడికోసమూ గృహనిర్మాణాన్ని ఆటంకపర్చే ధనికులులేరు. మాస్కోపురవాసులే మాస్కోనగరానికి హక్కుదారులు. తమసౌఖ్యానికీ, తమపిల్లలసౌఖ్యానికీ వినియోగపడేలాగ వాళ్లు మాస్కోను నిర్మిస్తున్నారు.

మొదటి ఐదేళ్ళ కార్యక్రమంలోనే చాలవరకు పట్టణాన్ని సంస్కారంచేసేరు. కాని ప్రతిదీ తొందరలో చెయ్యవలసివచ్చింది. ఎన్ని యిళ్లు నిర్మించగలిగితే అన్ని నిర్మించడమే అప్పటిఉద్దేశం. తక్కువ ఖర్చుతో త్వరగా నిర్మించడమే అప్పటి ఆశయం. అందంగా సుఖవంతంగా కట్టడాలను చేయడానికి అవకాశంలేకపోయింది. నాలుగుగోడలూ, వాటిమీద ఒక కప్పు - అవే అప్పటికి కావలసినవి. అంచేత చాలాకట్టడాలు గోప్యతా హాయీలేకండా వుండేవి. అందంగా వుండేవికావుకుడాను.

ఇప్పుడు అలాంటియిళ్లు చాలావరకు పడగొట్టేశారు. మాస్కోపురవాసులు యివిచూపడానికి సిగ్గుపడరు. కొన్ని యిళ్ళగోడలకు సున్నం వూడిపోతూంది. చాలావాటికి మేడముందరి వసారాలు పడిపోతున్నాయి. కొన్నిటి గోడలు బీటలువేసేయి. మాస్కోపౌరులు యివన్నీచూపించి కొద్దికాలంలోనే యివి గతవిషయాలవుతాయని చెపుతారు. వచ్చే తరానికి తెలియనే తెలియదంటారు. కాలానికీ, తమ ప్రాణాలకే ముప్పుతెచ్చే పరిస్థితులకీ యెదురీదవలసివచ్చిన కష్టదినాల్లో చేసిన పొరపాట్లను వాళ్ళొప్పుకుంటారు.

కాని యీనాడు పరిస్థితులు వేరుగావున్నాయి. అప్పటి యుద్ధసమయంగడిచి, శాంతిస్థాపన అయింది. సుఖప్రదంగా అందంగా యిళ్ళు కట్టడంకోసం ఆలోచించడానికీ, పూర్వం చేసిన తప్పులు దిద్దుకోవడానికీ యిప్పుడు కాలమూవుంది, తీరుబడీవుంది.

అప్పుడే అందమైన యిళ్లు చాలా కట్టబడ్డాయి. ఇవి చూడ్డానికి యింపుగాను, నివసించడానికి హాయిగానూ వుంటాయి. సోవియట్ ప్రజలకు తగినయిళ్ళివి. అర్ధచంద్రాకారంగావున్న మేడముందరి వసారాలకు అద్దాలు అమర్చబడివున్నాయి. విశాలమైన వరండాలు, పుష్పాలగోలేలతో నవ్వుతూన్న కిటికీలు, యింటిముందు చక్కని పచ్చికబయళ్ళు, ఎక్కడ చూచినా పార్కులూ, విశ్రాంతికోసం కాళీగావదిలిపెట్టిన ప్రదేశాలూ కనిపిస్తాయి. అనేక కుటుంబాలు వేరువేరు భాగాల్లోఉన్నా ఉమ్మడిగా నివసిస్తున్నారు. ప్రతిభవనానికీ సినిమావుంది. పిల్లలు వేసుకోవడానికి నాటకరంగంవుంది. పెద్ద కో-ఆపరేటివ్‌ఫష్టోరువుంది. ఆటస్థలమూ శిశుపోషణాలయమూ వున్నాయి.

గృహనిర్మాణకార్యక్రమం చాల యెక్కువగా వేసినప్పటికీ యిళ్లేమీ చాలడంలేదు. ఇళ్ళేకాదు, విద్యాలయాలు, దుకాణాలు, ఆటస్థలాలు మొదలైనవాటికిస్థలం చాలడంలేదు. ఇళ్లు కిక్కిరిసిపోయివున్నాయి. కాని వేలకొలదీ గృహాలు, భవనాలు కడుతూవుండడంచేత మెలమెల్లగా యీ యిబ్బంది తొలగిపోతూంది.

పట్టణాలను నిర్మించడంలో మాస్కో ఒక కొత్తపద్ధతిని సృష్టించింది. పూర్వం, ప్రభుత్వకార్యాలయమైన క్రెమ్లిన్ ప్రాముఖ్యమున్డేది. దాని చుట్టూరా వూరు పెరిగిపోయింది. జారుచక్రవర్తి భవనాలుకాదు, కార్మికుల ఫ్యాక్టరీలు యీనాడు మాస్కోనగరానికి కేంద్రాలుగావున్నాయి. మాస్కోలో చాలా ఫ్యాక్టరీలున్నాయి. బ్రహ్మాండమైన "ఎలెక్ట్రోజావడ్" ఫ్యాక్టరీలో 22 వేల కార్మికులు పనిచేస్తున్నారు. ప్రఖ్యాతమైన సుత్తీకొడవలి ఇనుమూ ఉక్కు ఫ్యాక్టరీలో 14 వేలమంది కార్మికులు పనిచేస్తున్నారు. మాంసపదార్థాల ఫ్యాక్టలో 12 వేలమంది పనిచేస్తున్నారు. రబ్బరుఫ్యాక్టరీ, విఖ్యాతమైన బట్టలఫ్యాక్టరీ, తీపివస్తువులఫ్యాక్టరీ, రొట్టెలఫ్యాక్టరీలు, బ్రహ్మాండమైన మోటారుకార్లఫ్యాక్టరీ, చాలా పెద్ద మెషిన్‌ఫ్యాక్టరీలు, వీటిచుట్టూ మాస్కోపురజీవితం ప్రదక్షిణలు చేస్తుంటూంది.

మాస్కో పురవీధుల్లో తిరిగుతున్నాం. బూడిదరంగుగల క్రెమ్లిన్ భవనం ఆకుపచ్చకొండమీదనుంచుంది. సోవియట్‌వీరుల సమాధులమీద, క్రెమ్లిన్‌గోడలు నీడలుపరుస్తున్నాయి. లెనిన్ కళేబరం నిలవచేయబడి "మాస్కోపురహృదయం" అని పేరుపడిన రెడ్‌స్క్వేర్, స్వెర్‌డ్లవ్

స్క్వేర్, రివల్యూషన్ స్క్వేర్, గార్కీ-వీధి, లెనిన్‌షాస్, కమ్యూన్ స్క్వేర్ - ఎంత పవిత్రమైన పేర్లు!

ఈ కొత్తపట్టణంలో కట్టబడిన లెక్కలేనన్ని పార్కులలోను, ఎవెన్యూలలోను, బోల్వార్లలోను మేం తిరిగేం. పదకొండు అంతస్తుల సొవ్‌నార్కమ్ కార్యాలయభవనం * గల సదోవాయాపీధిలోనూ, మాస్కో సోవియట్ కట్టి నడుపుతూన్న వెయ్యిగదులుగల దివ్యమైన "మాస్కో హోటల్"లోనూ తిరిగేం. "ఇది యూనియన్ అంతటికీ పెద్ద హోటలు" అని మాస్కో పౌరులు సగర్వంగా చెపుతారు.

నిర్మాణం పూర్తి అవుతూన్న విశాలమైన లెనిన్ గ్రంథాలయం చూసేం. ఇందులో 90 లక్షల గ్రంథాలు పెడతారట. సోవియట్ యూనియన్‌లో వున్న 70 వేల గ్రంథాలయాలన్నిటికన్నా లెనిన్ గ్రంథాలయం పెద్దది. ఒక్క మాస్కోపట్టణంలోనే 500 గ్రథాంలయాలకుపైగా వున్నాయి.

కొత్తగా కట్టిన వ్యవసాయ మంత్రివర్గ కార్యాలయమూ, పొడవుగా విశాలంగా కట్టిన పోస్టాఫీసూ - యిది విప్లవానంతరం కట్టిన మొదటిభవనాలలో ఒకటి - చిన్న పరిశ్రమల మంత్రివర్గభవనమూ, కమ్యూన్ స్క్వేర్‌లో బ్రహ్మాండంగా నిర్మించబడిన రైల్వేఆఫీసు భవనమూ, అనేక అంతస్తులు గల నివాసగృహాలు, విలాసభవనాలు, బజార్లు, షాపులు, ఆఫీసులూ, సదోవయాస్కల్, అరబట్ స్క్వేర్‌లోవున్న యితర భవనాలూచూసేం.

దుమ్ము, మురికిజబ్బులు, దారిద్ర్యం యదార్థంగా - క్రమక్రమంగా - నిశ్చయంగా రూపుమాపబడుతున్నాయి. మేం చూసినదంతా మాకీనమ్మకాన్ని కలిగించింది.

## కొత్త మాస్కో

ఈ బ్రహ్మాండమైన పునర్నిర్మాణాన్ని యెంత చక్కగాచేస్తున్నారో, కార్మికులకూ వారి కుటుంబాలకూ సౌఖ్యం చేకూర్చడానికి ఎంత చిన్న విషయం అయినాసరే ఎంత శ్రద్ధగాఆలోచించి సౌకర్యాలు కలిగిస్తున్నారో, అన్న విషయాలు గమనించడానికి "మాస్కో-బిల్డింగు ఎగ్జిబిషను"కువెళ్ళేం. ఈవిషయాలన్నీ సమన్వయపర్చి పురనిర్మాణం ఒక పద్ధతిప్రకారం జరపడానికి ఒక కేంద్రకార్యక్రమంవుంది.

* మంత్రివర్గ కార్యాలయం — అనువాదకుడు.

## ఇళ్ళకు కాళ్ళొచ్చేయి!

నగర పునర్నిర్మాణంలో మాస్కో యింజనీర్లు ఒక కొత్తపద్ధతి కనిపెట్టేరు. వూరు పెద్దదిచేయడంకోసం వీధులూ రహదార్లూ యేర్పరచ డానికి యిళ్లు పడగొట్టవలసివుంటుంది. కాని పెద్ద పెద్ద మేడలు, చరిత్రా త్మకములు, కళావంతములు అయిన భవనాలూ, పడగొట్టకుండానే వేరొక చోటికి నడపబడుతున్నాయి. మేం చూసిన మాస్కో గ్రామొఫోన్ ఫ్యాక్టరీకి చెందిన రసాయనిక పరిశోధనాయం కొత్తస్థలానికి "నడపబడిన" యిళ్ళలో ఒకటి. పునాదుల్లోకి ఆరడుగులనుండీ పదడుగులవరకూ దించబడిన యినపదూలాల పంజరంలో భవనం పెట్టబడింది. అదేవిధంగా అడుగునుండికూడా భవనం బంధించబడింది. గంటకు నాలుగడుగుల వేగం చొప్పున 250 అడుగులదూరంలోవున్న ఒక కొత్త స్థలానికి రెండు యంత్రాలసహాయంతో భవనం యావత్తూ నడుపబడింది. పైపెచ్చు యిది సులభమైనపనిగా పరిగణించబడుతూంది!

ఇదేవిధంగా 700 అడుగుల దూరానికి నడుపబడిన యింకో భవనాన్ని మేం చూసేం. భవనం యెత్తుకూడా 3 అడుగులు ఎక్కువచేయబడింది. ఈ నడపడంలో ఆశ్చర్యపడవలసిన విషయమేమిటంటే, H ఆకారంలోవున్న యీ భవనాన్ని మూడింటిగా భాగాలుచేసి ఒకదానికొకటి కలుపుతూ సూటిగా ఒకే వరసలోవున్న భవనంగా చేయడం!

భవనాన్ని పడగొట్టి తిరిగి కట్టడాని కయ్యేఖర్చులో మూడోభాగం మాత్రమే ఈ అచేతనాల్ని నడపడానికి ఖర్చవుతోంది.

## భూగర్భ రైల్వే

'మెట్రో' అని మమకారంగా ప్రజలుపిల్చే భూగర్భంగుండావున్న రైల్వే, వీటన్నిటికన్నా గమనించదగ్గది. వీటి స్టేషన్లు యెంతో అందచందాలతో అమర్చబడినవి. అవి కట్టడానికి రష్యాలోవున్న అత్యుత్తమమైన చలవరాళ్లు వుపయోగించబడ్డాయి. వాటిగోడలు ఎన్నికగన్న శిల్పాలతోను జిలుకు చిత్రాలతోనూ అలంకరించబడ్డాయి. ఉపదారులుకూడా విశాలంగా వున్నాయి. బాగా దీపసౌకర్యాలున్నాయి. విశాలమైనయిళ్ళూ, దివ్యమైన రెస్టారెంట్లు, షాపులూ, గ్రంథాలయలూ, వైటింగ్ హాల్సూవున్నాయి. హాల్సు విశాలంగా నిర్మించబడ్డాయి. ఎస్కలేటర్సు బాగా వెడల్పుగలిగి ఎంత జన

సమూహంవున్నప్పుడైనా చాలినట్టుగా వున్నాయి. చక్కటి చలవరాళ్లు అమర్చబడిన అద్భుత శిల్పాలు, ప్లాట్‌ఫారాలు. రైళ్లు పరిశుభ్రంగా వుంటాయి; రాకపోకలు సకాలంలో జరుగుతాయి. "మా మెట్రో" అని సగర్వంగా ప్రజలంటారంటే వింతేమీలేదు. దీని నిర్మాణం అంతటికీ మాస్కో-పురవాసులందరూ పనిచేసేరు. స్త్రీ పురుష బాలులు ప్రతిఒక్కరూ- ఉపాధ్యాయులూ, విద్యార్థులూ, సాంకేతిక నిపుణులూ, డైరెక్టర్లూ, గుమాస్తాలూ, గనుల్లో పనిచేసేవారూ, ట్రాండ్రైవర్లూ - ప్రతిఒక్కరూ ఉచితంగా కష్టపడి పనిచేసేరు. వాళ్ళందరూ "సబ్బోట్‌నిక్సు" *- ప్రపంచానికి తమ శక్తిని చూపడానికీ, ప్రపంచంలో యెక్కడాలేని భూగర్భరైల్వే కట్టగలమని చూపడానికీ, తమతమ వృత్తులనుండి వచ్చేక విశ్రాంతికాలంలో మాస్కో-పురవాసులు కలిసి పనిచేసి నిర్మించారు. లండన్‌లోనూ పారిస్‌లోనూ, బెర్లిన్‌లోనూ వున్న భూగర్భరైల్వేలు మాకుతెలుసు. మాస్కో-భూగర్భరైల్వే వీటన్నిటికన్నా ఉత్తమమైనదని నిస్సంశయంగాచెప్పగలం.

## ప్రజల మాస్కో

మూడేళ్ళక్రితం చెత్తకుప్పలు నిలవజేసేస్థలంగావుండే ప్రదేశంలో యిప్పుడు పెద్ద పార్కు నిర్మింపబడింది. ఈ "సొకొల్‌నికి పార్క్ ఆఫ్ కల్చర్ అండ్ రెస్ట్" ఏడువేల ఐదువందల ఎకరాల విస్తీర్ణంగావుంది. మాస్కో చుట్టూరావున్న ఎనిమిదిమైళ్ళ వనప్రదేశంలో యిదొక భాగం మాత్రమే। పిల్లలకోసం ప్రత్యేకంగా నిర్మింపబడిన యిరవై పార్కులుగాక, యిటువంటివి యింకా పన్నెండు పార్కులు మాస్కోలోవున్నాయి.

సోవియట్ ప్రభుత్వ కేంద్రకార్యనిర్వాహకవర్గం 'పేలస్ ఆఫ్ సోవియట్స్' అన్న భవనంలో వుంది. దీనిమీద లెనిన్ విగ్రహం గంభీరంగా నిలబడివుంది. ప్రపంచం అంతట్లో యింత యెత్తయిన భవనం యింకొకటిలేదు. 34 అంతస్తులు ఇది. న్యూయార్కుపట్టణంలోని ఎంపైర్‌స్టేట్ భవనంకన్నా ఇది రెండు అంతస్తులు పెద్దది. 'పేలస్ ఆఫ్ సోవియట్స్' భవనం యిప్పుడు నిర్మాణంలోవుంది.

* * * *

* సోవియట్ యూనియన్‌లో వారానికి ఆరురోజులు మాత్రమే వుంటాయి. ఐదురోజులు పనిచేసేక ఆరోరోజు సెలవుగా పరిగణింపబడుతుంది. ఈ సెలవు రోజునకూడా విశ్రాంతిని వదులుకొని దేశసౌభాగ్యంకోసం ఉచితంగా పనిచేసే వారిని 'సబ్బోట్‌నిక్సు' అంటారు — అనువాదకుడు.

హద్దూపద్దూలేకండా పల్లెప్రాంతాలనుండి వలసవచ్చేవారిని పట్టణంలో కాపరంపెట్టనిస్తే అనుకున్న ఆదర్శపద్ధతిలో పురనిర్మాణం సాగదని, మాస్కో సోవియట్‌కు తెలుసు. పనిపాటలకోసం మాస్కోకు వలసవచ్చే గ్రామీయుల్ని ఆటంకపర్చకపోతే, గ్రామాలు నిర్జనం అయిపోవడమేకాకుండా, అనుకున్నదానికంటె యెంతో యెక్కువమంది ప్రజల తిండికీ, నీటికీ, వసతికీ, విద్యుచ్ఛక్తికీ మాస్కో సోవియట్ యేర్పాట్లు చేయవలసివుంటుంది. పెట్టుబడిదారిదేశాల్లో జనాభా అంతా పట్టణాల్లో కేంద్రీకరింపబడుతూంది. ఇంగ్లండుదేశజనాభాలో నూటికి పదిహేనుమంది కంటె ఎక్కువగా లండన్‌లోనే నివసిస్తున్నారు. ఫ్రాన్సులోని జనాభాలో నూటికి పన్నెండుమంది పారిస్‌పట్టణంలోనే వున్నారు. జర్మనీ జనాభాలో నూటికి ఆరుగురికంటె ఎక్కువమంది బెర్లిన్‌లోనే వుంటున్నారు. అమెరికా జనసంఖ్యలో నూటికి తొమ్మండుగురు న్యూయార్కుపట్టణంలోనే వుంటున్నారు. ఈ పట్టణాలన్నీ యింకా పెరుగుతూనేవున్నాయి. జీవితానికి అవసరమైన పదార్థాలు నానాటికీ క్షీణిస్తూనేవున్నాయి. మాస్కోసోవియట్టూ, ఐదేళ్ళ కార్యక్రమాలూ మాస్కోపట్టణ జనసంఖ్య ఏభైలక్షలకన్నా యెక్కువ పెరగనియ్యకూడదని నిశ్చయించుకున్నాయి. అంటే సోవియట్ దేశం మొత్తం జనసంఖ్యలో నూటికి రెండున్నర అన్నమాట. 1942 సంవత్సరం సరికి నిర్మాణం పూర్తికానున్న మాస్కోపట్టణంలో జనసమ్మర్దం అన్నది వుండదు. క్రమంలేకండా వరుస వావిలేకుండా గృహనిర్మాణం జరగదు; పిల్లల ఆటస్థలాలూ, విశ్రాంతిస్థలాలూ, రహదార్లూ యిరకాటంగా వుండవు; జనసమ్మర్దంవల్ల రాకపోకల కాటంకంవుండదు; బస్సుల్లోనూ. ట్రాముల్లోనూ మెట్లమీద వేలాడవలసిన అగత్యం వుండదు. మాకు వూరుచూపిస్తూన్న ఆమె చెప్పినట్టు, బాహ్యప్రపంచంనుండి అడ్డంకులు రాకపోతే యీ కార్యక్రమాలన్నీ తప్పక జరిగితీరుతాయి.

ప్రతివిషయమూ కార్యక్రమంతో ముందుగా నిశ్చయింపబడింది. విశాలమైన పచ్చికబయళ్ళతో, ఆకాశంనుండి బాలబాలికలమీద మందహాసాలు కురిపిస్తూన్న నక్షత్రాలతో, జీవితనిర్వహణానికి కావలసిన సౌకర్యాలతో, ప్రతి పౌరునికీ జన్మహక్కుగా జీవనభృతికి యిచ్చిన హామీతో, యేఒక్క పౌరునికీ కొదువలేకుండా ఆనందమూ, ఆరోగ్యమూ, నీరూ, వేడీ, ఎండా, గాలీ మొనలైన సౌకర్యాలతో మాస్కోపట్టణం పెంపొం

దించడానికి పౌరులు నిశ్చయించుకున్నారు. దురాశకీ, అధికారదుర్వినియోగానికీ అవకాశాలులేకండా కార్యక్రమం వేసుకున్నారు.

బాల్యావస్థలోవున్న సోవియట్ ప్రభుత్వం మెరుపువేగంతో వ్యక్తిగతమైన ఆస్థినీ, అధికలాభాల్నీ. పెట్టుబడిదారీవిధానాన్నీ రద్దుచేసింది. భూమి, గాలి, నీరు, పంటలు మొదలైన ప్రకృతిజన్యమైన నిధులనూ; రైల్వేలు. ఓడలూ, విమానాలూ, కళాశాలలూ, పాఠశాలలూ, ఫ్యాక్టరీలు, వర్కుషాపులూ మొదలైన వాటన్నిటినీ ప్రజలే అనుభవిస్తున్నారు; వారి సౌఖ్యానికీ, వారి పిల్లల సౌఖ్యానికీ అవి వినియోగపడుతున్నాయి,

## సోవియట్ దేశ పిత

రెడ్ స్క్వేర్ మధ్యలో లెనిన్ భౌతికదేహం వుంచబడిన స్మారక గృహం వుంది. నలుపూ, ఎరుపూ రంగుల చలవరాళ్ళతో నిరాడంబరంగా నిర్మించబడింది. అయినా ఆ స్మారకగృహం హృదయానికి హత్తుకపోయే దృశ్యం. ప్రజలకు ప్రేమపాత్రుడై సోవియట్ దేశాన్ని నిర్మించిన లెనిన్ దర్శనం చెయ్యడానికి ఎడతెరపిలేకండా జనసమూహం బారులుతీర్చి కాచుకొని వుంటారు. పొడవైన జడలూ, కపాలానికి అమరిన టోపీలూ, గెడ్డాలూ, ఫెజ్ టోపీలూ, కుర్తాలూ, అంగరఖాలు నానావిధములైన వివిధ జాతీయదుస్తులలోవున్న టార్టార్, మంగోల్, కజాక్, ఉజ్ బెక్, జార్జియన్, ఉక్రేనియన్ మొదలైన అనేక యితర జాతుల ప్రజలప్రక్కను ఆ బారులు తీర్చిన జనసమూహంలో మేం యిద్దరంకూడా మాస్థలాల్లో నుంచున్నాం. సోవియట్ దేశంలోని సకలజాతులనుండీ వచ్చిన ప్రజలు యిక్కడున్నారని చెప్పక తప్పదు. ఈ జనసమూహంలోవున్న కొద్దిమంది విదేశీయులు కూడా, తమ తమ దేశాల కార్మికవర్గాల తరపున తాము అనధికార ప్రతినిధులమని భావించుకుంటున్నారు!

21 జనవరి 1924 నాటిమాట! ఈ తేదీ మా జ్ఞప్తిలో యెంత స్పష్టంగావుంది! జూరిక్ పట్టణంలో ఒక కార్మిక భవనంలో నేల యీనినట్టు ప్రజలు సమావేశమయ్యారు. కీర్తిశేషుడైన తమ నాయకునిపట్ల తమ ప్రేమను వెల్లడించడానికి తమంతటతాము కార్మికులు సమావేశమయ్యేరు. జారుచక్రవర్తి గూఢచారులు తన మాతృదేశంలో పట్టుకోవడానికి తరిమినప్పుడు, కొన్నాళ్ళక్రితం లెనిన్ తమ కార్మికులలో కలిసిపోయి జూరిక్ పట్టణంలో తలదాచుకున్నాడు. ఆరోజు ఆసమావేశంలో

స్విస్, జర్మన్, ఫ్రెంచి, ఇటాలియన్, జక్ దేశాలకు చెందిన స్త్రీ పురుష లక్కడవున్నారు. అక్కడ సమావేశమైన వారందరూ తమ కామ్రేడ్ మరణానికి సంతాపాన్నీ యీ కష్టసమయంలో తాము ఐక్యమవుతున్నామని ప్రతిజ్ఞతీసుకుంటామనీ ఎలుగెత్తి చాటేరు. "లెనిన్ కీర్తిశేషుడయ్యేడు! లెనిన్ చిరంజీవియగుగాక! అంతర్జాతీయ కార్మికవర్గం చిరస్థాయియగుగాక!" అని తమవాంఛల్ని వ్యక్తపర్చుకున్నారు.

మేమున్న వరస మెల్లగా పాములాగ మెలికలుతిరుగుతూ స్మారక గృహం ద్వారందగ్గరకువచ్చింది. మా అమెరికన్ మిత్రులు తీవ్రంగా రాజకీయాలు చర్చిస్తున్నారు. మాప్రక్కవున్న ఫ్రెంచి పత్రికా రచయిత లా పాపులరె పత్రిక దృక్పధాన్ని వ్యాఖ్యానిస్తున్నాడు. మాకు ముందు నిలుచున్న జర్మన్ దేశస్తునితో 1923 లో హిట్లరు చేసిన పితూరీ గురించి మా అనుభవాలు కబుర్లుచెప్పుకుంటున్నాం. ఇవి యిలా జరుగుతుండగానే మేం లోపట ప్రవేశించేం. ఎర్రసైనికులు బారులుతీర్చి పహరాఇస్తున్నారు. అంతా నిశ్శబ్దం - ప్రశాంతం. మేము లెనిన్ దేహంచుట్టూ ప్రదక్షిణంచేశాం.

లెనిన్ అక్కడ - అగాజుగదిలో - నిశ్చలంగా పడుకొనివున్నాడు - సామాన్యమైనదుస్తులు - పొట్టివిగ్రహం - భుజాలమధ్య పెద్దతల ఒకవైపుకు కొంచెం వొరిగివుంది. చిన్నకళ్లు శాశ్వతంగా మూతలుపడివున్నాయి - బల్లపరుపుగావున్న ముక్కూ, వెడల్పైననోరూ, ముందుకు పొడుచుకొని వచ్చిన గడ్డం - అతని ముఖమూ హావభావాలూ జీవించివున్నప్పటిలాగే వున్నాయి. రష్యాను విముక్తిచేసిన మహానుభావుడు, నవ్య ప్రపంచ సృష్టికర్త, నూతన నాగరికతా నిర్మాత అడుగో, అక్కడున్నాడు!

అతని భౌతికదేహం! అతని సహచరులకూ, అనుచరులకూ, ఎంతలాగ ఉత్సాహాన్నిస్తూంది! ఎంతలాగ దారిచూపుతూంది! లెలిన్ మహాశయుణ్ని తమ మధ్యలో చూడగలగడం, తమ కష్టసుఖాలూ, తమ బాధ్యతలూ అనుభవిస్తూ లెనిన్‌కూడా అక్కడే వున్నాడన్నభావం, తమ విజయాల్నీ నిర్మాణాన్నీ లెనిన్ నిశ్శబ్దంగా ప్రశాంతంగా చూస్తున్నాడన్న భావం - ఆ అన్యోన్యభావం వాస్తవంగా అమూల్యమైన పెన్నిధి!

ఒకరి తరవాత ఒకరుగా అతని దేశీయులు దర్శనంచేసి, లెనిన్ విగ్రహం గాఢంగా శాశ్వతంగా వారిహృదయాల్లో హత్తుకపోగా బయటికి వస్తున్నారు. ఆత్మానందంతో వెలుగొందుతూన్న వారి ముఖాలు మేము



రెడ్ స్క్వేర్‌లోవున్న లెనిన్ మహాశయుని భౌతికదేహాన్ని సందర్శించడానికి పోతూన్న ప్రజాప్రవాహం

చూస్తున్నాం. తమ తమ గ్రామ సోవియట్లలోనూ, సమిష్టి వ్యవసాయ భూముల్లోనూ నవ్యనాగరికతాజ్యోతిని వెలిగించడానికి దేదీప్యమానమైన అతని నిరుపమానశక్తినుండి ఒక తేజోకణాన్ని తమతో తీసుకువెళుతున్నారుగాబోలు!

## క్రెమ్లిన్‌లోని స్వాప్నికుడు

యూరప్‌లోనూ, అమెరికాలోను వున్న సోవియట్ వ్యతిరేకులు "క్రెమ్లిన్ * లో వున్న చిన్న మనిషి" అని లెనిన్ మహాశయుణ్ని వెక్కిరిస్తూ అనేవారు. అతనూ అతని మహాకార్యక్రమాలు ఒకవేపూ, అజ్ఞానంలో దోపిడీలో దారిద్ర్యంలో యాతనలో మునిగివున్న పదిహేను కోట్ల రష్యన్ ప్రజానీకం ఒకవేపు చూస్తే ఆశ్చర్యంవేస్తుంది.

అసంఖ్యాకంగా 'స్వప్నాలు'కంటూన్న హెచ్. జి. వెల్సు ఒకసారి ఆయనను క్రెమ్లిన్‌లో చూసేడు. సోవియట్ దేశమంతటా విద్యుచ్ఛక్తిని నిర్మించడానికి తను వేసిన ప్లానుగురించి లెనిన్ యెంతో ఆశాపూరితంగానూ వుత్సాహంగానూ వెల్సుతో మాటాడేడు.

"విద్యుచ్ఛక్తి నిర్మాణమనే పెద్ద కలకంటున్నాడు యీ ఛాందసపు మార్క్సిస్టు! దీనిగురించి యితను గాఢవిశ్వాసంతో మాటాడుతున్నాడు. ఇతని ప్లాన్లు ఎప్పటికైనా జరుగుతాయని నా ఊహకుకూడా స్ఫురించకుండా వుంది!" అని వెల్సు ప్రపంచానికి చెప్పేడు.

ఇటువంటి సందేహాల్ని చూసి లెనిన్ కళ్లు మెరిసేయి. "పదేళ్ళ తరవాత రష్యాకురండి. మేం చేసినదేమిటో చూదురుగాని!—" అన్నాడు లెనిన్.

ఇది జరగడం 1920 లో - "క్రెమ్లిన్‌లోవున్న స్వాప్నికుడు" అని అప్పుడు వెల్సు హాస్యంచేశాడు.

స్వతంత్రుడుగా ఐదేళ్ళు మాత్రమే లెనిన్ రష్యాకు సేవచెయ్యగలిగేడు. ఆ స్వల్పకాలంలోనే విప్లవఉద్యమాన్ని నిర్మించి విప్లవాన్ని విజయవంతం చేయగలిగేడు. యూరపియన్ యుద్ధంనుండి రష్యాను తప్పించగలిగేడు. స్వదేశంలోని అంతర్యుద్ధాన్ని అణచివేసి సుస్థాపితమైన ఒకసరికొత్తరకం ప్రభుత్వాన్ని సృష్టించగలిగేడు. రష్యాప్రజలకు నవజీవనాన్ని

* మాస్కోలోవున్న సోవియట్ ప్రభుత్వ కార్యాలయం — అనువాదకుడు.

ప్రసాదించేడు. బాహ్యప్రపంచాన్ని సవాలుచేసేడు. పసిపిల్లల్ని ముద్దులాడుతూ నవ్వుతూ గృహజీవితాన్ని ప్రేమిస్తూ నిగర్వంగా నిశ్చలంగా తాను జీవించేవాడు.

అనుకోకండానే మా మనస్సులు భారతదేశానికి వెళ్ళేయి. సబర్మతి ఆశ్రమ గ్రంథాలయంలో మేం చదివిన "లెనిన్ - గాంధీ" అన్న పేరుతో రెనె ఫులప్ - ముల్లర్ రాసిన పుస్తకం జ్ఞాపకంవచ్చింది. రెండు వేరు వేరు దేశాలు, యిద్దరు వేరు వేరు నాయకులు. మానవజీవితానికీ స్వాతంత్ర్యానికీ సంబంధించిన ఒకేమాదిరి సమస్యలు. కాని నాయకుల వ్యక్తిత్వాలలోనూ, వారి వారి పద్ధతులలోనూ, యెంతోభేదం వుంది!

## భా ష తె లి య క పో యి నా

రోజూ సోవియట్ దేశంలోని విషయాల్ని చూడడానికి తిరిగేవాళ్ళం. ఉదయం తొమ్మిది గంటలకు ఫలహారంచేసి మధ్యాహ్నం మూడు గంటలకు భోజనంచేసేలోపుగా, పాఠశాలలూ, ఫ్యాక్టరీలూ, వైద్యశాలలూ, శిశుపోషణాలయాలూ, (క్రెచీస్) కిండరుగార్డెన్లు మొదలైన ప్రజాసంస్థలను ప్రభుత్వం మాతోపంపిన సహాయకుల తోడ్పాటుతో చూసి సోవియట్ ప్రజల గురించి తెలుసుకొనేవాళ్ళం. మధ్యాహ్నం నాస్తా అయ్యేక మా అంతట మేమే పార్కులలోనూ, విలాసప్రదేశాలలోనూ, కార్మికుల క్లబ్బులలోనూ, విశ్రాంతిస్థలాల్లోనూ, భూగర్భరైల్వేస్టేషన్లలోనూ, బజార్లలోనూ, రెస్టారెంట్లలోనూ ప్రజలనుకలుసుకొని వారి స్థితిగతులను తెలుసుకొవడానికి వెళ్ళేవాళ్ళం. సోవియట్ దేశపు విశేషాలు స్వయంగా సోవియట్ ప్రజల నోటినుండే తెలుసుకోవడానికి మాకు రష్యనుభాష రాకపోవడం చాలా పెద్ద అడ్డంకి. ఇతరభాషాజ్ఞానంకూడా యీ అడ్డంకిని దాటడానికి సాధ్యం కాదు. కాని అప్పుడప్పుడు జర్మన్, ఫ్రెంచి అరుదుగా ఇంగ్లీషుభాషలు మాటలాడగలవారు మాకు కలిసేవారు. అప్పుడు వారితో మాకు పరిచయం అయ్యేది. దుభాషులద్వారా మాట్లాడినవాళ్ళు మినహా - మాఅంతట మేము పై భాషల్లో సుమారు నూరుమందితో మాట్లాడివుంటాము. ఐదారుగురు వాళ్ళ యిళ్ళకుకూడా రమ్మనమని హృదయపూర్వకంగా ఆహ్వానించారు. మేం వేసే ప్రశ్నపరంపరలన్నింటికి, విసుక్కోకుండా, ఓపికతో, స్నేహంతో, హృదయంవిప్పి సమాధానాలు చెప్పేవారు.

## ఎక్కువపని - ఎక్కువవేతనం

ఒకనాడు భోజనాలదగ్గర ఒక కొత్త వ్యక్తిని కలుసుకున్నాం. "కషా"* ఆరగింపులయ్యేవరకూ సంభాషణప్రారంభంకాలేదు. ఆవిడ తన్ను తాను పరిచయం చేసుకుంది. ఆవిడ కీవ్‌పట్టణ కార్మికసంఘానికి అర్గనైజరుగావుంది. మమ్మల్ని మేం పరిచయ పర్చుకున్నాం. మాకు అవకాశం వున్న స్వల్పకాలంలో సోవియట్ యూనియన్ గురించి సాధ్యమైనంత యెక్కువ విషయాలు తెలుసుకోవడానికి ఆతృతతోవున్నాం అని చెప్పేం. ఆవిడ కార్మికసంఘం ఆర్గనైజరుగాబట్టి సోవియట్‌దేశ కార్మికుల కూలీ పరిమితిగురించీ, ఆదాయంగురించీ చెప్పమన్నాం. పరిశుద్ధమైన ఇంగ్లీషు భాషలో ఆమెమాటాడింది. వాదోపవాదాల్లో తర్ఫీజుపొందిన మనిషిలాగ మాటాడింది.

" అంతర్యుద్ధం అయిపోయిన వెంటనే కొన్ని సంవత్సరాలవరకూ అందరికీ సమాన వేతనాలు అన్న నినాదాన్ని అనుసరించి మేం పనిచేసేం. కాని అది సాగిందికాదు. తుపాకితోనో, మెషిన్‌గన్‌తోనో యుద్ధరంగాల్లోని పనికి అలవాటుపడిన వాళ్లు ఫ్యాక్టరీపనులకీ, వర్కుషాపుల్లోని పనుల క్రమశిక్షణకీ మోజుపడలేదు. దీనిఫలితంగా చాలామంది పనుల్లో శ్రద్ధచూపలేదు. తక్కినవాళ్లు బాతాఖానీతోనూ, ధూమపానంతోనూ సోమరితనంగా ప్రవర్తించేరు. తత్కారణంగా ఉత్పత్తి తగ్గిపోయింది. క్రమశిక్షణ అన్నది యెక్కడా కనిపించలేదు. ప్రతివిషయం అరాజకమైపోయింది. అప్పుడు సమానంగా చేసినపనికి సమానవేతనం అని కాకండా, అధికంగా చేసిన పనికి అధిక వేతనం యివ్వడమే సామ్యవాద కార్య నిర్వహణకు వుండవలసిన పద్ధతని గుర్తించబడింది. కార్మికులకు బాగాతర్ఫీదు యివ్వబడింది. క్రమవిధానం యేర్పాటుచేయబడింది. ప్రతితరహాపనికీ, ప్రతియంత్రానికీ ఉత్పత్తి పరిమితులు యేర్పరుపబడ్డాయి. కార్మికుల క్రమశిక్షణ తీవ్రంచేయబడింది. మందంగా పనిచేసేవాళ్ళూ పనులకు హాజరుకానివాళ్ళూ గట్టిగా శిక్షింపబడ్డారు. చేసిన పనినిబట్టి వేతనాలు యిచ్చేపద్ధతి ఇప్పుడు ప్రవేశపెట్టబడింది. కార్మికుడు యెక్కువగా పనిచేసినట్టయితే అతడు దేశానికి యెక్కువ మేలుచేసినవాడవుతున్నాడు. కాబట్టి ఆ కార్మికుడు యెక్కువ వేతనానికి అర్హుడవుతున్నాడు.

---

* పోరిడ్జి మోస్తరు వంటకం — అనువాదకుడు.

"ఈవిషయాన్నే మేము కార్మికసంఘసభ్యులకు నచ్చచెపుతూంటాం.

"దేశం అంతా అచ్చంగా ప్రజలది. ప్రజకీ ప్రభుత్వానికీ వైషమ్యం లేదు. అంచేత హెచ్చు కష్టపడడంవల్ల వచ్చేలాభం అంతా కార్మికులదీ. కర్షకులదీ. ఈలాభాన్ని దొంగిలించే పెట్టుబడిదార్లుగాని, భూఖామందులు కాని మాదేశంలోలేరు.

"హెచ్చుపనిచేస్తే - హెచ్చు ఆదాయం - హెచ్చు ఉత్పత్తి - హెచ్చు సౌకర్యాలు హెచ్చు సౌఖ్యజీవనం - హెచ్చు విజ్ఞానం!

"సోవియట్ దేశాన్ని మీరు సరిగ్గా అర్థంచేసుకోవాలంటే ఈ సంగతులు మాత్రం జ్ఞాపకం వుంచుకోండి."

సామ్యవాద ఆర్థికంలోని యీ ప్రథమ పాఠంతో మాదేశాటనాన్ని ప్రారంభించేం.

## ఉద్యోగంకోసం వేచివుండనక్కర్లేదు — నిరుద్యోగం వుండనక్కరలేదు

వ్యవసాయక్షేత్రాల్లో, ఫ్యాక్టరీల్లో, షాపుల్లో, స్టోర్లలోనూ, ఆఫీసుల్లోనూ - వెళ్ళిన ప్రతిచోటా కార్మికుల వేతనాలగురించి మేముభోగట్టాచేసేం.

కొత్తగా గ్రామంలోంచివచ్చి నైపుణ్యంలేని కార్మికునికి మాసానికి దాదాపు నూటాయేభై రూబుల్లు కిడుతుంది. అటువంటి కొత్తగా వచ్చిన యువకులకు వారి వ్యవధికాలంలో శర్ఫీదుయిచ్చి సాధ్యమైనంత వేగంగా కొంత నైపుణ్యంగల కార్మికులుగా తయారుచేస్తారు. ఆవిధంగా అతని ఆర్జించేశక్తి అధికంచేయబడుతుంది. అటువంటి కార్మికుడు పట్టణానికి వచ్చినవెంటనే ఆ యా పేటలలోని స్థానిక సోవియట్ అధికారులు అతని పేరును రిజిస్టరుచేస్తారు. స్థానిక సోవియట్, కొత్తగావచ్చినతని గురించి సమీపంలోవున్న కార్మిక సంఘ కార్యాలయాలకు (Tradeunion Offices) కబురుపెడుతుంది. కార్మికసంఘ అధికారి వెంటనే అతనితో సంబంధంపెట్టుకొని, ఒక క్షణంకూడా ఆలస్యంచెయ్యకండా అతనికి తగిన పనిని ఏర్పాటుచేస్తాడు. ఈవిధంగా, ఎవరూ ఉద్యోగంకోసం వేచివుండనక్కరలేదు, నిరుద్యోగిగా వుండనక్కరలేదు. అప్పటినుండీ కార్మికసంఘ ఆర్గనైజరు అతనికి ముఖ్యస్నేహితుడూ మార్గదర్శకుడూఅవుతాడు. అతని వసతికీ భోజనాకీ సౌకర్యాలు ఏర్పాటుచేయబడతాయి. ముప్పైనలభై రూబుళ్ళ

మధ్య ఈసౌకర్యాలు అమరుతాయి. కొంత నైపుణ్యం సంపాదించిన కార్మికులు మాసానికి రెండువందలయాభై రూబుళ్ళవరకూ ఆర్జించగలరు. నిపుణత గల కార్మికులూ సాంకేతిక పాఠశాలలనుండి వచ్చిన యువకులూ మొదట్లో సగటున దాదాపు మూడువందల రూబుళ్లు సంపాదించగలరు. ఐదువందల రూబుళ్లూ, ఎనిమిదివందల రూబుళ్ళవరకుకూడా అనుభవం సంపాదించేక ఆర్జించగలరు. ఫ్యాక్టరీల్లోనూ, మెషిన్‌షాపుల్లోనూ వున్న ఫోర్‌మన్లూ, ఫ్యాక్టరీల్లోని ఇంజనీర్లూ, ఆఫీసుల్లోనూ, ఫ్యాక్టరీలూ, తదితరవ్యారసంస్థల్లోనూ వున్న డైరెక్టర్లూ మాసానికి వెయ్యినుండి పన్నెండు వందలవరకూ, ఒకొక్కప్పుడు యింకా యెక్కువగాకూడా గడించగలరు.

ట్రాం కండక్టర్లూ, మోటారు డ్రైవర్లూ, పోలీసుజమాన్లూ, ఫైర్‌మెన్, పోస్ట్‌మెన్, రిస్టారెంట్లలో పనిచేసేవాళ్లూ, షాపుల్లోని గుమస్తాలు, ధియేటర్లలోనూ, సినిమాలలోనూ, హోటళ్ళలోనూ, అటెన్‌డెంట్లుగా వున్నవాళ్లూ, యీవిధమైన తక్కిన కార్మికులూ మాసానికి మూడువందల నుండి నాలుగువందల రూబుళ్ళవరకూ సంపాదిస్తున్నారు.

ఫ్యాక్టరీల్లోనూ, బేంకుల్లోనూ, ఆఫీసుల్లోనూ, పనిచేసే గుమస్తాలకు మూడువందలనుండి ఐదువందల రూబుళ్ళవరకూ వేతనాలివ్వబడుతున్నాయి. ఉపాధ్యాయులకూ, ఉపాధ్యాయినులకూ నాలుగువందలనుండి ఎనిమిదివందల రూబుళ్ళవరకూ జీతాలివ్వబడుతున్నాయి.

విశ్వకళా పరిషత్తులోని సహాయోపన్యాసకులకూ వుపన్యాసకులకూ, శాస్త్రజ్ఞులకూ, వ్యవసాయ నిపుణులకూ, డాక్టర్లకూ, పశువైద్యులకూ, చిత్రకారులకూ, సంగీతజ్ఞులకూ, సుమారు ఎనిమిదివందల రూబుళ్ళవరకూ వేతనాలు ముడతాయి. యూనివర్శిటీలో ప్రొఫసర్లూ, ఉత్తమ శాస్త్రజ్ఞులూ, విఖ్యాతులైన వైద్యులూ, ఎన్నికగన్న చిత్రకారులూ, సంగీతవేత్తలూ, కళావేత్తలూ, న్యాయవాదులూ రెండువేలరూబుళ్ళవరకూ పెద్ద పెద్ద జీతాలు పుచ్చుకుంటున్నారు.

## ప్రతిఒక్కరికీ ఆదాయం వుంది

అయితే ధరలసంగతేమిటి? షాపుల్లోకివెళ్ళి ధరలు భోగట్టాచేసే సరికి, మాకు పరమాశ్చర్యం కలిగింది. ధరలు అంత అత్యధికంగా వున్నాయి. క్రీపుజోళ్ళ జతఖరీదు రెండువందల యాభై రూబుళ్లు, సాధారణం తోలుజోళ్ళు రెండువందలరూబుళ్ళు; స్త్రీల క్రీపుజోళ్ళు రూ 250; పిల్లల

జోళ్ళు రూ 50; ట్వీడుసూటు ఖరీదు వెయ్యిరూబుళ్లు; నూలుకమీజు రూ 30 నుండి 40 వరకూ ఖరీదు. ఒక పౌనువెన్న రూ 20, ఒక పౌనురొట్టె వెల రూ 2, ఒక్కొక్క కోడిగుడ్డు వెల 50 కోపెక్కులు, ఒక పేకెట్టు రష్యన్ సిగరెట్ల వెల రూ 5, ఏపిల్ పండు ఒక్కొంటికి 20 కోపెక్కులు. కేబేజీ, కాలీఫ్లవరు పౌను ఒక్కొంటికి రూ 2, పియర్సు, చెర్రీసు, పీచ్సు, ప్లమ్స్ మొదలైన పళ్లు పౌను రూ 4, మాంసం పౌను రూ 4, కొవ్వు పౌను రూ 4, పోర్కు పౌను రూ 12, దోసకాయలు, ఖర్జూజాపళ్లు, మూలుగులు ఒక్కొంటికి 20 కోపెక్కులు.

కాని చిత్రం ఏమిటంటే ధరలు ఇంతవిపరీతంగావున్నా, షాపులు ఖాళీ లేకుండావున్నాయి. స్టోర్లలో గుంపులుగా ప్రజలున్నారు. బజార్లు క్రిక్కిరిసి వున్నాయి. మా ముందున్న జోళ్ళషాపుబేరగాళ్ళతో నిండిపోయింది. కాయగూరలూ, పళ్లూ కుప్పలుగా వేయబడ్డాయి. రైతులతో ప్రతిఒక్కరూ బేరమాడుతున్నారు. కెఫేలు, రిస్టారెంట్లు అతిధులతో నిండిపోయివున్నాయి వచ్చేవారు, వెళ్లేవారు లెక్కలేదు. వీధికి ఇరుప్రక్కలను వున్న దుకాణాల్లో టమాటాలు,కారట్ దుంపలు,కేబేజీలు, ఏపిల్‌పళ్లూరాసులుగా పోసివున్నాయి. ప్రజలు గుంపులుగావచ్చి కొనుక్కుపోతున్నారు. రెడ్‌స్క్వేర్ ప్రక్కన వున్న పెద్ద మార్కెట్‌కు వెళ్ళాం వస్తువులు కొనుక్కోవడానికి వచ్చిన స్త్రీ పురుషులతో దుకాణాలన్నీ కిటకిటలాడుతున్నాయి. ఒక్క షాపునుండి యింకొక షాపుకు వాళ్లు పరుగెడుతున్నారు. ఒక వస్తువ యిక్కడ తీసు కొంటూ, అక్కడ యింకొకటి బేరమాడుతూ, అందరూ చేతులనిండా వస్తు వులతో వున్నారు. మార్కెట్‌లో ఇసకవేస్తే రాలకుండా వున్నారుజనం.

ధరలు యింత యెక్కువగావుంటే, బజార్లల్లో యింత నిండుగా వస్తువులున్నాయేం? ఇంతమంది వాటికోసం తహతహలాడుతున్నారేం?

అప్పుడు మాకు సోవియట్‌దేశపు వాస్తవిక పరిస్థితి జ్ఞాపకానికి కొచ్చింది. పెట్టుబడిదారీ దేశాల్లో ప్రతిఒక్క కుటుంబంలోనూ, కుటుంబం అంతటికీ పోషించేవాడు ఒక్కడేవుంటాడు. కుటుంబంలో యింగా ఒక ళ్ళిద్దరు స్వల్పవధికాలంలో కాస్త సంపాదిస్తారు. కాని సోవియట్ దేశంలో ప్రతి ఒక్కరూ జీతాలు సంపాదించే కార్మికులే; లేకపోతే పించనీపుచ్చు కుంటున్నవారో, ప్రభుత్వం పోషిస్తున్నవారో అయివుంటారు. ఐదుగురు వ్యక్తులుగల ఒక కుటుంబంవుంటే పసిపిల్ల మినహా ప్రతి ఒక్కరూ యింతో అంతో కుటుంబ వ్యయాన్ని భరిస్తున్నవారే.

## పన్నులు

ఇక పన్నుల విషయం. తన ఆదాయంలో సగటున సూటికి పది వంతున ఇంటి అద్దెకోసం సోవియట్ పౌరుడు యివ్వవలసివుంటుంది; దీపాలకూ, నీటికీ ఆదాయంలో ౩ం/ం పన్ను వుంటుంది. ఇదివరకు తాము కాపురముండే ఇళ్లు పడగొట్టిన కుటుంబాలకూ, నివసించడానికి అయోగ్యమైన యిళ్లుగల కుటుంబాలకూ, ప్రభుత్వం యిళ్లు కట్టుకోవడానికి ఉచితంగా స్థలాలూ, కొంతడబ్బూ, అంతేకాకండా, కార్మికుల్నీ యింటికి కావలసిన సామాన్లూ ప్రభుత్వం తక్కువధరలకు యిస్తుంది.

సంవత్సరానికి రెండువేల రూబుళ్ళకులోపు ఆదాయాలుగలవారికి ఇన్‌కంటేక్సులేదు. రెండువేలకూ, ఆరువేలకూ మధ్య ఆదాయంగలవారు 2ం/ం యిన్‌కంటేక్సు చెల్లిస్తారు. పదివేల రూబుళ్ళకు పైగా ఆదాయం గలవారికి సుమారు 2½ం/ం, 20 వేలకు పైగా ఆదాయంగలవాళ్లు సుమారు 5ం/ం పన్నూ, చెల్లిస్తారు. తరవాత ఆదాయం పన్ను క్రమేపీ యెక్కువవుతూ, 30 వేల రూబుళ్ళ ఆదాయంగలవారు 25ం/ం చెల్లిస్తారు. మొత్తం ఆదాయంలో 2ం/ం నుండి 5ం/ం వరకు విద్యాసౌకర్యాలకోసం పన్ను చెల్లించవలసివుంటుంది. ఇంచుమించు ప్రతిఒక్కరూ కార్మిక సంఘ సభ్యులు కావడంవల్ల, ఆదాయంలో 1ం/ం సంఘానికి చెల్లించవలసి వుంటుంది. ప్రభుత్వమే అనారోగ్యానికి ఇన్సురెన్సు చేయడంవల్ల దీనికేమీ చెల్లించనక్కరలేదు.

## ఒక కుటుంబాదాయం

ఉదాహరణానికి ఇదిగో యీ కుటుంబం విషయం చూడండి. ఈ కుటుంబంలో తండ్రి, తల్లి, యిద్దరుకూతుళ్లూ, ఒకకొడుకూ, 65 సంవత్సరాల వయస్సుగల నాయనమ్మా మొత్తం ఆరుగురువున్నారు. భర్త బాల్‌బేరింగ్‌ప్లాంట్‌లో మెషీనిస్టుగావుండి సుమారు మూడువందల రూబుళ్లు సంపాదిస్తున్నాడు; భార్య పోస్టాఫీసులో గుమస్తాగా పనిచేస్తూ 450 రూబుళ్లు తెస్తూంది; పెద్దకూతురు పట్టణంలోని ఒకరొట్టెల ఫ్యాక్టరీలో కేక్సు డిజైనర్‌గా పనిజేస్తూ 500 రూబుళ్లు సంపాదిస్తుంది; చిన్నకూతురు ట్రాఫిక్ కానిస్టేబుల్‌గా పనిజేస్తూ 350 రూబుళ్ళు సంపాదిస్తూంది; పిల్లవాడు పుస్తకాలషాపులో సహాయకుడుగావుండి 250 రూబుళ్ళు తెచ్చుకుంటున్నాడు; నాయనమ్మకీ వృద్ధాప్యపు ఉచితవేతనం 80 రూబుళ్ళు.

కుటుంబం మొత్తం ఆదాయం మాసానికి సుమారు రెండువేల రూబుళ్ళు. ఇటువంటి కుటుంబాదాయాలు సర్వసామాన్యంగా వుంటాయనీ, యెక్కడో ఒకచోట జరిగే అబ్బురాలుకావనీ వాళ్ళు మాకు చెప్పారు.

## మూ డు త రా లు

అంతకుముందురోజు విశాఖపట్నం తంతిఇవ్వవలసివచ్చి టెలిగ్రాఫ్ ఆఫీసుకు వెళ్ళినప్పుడు ఆమెతో పరిచయం తటస్థించింది. తనయింటికి రమ్మనమని ఆహ్వానించింది. ఆరు అంతస్తుల భవనం. అందులో ఒక భాగం వీరిది. భార్యా భర్తలకు ఒక గది. ముసలమ్మ, మనవరాళ్ళిద్దరు కలిసి ఒక గది. ముందుగదే డ్రాయింగురూము, భోజనాలగదిన్నీ. రాత్రి పూట అబ్బాయి ఆగదిలోనే సోఫామీదపడుకుంటాడు. ఇల్లు కొంచెం ఇరకాటమే. వంటగది చాలా చిన్నది. ఎలెక్ట్రిక్కుపొయ్యి. ఇంటిపనులు స్వయంగానే చేసుకోవాలి - పనిమనుషులు వుండరు. అంచేత వంట చాకిరీ తగ్గించుకోవడానికి. సాయింకాలం టీ, పొద్దున్న ఫలహారం ఇంట్లో తీసుకుని, మిగతా భోజనం రెస్టారెంట్లలో చేస్తామన్నారు. ముసలమ్మగారు కూడా "హోటల్లో భోజనమే రుచికరంగాను సరదాగాను వుంటుంది - పైపనులు చేసుకోవడం తప్పుతుంది." అన్నారు.

బాతాఖానీ కొడుతూ టీ తాగేం. కుటుంబంలో అందరూ పొత్తుగాను ఆపేక్షగానున్నారు. ముసలమ్మ మనమల అపారమైన తెలివితేటల గురించి అదేచెప్పడం, తల్లి తండ్రులకు తమ పిల్లలమీద సగర్వమైన ప్రేమ - ప్రపంచకం అంతట ఒక్కలాగే ఉంది. తమ తల్లి తండ్రుల పని తనం, నైపుణ్యం, కార్యదీక్ష గురించి నిజప్రేమతోనూ సహజమైన గర్వంతోనూ పిల్లలు చెప్పడం - ఇదిమాత్రం మాకు కొత్తగాను ఎంతో సరదాగాను వుండెను.

సోవియట్‌లో జీవనం మొదలైన సంగతులొచ్చాయి - మీ ఆదాయం ఎలాగుంటుందంటే, అందుకు జబాబుచెప్తూ ఇలాచెప్పాడు అతను.

## స వా ల్ !

"మా ఆదాయానికితోడు, ప్రభుత్వం యిచ్చే అనేక యితర సౌక ర్యాలు ఇంకా కలపాలి. ఇవి సాధారణంగా మాకు ఉచితంగానో, చాలా కొద్దిఖర్చుతోనో, అంటే నామమాత్రమైన ఖర్చుతో వస్తాయి. ఉదాహర

ఋకు. ఉచితవైద్యసహాయం, కార్మికుల ఇన్స్యూరెన్సూ, వృద్ధాప్యానికీ, అనారోగ్యంగలవారికీ చేసే ఇన్స్యూరెన్సూ యితర సౌకర్యాలూ, జీత నష్టంలేకుండా సెలవులూ, ఆరోగ్యస్థలాల్లో ఉచితవైద్యసహాయమూ, వీటన్నిటికన్నా ముఖ్యంగా మా పిల్లలకు వుచితంగా యిచ్చే సాంకేతిక విద్య. మా కార్మికసంఘం ప్రభుత్వం మాకు యిస్తూన్న యీ అమూల్య మైన సౌకర్యాలకు, ఉపచారాలకు డబ్బుతో విలువకట్టగలమా? మీదేశంలో యిటువంటి వేవీలేవని నేను పందెంవేస్తాను!"

## మాస్కో యూనివర్సిటీ

ఈవేళ మాస్కో విశ్వకళాపరిషత్తు తెరుస్తారు. సెలవులయ్యేక తెరిచేరోజున వుండే అడావుడి చూద్దామనుకుని అక్కడికి వెళ్లేం. పదహారుసంవత్సరాల నుండి ఏభై సంవత్సరాల వరకూ వయస్సుగల స్త్రీ పురుషులతో విశ్వ విద్యాలయావరణ అక్షరాలా నిండిపోయింది. పెద్ద వయస్సులుగల స్త్రీ పురుషులు, తమ తమ కుమారులనూ కుమార్తె లనూ విశ్వవిద్యాలయములో ప్రవేశపెట్టడానికి వచ్చిన తలిదండ్రులని మొదట మే మనుకున్నాం. కాని వాళ్లే అనేక తరగతులలో చేరు తుండడంచూసి మాకు చాలా ఆశ్చర్యం వేసింది! అనేక గదుల్లోను హాలుల్లోనూ తిరుగులాడేం. చాలా నోటీసుబోర్డులు చదివేక, చాలా ప్రయత్నాలూ పొరపాట్లూ జరిగిన తరవాతా, యెలాగైతేనేం ఇంగ్లీషు భాషాసహాయోపన్యాసకుడుగా వున్న ఒక యువకుణ్ని కలుసుకోగలిగేం. మమ్మల్ని మేం పరిచయం చేసుకున్న తరువాత సోవియట్ విద్యావిధానం గురించి కొన్ని విషయాలు చెప్పవలసిందని ఆయన్ని కోరేం. ఇదివరకు మేం తెలుసుకొన్న సంగతులుకాక ఆయన కొన్ని విషయాలుకూడా చెప్పేడు.

## ఆటల్లో చదువు

పౌరుల విద్యగురించీ బాలబాలికల విద్యగురించీ సోవియట్ ప్రభుత్వం అవలంబించిన శ్రద్ధా క్రమపద్ధతులవల్ల తలిదండ్రులకు ధన వ్యయం లేకండా పోయింది. ఇందుకు సోవియట్ ప్రభుత్వానికి మేం కృతజ్ఞులం. మూడు లేక నాలుగు సంవత్సరాల వయస్సప్పుడు శిశువిద్యా లయంలో బాలబాలికల విద్య ప్రారంభం అవుతుంది. వాళ్లు ఎనిమిదేళ్ళ

వరకూ అందులోనే చదువుకుంటారు. ఆడుతూ పాడుతూ పిల్లలు ప్రతి విషయమూ నేర్చుకుంటారు. పిల్లలకు వయస్సుపైబడుతున్నకొద్దీ చదవడం, రాయడం, గణితం, నృత్యం, దేహపరిశ్రమ, సంగీతం, చిత్రలేఖనం మొదలైనవాట్లో అరగంటనుండి గంట పరిమితి కాలంలో రోజుకు రెండు చిన్న పాఠాలు బోధింపబడతాయి. ఈ శిశు విద్యాలయంలో వున్న కాలం అంతటా పిల్లలకు సమిష్టిభావంతో పనిచేయడమూ చదవడమూ ఆడుకోవడమూ జీవించడం నేర్పుతారు.

ఎనిమిది సంవత్సరాలకు పిల్లలు పాఠశాలలో చేరుతారు. అప్పటి నుండి పదహారేళ్లు వచ్చేవరకూ నిర్బంధంగా విద్యనభ్యసించాలి. విద్యాభ్యాసానికి ఏమీ ఖర్చుచెయ్యనక్కరలేదు. మామూలుగా వుండే విషయాలతో బాటు, వస్తుప్రదర్శనశాలలకూ ఫ్యాక్టరీలకూ పరిశ్రమలకూ వెళ్ళి విద్యార్థులు నేర్చుకుంటారు; రాజకీయపాఠాలుకూడా వుంటాయి. నిజమైన శాస్త్రీయ పద్ధతిలో అంటే మార్క్సిస్టు దృక్పథంతో చరిత్ర భూగోళశాస్త్రం బోధింపబడతాయి. విద్యార్థిబుద్ధి నిర్మించడం కంటె అతని ప్రవర్తనకూ వ్యక్తిత్వానికీ వికాసం కలిగించడమే మా విద్యావిధానం యొక్క ముఖ్యాశయం. విద్యార్థికీ, సమాజానికీ సామ్యవాద ప్రభుత్వానికీ అప్పటికే యేర్పడిన సన్నిహిత సంబంధంతోబాటు, భావిపౌరుడైన విద్యార్థిని అన్ని విషయాలూ తెలుసుకున్న వ్యక్తిగా పెంపొందించడానికి విద్యావిధానం యెక్కువ శ్రద్ధతీసుకుంటుంది.

## హైస్కూళ్లు

యువకులు పదహారేళ్ళవయస్సు వచ్చేటప్పటికి ఉన్నతవిద్య పూర్తి అవుతుంది. అప్పుడు తమకు యిష్టమైన వృత్తిలో ప్రవేశించడమో, లేకపోతే పద్దెనిమిది సంవత్సరాలవరకూ కళాశాలలో చదవడమో నిశ్చయించుకుంటారు విద్యార్థులు. సాంకేతికవృత్తిని వాళ్ళు యెన్నుకున్నట్టయితే, సాంకేతిక విద్యాశాలల్లో ప్రవేశించి, మొత్తంకాలంలో సగం ఆచరణద్వారా నేర్చుకుంటూ నాలుగేళ్ళు విద్యాభ్యాసంచేస్తారు. ఫ్యాక్టరీలలో పనులు నేర్చుకొనేవాళ్లుకూడా సాంకేతిక కళాశాలల్లో చదువుతూ, వాళ్ళ ఫ్యాక్టరీలకు అనుబంధంగావున్న కార్మికపాఠశాలలకుకూడా వెళ్ళాలి.

పట్టణాలలోవున్న బాలురు, బాలికలు, పదహారేళ్ళవయస్సు వచ్చేవరకున్నూ, గ్రామాల్లో పదిహేనేళ్ళవరకున్నూ నిర్బంధంగా విద్యనేర్చు

కోవాలి. మూడో పంచవర్ష ప్రణాళిక అచరణలోకి వచ్చేటప్పుడు యీ నిర్బంధవిద్య పట్నాల్లోనూ, గ్రామాల్లోనూ, సర్వత్రా పద్దెనిమిదేళ్ళవరకు పెంచడానికి అప్పుడే ఏర్పాట్లుచేశారట.

విశ్వవిద్యాలయు ప్రవేశం పూర్తిగా యోగ్యతననుసరించి వుంటుంది. ఒక పద్ధతి ప్రకారం కొత్తగా చేర్చుకోవలసినవారి సంఖ్యను, దేశ అవసరాన్నిబట్టి ప్రభుత్వం నిర్ణయిస్తుంది. ప్రతివిషయంలో సిద్ధాంతపరిశోధనా, ప్రయోగపరిశోధనా రెండూ ప్రోత్సహింపబడతాయి.

## విద్యాభ్యాసం ఉచితం

ఉన్నత పాఠశాలలోనైతేనేం, సాంకేతిక పాఠశాలలోనైతేనేం, విశ్వవిద్యాలయంలోనైతేనేం, సాంకేతిక కళాశాలలోనైతేనేం విద్యాభ్యాసం కేవలం ఉచితంగా వుండడం ఎక్కువగా మా మనసుకు నాటింది. ఇంతే కాకండా ప్రతి విద్యార్థికీ ప్రతితరగతిలోనూ - పుస్తకాలు, బట్టలు మొదలైన వాటి ఖర్చులనిమిత్తం వందనుండి రెండువందల రూబుళ్ళవరకూ విద్యార్థి వేతనాలు వస్తాయి. ఫ్యాక్టరీలలో పనులు నేర్చుకొనేవారికీ, తర్ఫీదుపొందుతూన్న సాంకేతిక విద్యార్థులకీ, వాళ్లుచేసిన పనినిబట్టి మామూలుగా కార్మికులకు ఎంతైతే వేతనాలు యిస్తారో అంతా ఇస్తారు. ఈ అదనపు రాబడిని వాళ్ళ చిత్తమొచ్చినట్టు విద్యార్థులు ఖర్చుచేసుకుంటారు.

ఊహకు అందే అన్ని విషయాలు నేర్చుకోవడానికి విద్యార్థులు అధ్యయన తరగతులు (Study circles) యేర్పరుచుకుంటారు. వారి వారి అత్యంతాభిరుచిగల విషయాల్లో విద్యార్థులు బాగా కృషిచేసేటట్టు ప్రభుత్వం ప్రోత్సహిస్తుంది. సామ్యవాద నాగరికతాజ్యోతిని ప్రసరింపజేయడానికి విద్యార్థులు అప్పుడప్పుడు సమిష్టి వ్యవసాయక్షేత్రాలకు వెళ్తారు. స్త్రీకీ పురుషుడికీ, ఒకజాతికీ యింకొకజాతికీ మధ్య భేదం, విద్యావిధానం అంతట్లో యెక్కడా కనిపించదు.

## విద్యార్థుల హక్కులు

ఆ ప్రొఫెసరుతో ఖాతాఖానీచేస్తూ యూనివర్సిటీ అంతా చూశాం.

మేం : మిమ్మల్ని ఒకవిషయం అడగాలి. మీ విద్యావిధానంలో విద్యార్థులకి ఏమేనా హక్కులున్నాయా ?

అతను : ఏం అలా అడుగుతున్నారు ?

మేం : ఏం లేదూ. సోవియట్ దేశంలో కుర్రాళ్లు చెప్పినట్టు మేష్టర్లు నడుచుకోవాలి - అలా నడచుకోని మేష్టర్ల క్లాసులు కుర్రాళ్లు సమ్మె చేసి పై అధికార్లకు రిపోర్టుచేస్తే ఆ మేష్టరుసని హజామతే! - అని మేం కొన్ని పుస్తకాల్లో చదివేంలెండి.

అతను : ఓహో! ఈ రాతలా! అయితే చెప్తాను వినండి. ప్రథమంలో మేష్టర్లలోను, ప్రొఫెసర్లలోనూ సోవియటుకు సుముఖులు కాని వారు కొందరుండేవారు. వారు క్లాసుల్లో సోవియటుకు వ్యతిరేకంగా అపభ్రంశాలు పలికితే - కుర్రాళ్ళు సహించలేక, వాళ్ళను క్లాసుల్లో నుంచేకాదు, విద్యాలయాల్లోనుంచికూడా తరిమేశేవారు. ఇప్పుడా రోజులు పోయాయిలెండి. ఆ పాతముఠా మేష్టర్లు కాలధర్మం పొందేరు. ఇప్పటి మేష్టర్లకి కుర్రాళ్ళకి తగాదాలులేవు.

మేం : మరొక్కవిషయం. కాలేజీలలోనూ, స్కూళ్ళలోనూ - దైనందిన వ్యవహారాల్లో విద్యార్థుల కేమేనా జోక్యం వుంటుందాండీ ?

అతను : వుండకేం? విద్యార్థులకి హక్కులూ వున్నాయి. బాధ్యతలూ వున్నాయి. క్రమశిక్షణ పెంపొందించడం, అందుకు వ్యతిరేకంగా ప్రవర్తించే కుర్రాళ్ళను శిక్షించడం, అది పూర్తిగా విద్యార్థిసంఘాలదే. "టైంటేబులు" ఏర్పాటులోనూ, కొంతవరకు "సిలబస్సు" నిర్ణయించడంలోనూ విద్యార్థులకు హక్కుంది. కుర్రాళ్లు మేష్టర్లు అందరూ మంచి ఉత్సాహవంతులవడంచేతనూ, విద్యావ్యాప్తిలోనూ నిరక్షరాస్యత రూపుమాపడంలో యువకులే అగ్రస్థానం వహించడం చేతనూ, విద్యావిధానం అంతా సరళంగానూ, సజీవంగానూ జరుగుతూంది - మా దేశంలో.

## వి ద్యా వ్యా ప్తి

విప్లవానంతరం సోవియట్ యూనియన్‌లోని విద్యావ్యాప్తిని తెలియజేసే మాస్కో గోడలమీద రాయబడిన సంఖ్యలు యివిగో :

4 కోట్లమంది ప్రజలకు చదవడమూ రాయడమూ నేర్పబడింది!
మూడుకోట్లమంది పిల్లలు పాఠశాలలలో చదువుతున్నారు!
ఏభై వేలు పాఠశాలా భవనాలు కొత్తగా నిర్మించబడ్డాయి!
పదమూడువేలు ఉన్నతపాఠశాలలు ప్రారంభించబడ్డాయి!

సోవియట్ దూరప్రాచ్యానికి చెందిన ఒకనాటి నిరక్షరాస్యులు





సోవియట్ దూరప్రాచ్యానికి చెందిన ఒకనాటి నిరక్షరాస్యులు

ఒకకోటిమంది ఉన్నతపాఠశాలా విద్యార్థులున్నారు!

మూడులక్షలమంది ఉన్నతపాఠశాలా ఉపాధ్యాయులున్నారు!

ఆరులక్షలమంది విద్యార్థులూ కళాశాలల్లోనూ విశ్వవిద్యాలయా ల్లోనూ వున్నారు! వీరిలో నూటికి నలభైమంది స్త్రీలు. మొత్తం విద్యా ర్థుల సంఖ్యలో నూటికి డెబ్భైఅయిదుమంది కర్షకుల పుత్రులూ పుత్రికలూ!

ఒక్క పదేళ్ళలో యెంత బ్రహ్మాండమైన విషయాన్ని సాధించేరు!

## పుస్తక ప్రచురణ

విద్య విషయంలో అత్యద్భుతమైన ఫలితాన్ని సాధించి సోవియట్ ప్రభుత్వం, దేశమంతటా వేలకొలది గ్రంధాలయాలు స్థాపించింది. వీటి తరువాత దేశంలో ముఖ్యమైనది పుస్తక ప్రచురణం. ప్రతి విషయంమీదా గ్రంథాలు రాసేటట్టు రచయితలను ప్రభుత్వం ప్రోత్సహించుతుంది. ప్రజలకు ఉపయోగంగావున్న పుస్తకాలను ప్రభుత్వ ప్రచురణాలయం ప్రచురిస్తుంది. అమ్మకాన్ని అనుసరించి రచయితలకు ప్రతిఫలం వస్తుంది.

మేం వున్నరోజుల్లోనే విద్యాలయాలు ప్రారంభంకావడంవల్ల, పాఠ్యపుస్తకాలు నిఘంటువులు, నోటుపుస్తకాలు, భూగోళపటములు మొద లైన వాటికోసం యువకులు షాపుల్ని ముట్టడించడం మేము చూడగలిగేం. పుస్తకాలన్నీ చెల్లిపోవడంచేత, చాలమంది బాలబాలికలు వట్టిచేతులతో ఆశాభంగంపొంది వెళ్ళిపోతుండడం చూసేం. పాఠశాలాపుస్తకాలూ, ప్రఖ్యాత గ్రంథకర్తల రచనలూ - రష్యన్ భాషలోనూ - విదేశభాషల్లోనూ - ఎన్నో వేలకొద్దీ ప్రతులు ప్రచురింపబడుతున్నాయి: ముద్రణకు మంచి కాగితం దొరకకపోవడంచేతనే పుస్తకాల ప్రచురణ తగ్గించబడింది. ఒకా నొక ప్రాంతంలో పాఠశాలలకు చాలినన్ని పుస్తకాలు లేవని ఆప్రాంతపు స్థానిక సోవియట్లకు దూరదృష్టి లేకపోవడాన్ని తీవ్రంగా విమర్శిస్తూ ఆసంగతిని పరీక్షచెయ్యవలసిందని అడుగుతూ దినపత్రికలలో విమర్శలు యీవేళ పత్రికలో చదివేం.

## రచయితలకు ప్రోత్సాహం

తక్కినవాట్లోలాగే పుస్తకప్రచురణ పరిశ్రమలోకూడా లాభాపేక్ష పూర్తిగా నశించింది. రచయితనుండి ప్రచురణకర్త సాధ్యమైనంత లాభాన్నిగుంజుకొని జేబులోవేసుకొనే చిరకాలంనుంచీవస్తూన్న దురాచారం

సోవియట్ దేశంలో మచ్చుకైనా కనిపించదు. పద్యరచన, ఉత్తమ సాహిత్యసృష్టి, అన్నివిధాలా స్వతంత్రరచన ప్రోత్సహింపబడుతూంది. పిల్లలకూ, యువకులకూ అనుగుణమైన పుస్తకాల ఉత్పత్తి ముఖ్యంగా ప్రోత్సహింపబడుతుంది. నూతనభావంవున్న రచన ఎటువంటిదైనాసరే ప్రచురిస్తారు. చవకబారు భయోత్పాతపు రచనల్నిమాత్రమే ప్రభుత్వ ప్రచురణాలయం వెలివేస్తుంది.

సోవియట్ దేశంలో గొప్ప గొప్ప పుస్తక ప్రచురణాలయాలు వున్నాయి. అన్నిటికంటే గొప్పది - మాస్కోలోవున్న - మాస్కో-స్టేట్ ప్రచురణాలయం. యీ బ్రహ్మాండమైన భవనం ఇరవై అంతస్థులుంది. ఆభవనంలో పనిచేసేసిబ్బందే ఎనిమిదివేలమందికిపైగా వుంటారట. వీరి అధ్వర్యంకింద పనిచేస్తున్న వివిధ ముద్రాక్షరశాలల్లోనూ, అచ్చుకూటాల్లోనూ, కాగితం మిల్లులలోనూ యీనాడు రమారమి నలభై వేలమంది కార్మికులుంటారట! సంవత్సరానికి మూడుకోట్ల పుస్తకాలు ప్రచురిస్తారట! నిజంగా ఊహించుకోవడానికే వీల్లేకుండావుంది!

## నిజమైన స్వాతంత్ర్యం

స్త్రీ పురుషులమధ్య సమానత్వం సోవియట్ యూనియన్‌లో పూర్తిగా స్థాపించబడింది. పురుషుడితో దేశంలో సమానహోదా, దేశానికి స్త్రీ యిచ్చే మాతృత్వం అత్యుత్తమమైన కానుకగా సంభావించడం, శిశురక్షణా, విడాకులహక్కు - సోవియట్ రాజ్యాంగంలో యివ్వన్నీ స్త్రీకి హామీ యివ్వబడ్డాయి. "జనాభాలో సగం సంఖ్య వంటయింట్లో బానిసలుగా పడివుంటూండగా యేదేశమూ స్వతంత్రంకాదు! అని లెనిన్ అన్నాడు. ఆయన యీ మాటలు అన్ననాటినుండీ సామ్యవాద ప్రభుత్వంలోనూ సామ్యవాద సమాజంలోనూ స్త్రీల స్థానం సురక్షితం చేయబడింది.

## మాతృదేవత

సోవియట్ భూమిలో యీనాడు స్త్రీ ఉద్యోగం చేసుకోవడానికి వివాహం ఆటంకంకాదు. వివాహంవల్ల మగవాడు ఉద్యోగం చేసుకోవడానికి యెలాగ ఆటంకంలేదో అలాగే స్త్రీకికూడా ఆటంకంలేదు. తిన సి పూర్తిగా నె వే చ్చలేదన్న కారణంవల్ల, గర్భిణీస్త్రీని పనిలోనుంచి తొలగించడంగాని. పని యివ్వకపోవడంగాని జరగదు. ఫాక్టరీ మానేజరుగాని డైరెక్టరుగాని అలా చేసినట్టయితే అతను రెండేళ్ళఖైదు శిక్ష పాలవు

తాడు. ప్రసవానికి ముందు స్త్రీకి పూర్తిజీతంతో రెండుమాసాలు సెలవు యివ్వబడుతుంది. ఆమె డాక్టరు సంరక్షణలో వుంచబడుతుంది. ప్రసవం అయిన వెంటనే ఆమె యింకో డాక్టరు సంరక్షణలో వుంచబడుతుంది. పూర్తిజీతంతో ఆమెకు యింకో రెండుమాసాల సెలవు యిస్తారు. ఆ తరవాత, డాక్టర్లు నిర్ణయించిన పద్ధతులలో ఆమెను తిరిగీ పనిలో ప్రవేశపెట్టుకుంటారు.

ప్రతీఫాక్టరీకీ ప్రతీ పెద్దపారిశ్రామికసంస్థకూ, సమిష్టి వ్యవసాయ క్షేత్రానికీ, ప్రతీనివేశానికీ ప్రత్యేకంగా స్వంత ప్రసూతి వైద్యాలయం వుంటుంది. గర్భిణీస్త్రీ దూరప్రదేశంలో పనిచేస్తున్నట్టయితే, అప్పుడు డాక్టరూ నర్సూ తదితర వస్తువులతో హాస్పిటల్ వేన్‌రూపంలోనో రైల్వే అంబులెన్సు రూపంలోనో ప్రసూతివైద్యాలయమే ఆమెవద్దకు వెళ్లుతుంది. ఆమె ఆస్పత్రిలో వుండడానికిగాని, డాక్టర్లు నర్సులూ రాకలకుగాని ఆమె కేమీ ఖర్చుండదు. ఆమె కార్మికసంఘం సభ్యురాలయితే, నామమాత్రమైన రుసుం పుచ్చుకొని తన విశ్రాంతిగృహాల్లో స్వస్థత వచ్చేవరకూ ఆమెకు ఉపచారం చేస్తారు.

తల్లికి అమితానందం కలుగచేసే శిశుపోషణ ప్రభుత్వ ప్రోత్సాహం వల్ల ఆమె ఆనందం ద్విగుణీకృతం అవుతూంది. శిశుపోషణ విషయంలో అన్నిదశలలో, సరియైన సలహాల నివ్వడంలోనూ ప్రభుత్వం యెన్ని వ్యయప్రయాసలనైనా లెక్కించదు. సమీపంలోవున్న మాతృవైద్యాలయానికి తల్లి తన శిశువును తీసుకెళ్తుంది. ఇక్కడ శిశువుకి జబ్బేమైనావుంటే డాక్టర్లు పరీక్షచేస్తారు. శిశువు ఆహారం బట్టలూ ఆటవస్తువులూ ఆరోగ్య విషయాలూ మొదలైనవాట్ల గురించి డాక్టర్లు తల్లికి సలహా యిస్తారు. స్థానికసోవియట్లూ కార్మికసంఘాలూ సహకారసంస్థలూ ఫాక్టరీలూ తదితర సంస్థలూ, యిటువంటి మాతృవైద్యాలయాల్ని స్థాపించేయి.

## సామ్యవాదదేశంలోనే సాధ్యమవుతుంది !

అటువంటి మాతృవైద్యాలయాన్నొకదాన్ని మాస్కోలో దర్శించేం. డాక్టర్లూ నర్సులూ తదితర సహాయులతో దానికి సంపూర్ణమైన సిబ్బంది వుంది. వీటన్నిటిలోనూ ముఖ్యాంశములు విశాలమైన ప్రదర్శనశాలలూ. ఒక హాలులో ప్రసవానికి పూర్వమూ తరవాతా తీసుకోవలసిన జాగ్రత్త, శారీరకమైన గర్భపరిస్థితీ, ప్రసవం అవుతున్నప్పటి వివిధ దశలు, ప్రసవ

కాలంలో చెయ్యవలసినదీ - చెయ్యకూడనిదీ - యివన్నీ బొమ్మలద్వారా నమూనాలద్వారా తెలియజేయబడ్డాయి. శిశుపోషణ చేస్తూన్న తల్లి ఆరోగ్యానికే, పళ్ళజబ్బూ, గర్భస్రావమూ మొదలైన ప్రసవసంబంధమైన జబ్బుల నివారణకీ యీ హాలులోని ఒకభాగం వినియోగించబడింది. గర్భ నివారణా, అది యెప్పుడు యెలాగ ఆచరించాలి, దాని పరికరాలు వైద్య సలహానుసరించి వాటిని ఉపయోగించడం మొదలైన వాటినిగురించి మూడోభాగంలోచూపబడింది. సుఖవ్యాధులూ, ప్రథమదశలో వాటిని ఎట్లు తెలుసుకొనడమూ, వాటి నివాణా నివృత్తి మార్గాలగురించి భోగట్టా నాలుగోభాగంలోవుంది. సుఖవ్యాధులు సమాజానికి కలిగించే హానినిగురించి బొమ్మలు లెక్కలద్వారా నొక్కివక్కాణింపబడింది. సోవియట్ దేశానికీ యితరదేశాలకీ యీవిషయంలోవున్న భేదాన్నిగురించి, యీసందర్భంలో వైద్యశాల డైరెక్టరు మాకు తెలియజేసేడు, సోవియట్ యూనియన్‌లో సుఖవ్యాధులతో బాధపడుతూన్నవ్యక్తి విధిగా నివారణకోసం వైద్యశాలలో తెలియజేసి, తనకారోగం ఎవరిద్వారా వచ్చిందీ వెల్లడిచెయ్యాలి. ఇందువల్ల, యీ వ్యాధులు ఎవరివల్లనుంచి వచ్చేయో వెంటనే కనిపెట్టి వాటి వ్యాప్తిని అరికడుతూ నివారణపద్ధతులను ప్రవేశపెట్టడానికి అవకాశం ఉంటుంది. గర్భవిచ్ఛిత్తికి వ్యతిరేకంగా ప్రబోధిస్తూ ఐదవభాగం వినియోగించబడింది. ఈవిషయంలోకూడా బొమ్మలద్వారా నమూనాలద్వారా ప్రతి విషయమూ దాని సహజపరిస్థితిలో సర్వదా దాని ప్రజావ్యతిరేక గుణాన్ని తెలియజేస్తూ-వ్యాఖ్యానించబడింది. ప్రదర్శనశాలలో ఒకమూలను, సూక్ష్మదర్శినీయంత్రాలతోనూ, తయారైన చిత్రాలతోనూ ప్రదర్శించడంకోసం చిన్నలేబొరేటరీన్నీ, సినీమాన్నూ వున్నాయి.

## తల్లులు — పిల్లలు

శిశువుకి ఆరునెలల వయస్సువచ్చేవరకూ తీసుకోవలసిన జాగ్రత్తలను తెలియజేసే విషయాలకు మొదటి ప్రదర్శనశాల వినియోగింపబడింది. శిశువుకి మంచి బట్టలు, మంచం, తగిన ఆహారం, దానిపరిమితి, స్నానం, అలంకారవస్తువులు - వస్తురూపంలో శిశుపోషణ కవసరమయ్యేవన్నీ అక్కడవుంచేరు.

శిశువుకి పళ్లువచ్చేకాలానికి వుపకరించేటట్టు రెండవ ప్రదర్శనశాల వుంది. శిశువుకి ప్రమాదకరమైన ఆరోజుల్లో యేమిచెయ్యాలి యేమిచెయ్య



టర్కీస్థాన్‌లో శిశుపోషణాలయం

బుఖారాలో శిశుపోషణాలయం



కూడదు: పళ్లు వస్తున్నకాలంలో సాధారణంగావచ్చే జబ్బులు వాటి నివారణోపాయాలూ, శిశువు యేడుస్తున్నప్పుడేంచెయ్యాలి, యెలాగలాలించాలి, శిశువు వయస్సుకు అనుగుణ్యమైన ఆటవస్తువులు, బొమ్మరిళ్లుకట్టడం. మెత్తని పదార్ధంతోచేసిన బొమ్మలు, శిశుఆరోగ్యశాస్త్రం, యితరుల సహాయం అక్కరలేకండా స్వయంకృషితో శిశువు తన పనులను చక్కబెట్టుకొనేటట్టుచేయడం యీవిషయాలన్నీ అక్కడ ప్రదర్శించబడ్డాయి.

శిశువు నడిచేదశకొచ్చేసరికి ఉపయోగపడే విషయాలు మూడో ప్రదర్శనశాలలో వున్నాయి. ఇక్కడకూడ, శిశువుకు సరిపడిన సామాన్లు, దుస్తులమార్పులు, తన పనిఅవయవాల్ని ఉపయోగించి పనిచేయడానికి ప్రోత్సహించడం, సరియైన పరిమితిలో ఆతపస్నానాలు ఆరుబయట విహారాలు, మంచి అలవాట్లు చేసుకోవడం, బట్టలూ తదితర స్వంత సామాన్లను జాగ్రత్తపరచుకోవడం, నడకకు అనుగుణ్యమైన మంచిజోళ్లు, మంచిఆహారం, - వాటి వాటి సహజపరిస్థితులలో సహజపరిమాణంలో వున్న బొమ్మలద్వారా తదితర బాలవిద్యావిషయాలు ప్రదర్శించబడ్డాయి.

రెండుమూడేళ్ళ వయస్సుగల శిశువు బుద్ధివికాసానికి తోడ్పడే విషయాలకు నాలుగో ప్రదర్శనశాల వినియోగింపబడింది. పరిశుభ్రమైన గాలివచ్చే ప్రదేశాలు, శీతోష్ణపరిస్థితుల కనుగుణ్యంగా కొద్దిదుస్తులు, పాటలు, దరువులు, చిత్రాలు, విషయాల్ని నేర్చుకోవడానికి ప్రోత్సాహం, ఇళ్ళలోనూ, రైళ్ళలోనూ సొరంగాలలోనూ ఆటలు, లాలిపాటలు, కధలు చెప్పడం, నాటకాలాడడం, శిశువు పెరుగుతూన్న యీ దశలో సరియైన ఆహారాదులూ - యివ్వన్నీ తల్లి తెలుసుకోవడానికి సహజ పరిమాణంలో వున్న బొమ్మలద్వారా ప్రబోధింపబడ్డాయి. నమూనాలద్వారా, బొమ్మలు వ్యాఖ్యానాలద్వారా, డాక్టర్లు నర్సులయొక్క సలహాలద్వారా, శిశువు శారీరక మానసిక పోషణ కవసరమయ్యే సర్వమూ చూపబడ్డాయి. ఇటువంటి వైద్యాలయాలు మాతృత్వానికి సమాజం వాస్తవంగాను, హృదయ పూర్వకముగాను అర్పించే సాటిలేని అభివందనాలు!—ఇటువంటి అభివందనాలు సామ్యవాదదేశంలోనే సాధ్యమవుతాయి.

## శిశుపోషణ

ఉద్యోగం చేస్తూండే తల్లి అసంఖ్యాకంగా వుండే క్రెచీల్లోనో కిండర్‌గార్డెన్లలోనో నర్సరీలలోనో (శిశుపోషణాలయాలు) తన శిశువును

వుంచవచ్చు. తల్లి ఉద్యోగం చేస్తున్నసంస్థ నిర్బంధంగా శిశుపోషణాల యాల్ని నడపాలి. వయస్సువారీగా, శిశువును ఉల్లాసపర్చడానికీ బోధించడానికీ అన్ని సాధనాలు వీట్లో వుంటాయి. ఇవి పరిశుభ్రంగా ఆనందకరంగా నిరాడంబరంగా వుంటాయి. ఈ శిశుపోషణాలయాల్లో శిశువుకి స్నానంచేయించి శుభ్రమైన బట్టలు వేస్తారు. సకాలంలో ఆహారం యిస్తారు. శిశువు యిక్కడ వున్నంతసేపూ తన తోడిపిల్లలతో పనిచేస్తూ ఆడుకొంటూ నిద్రపోతూ కేరింతలుకొడుతూ సమర్థులైన ఉద్బోధకుల పర్యవేక్షణలో వుంటుంది.

తమ పిల్లలను తామే సంరక్షణచేసుకొంటూ, ఉద్యోగం చేస్తూన్న తల్లులకు ప్రతీమూడుగంటల తరువాత, తమ పిల్లల్ని సంరక్షణ చెయ్యడానికి ఒక అరగంటసేపు సెలవు యిస్తారు. ఇంటిదగ్గర పిల్లలువున్న తల్లులు ఒకగంట ముందుగా పనినుండి ఇంటికి వెళ్ళిపోవచ్చును. అందుకని వాళ్ళ జీతాలు తగ్గించడమేమీ జరగదు.

## స్త్రీలపాలిటి స్వర్గం

హెచ్చుగా కుటుంబజీవనాన్నీ, సంసారజీవనాన్నీ సోవియట్ ప్రభుత్వం ప్రోత్సహిస్తుంది. ప్రతిప్రసవానికీ, కానుపుకయ్యే ఖర్చులనిమిత్తం తల్లికి సోవియట్ ప్రభుత్వం నలభై ఐదు రూబుళ్లు యిస్తుంది. ఇంకో పదిరూబుళ్ళ చొప్పున పన్నెండు మాసాలవరకూ యిస్తుంది. ప్రతి ఆరవ శిశువు తరవాతా ఐదేళ్ళవరకూ సంవత్సరానికి రెండువేల రూబుళ్ళ చొప్పున ప్రభుత్వం యిస్తుంది. పదోశిశువు తరవాత ప్రతిప్రసవానికీ తల్లికి ఐదువేల రూబుళ్ళ వేతనం వస్తుంది. ఇంకో నాలుగుసంవత్సరాలవరకూ సంవత్సరానికి మూడువేలరూబుళ్ళ అదనపువేతనంవస్తుంది. మాతృవైద్యాలయం డైరెక్టరు ఒకఆమె మాతోచెప్పినట్టు, "జరుగుబాటుకాద"న్న కారణానికి యే స్త్రీ మాతృత్వాన్ని నిరాకరించనక్కరలేదు; ఏ పురుషుడూ పితృత్వాన్ని నిరాకరించనక్కరలేదు.

ఈ వైద్యాలయాలతోబాటు, యువతులకు సలహాలిచ్చే సంఘాల ("ప్రోఫిలెక్టేరియా")ను ప్రభుత్వం నడుపుతుంది. ఇవి సాధారణంగా మాతృవైద్యాలయాలకు అనుబంధంగావుంటాయి. పెళ్ళిచేసుకోదలుచుకుంటూన్న స్త్రీలూ, మాతృత్వాన్ని వహించడానికి వాంఛిస్తున్న స్త్రీలూ, వైద్యసలహాలూ, అందుతోపాటు ప్రభుత్వం యేర్పరచిన న్యాయవాదుల

నుండి తమ హక్కులూ మొదలైనవాటిగురించి న్యాయచట్ట సలహాలూ యిక్కడ పొందవచ్చును. సోవియట్ ప్రభుత్వం చూపుతూన్న యిటువంటి మాతృవాత్సల్యంలో అనేకమంది యువక కార్మికులూ విశ్వవిద్యాలయ విద్యార్థులూ వివాహంచేసుకొని సగర్వంగా సగౌరవంగా కుటుంబ జీవితాన్ని గడుపుతున్నారంటే ఆశ్చర్యపడవలసిందేమీలేదు.

## వి డా కు ల హ క్కు

మాబసకు దగ్గరలోవున్న జననమరణ వివాహ కార్యాలయం, "జాగ్స్"కు - పెళ్ళి, విడాకులకు సంబంధించినవాటిగురించి సోవియట్ న్యాయచట్టం యెలావుంటుందో తెలుసుకుందామని - వెళ్ళేం. ఈ కార్యాలయం ముఖ్యాధికారిణి ముప్ఫయిసంవత్సరాల వయస్సుగల నైపుణ్యవతియైన యువతి; ఆమె సహాయురాలు ఏభై సంవత్సరాల వయస్సుగల ఒక ముత్తైదువ.

తల్లినీ పిల్లనీ, వారి హక్కుభుక్తాల్ని కాపాడేఉద్దేశంతో సోవియట్ దేశ వైవాహికన్యాయసూత్రాలు యేర్పరచబడ్డాయి. సోవియట్ దేశంలో వివాహం, సమానులమధ్య జరిగే యిచ్ఛాపూర్వకమైన సమ్మేళనం. సంఖ్య (స్టాటిస్‌టిక్స్)ల్ని సమకూర్చుకోవడానికి పనికివస్తుందిగాబట్టి రిజిస్ట్రేషన్ పెళ్లిళ్లప్రోత్సహించబడతాయిగాని, నిర్బంధమేమీలేదు. రిజిస్ట్రేషన్‌లేకండా చేసుకొనే గాంధర్వ వివాహాలుకూడా చట్టసమ్మతాలే. పుట్టిన పిల్లలందరూ ఔరసులుగానే భావింపబడతారు; వారందరికీ సమానమైన హక్కులుంటాయి. ఇరుపక్షాల ఒప్పుదలమీదగాని, వారిలోని ఒకపక్షం ప్రభుత్వానికి తెలియజేసిగాని విడాకులుపొందవచ్చును. ఒక వివాహం విచ్ఛేదమైనప్పుడు, ఆసంగతి ప్రభుత్వానికి తెలియజెయ్యాలి. వివాహితులకు పిల్లలున్నపక్షంలో, పిల్లలపోషణకు యెంత చొప్పున తల్లీ తండ్రీ యివ్వాలి, పిల్లలు యెవరితో జీవించాలి, అన్నవిషయాల్ని విడాకులు రూఢిపర్చడానికి ముందు ప్రభుత్వం నిర్ణయిస్తుంది. విడాకులు పుచ్చుకుంటూన్న దంపతులకు వున్నది ఒక శిశువైతే వారి ఆదాయంలో నాలుగోవంతు శిశువుని పోషించడానికి యివ్వాలి; యిద్దరు శిశువులైతే మూడోవంతు యివ్వాలి; యింకా అధికమైతే సగం యివ్వాలి. సకాలంలో చెల్లించకపోయినట్టయితే రెండు సంవత్సరాల ఖైదువరకూకూడా శిక్షపడుంది.

సోవియట్ ప్రభుత్వం నూతన చట్టముల ప్రకారం గర్భవిచ్ఛేదనం చట్టవిరుద్ధంగా చేయబడిందనీ, ఆరోగ్యవంతురాలైన స్త్రీ అలాగచేస్తే శిక్షింపబడుతుందనీ, యీ కార్యాలయాన్ని వదిలివెళ్ళేముందు ముఖ్యాధికారిణి చెప్పింది. గర్భవిచ్ఛేదనం రెండోసారి చేస్తే మూడువందల రూబుళ్ళ జరిమానా పడుతుంది. ఈ నేరంలో సహాయం చేసినవారికి రెండుసంవత్సరాల ఖైదు శిక్ష విధింపబడుతుంది. విడాకుల్ని ప్రభుత్వం నిరుత్సాహపర్చడమేకాకండా అనుగ్రహంతో చూడదనికూడా ముఖ్యాధికారిణి చెప్పింది. మూడోసారి విడాకులు పుచ్చుకోవడం చాలా కష్టతరంగానూ వ్యయకరంగానూ చేయబడింది. మొదటిసారి తీసుకొనే విడాకులకు ఏభై రూబుళ్ళు చెల్లించవలసి వుంటుంది; రెండోసారి నూట యాభై రూబుళ్ళు మూడోసారి మూడువందల రూబుళ్ళు చెల్లించవలసి వుంటుంది.

## స్త్రీలందరూ స్వయంపోషకులు

స్త్రీలందరూ స్వయంపోషకులు. నిరుద్యోగఘాతమూ, దిక్కూమొక్కూలేకండా పోతామనే భవిష్యత్తు గురించి భయమూ సోవియట్ స్త్రీలకులేదు. కాబట్టి ఆర్థిక సంబంధమైన హామీకోసం, అంటే కూడు గుడ్డలకోసం, యే స్త్రీ పెళ్ళాడక్కరలేదు. కూటికోసరం యే ఒక్క స్త్రీ వీధుల్లో తిరుగులాడనక్కర్లేదు. కుమార్తెల భవిష్యత్తు గురించి ఆందోళన పడుతూ, సోవియట్ దేశంలోని తలిదండ్రులు నిద్రలేకండా రాత్రులు వెళ్ళబుచ్చనవసరంలేదు.

స్త్రీలు ప్రతీచోటా పనిచేస్తున్నారు. పోస్టు అండ్ టెలిగ్రాఫ్ ఆఫీసులూ, బ్యాంకులూ, ప్రభుత్వకార్యాలయాలూ స్త్రీలతో నిండిపోయేయి. ఉపాధ్యాయినులు, బస్సు ట్రాంబళ్ళ కండక్టర్లు డ్రైవర్లూ, లారీలకు అద్దె కార్లకూ డ్రైవర్లూ, డాక్టర్లూ, ఇంజనీర్లూ, రొట్టెలుచేసేవాళ్ళూ, ట్రాఫిక్ పోలీసులూ, విమానాలు నడిపేవాళ్లూ, దంతవైద్యులూ, పశువైద్యులూ, వ్యవసాయనిపుణులూ, రైల్వే ఉద్యోగులూ, శానిటరీ ఉద్యోగులూ, దుబాషులు, ఐస్క్రీం అమ్మేవాళ్ళు, ట్రాక్టరు డ్రైవర్లు, కంబైన్ ఆపరేటర్లూ, శాస్త్రపరిశోధకులూ, వాణిజ్యకార్యనిర్వాహకులూ, ఫాక్టరీడ్రైవర్లూ, సమిష్టివ్యవసాయక్షేత్రాల మేనేజర్లూ, కార్మికసంఘాల ఉద్యోగులూ, శాసనసభా ప్రతినిధులూ, ప్రభుత్వమంత్రులూ విదేశరాయబారులూ - ఒక

చేమిటి పురుషులతో సరిసమానమైన హోదాలో అన్నివృత్తుల్లోనికి స్త్రీలకు ప్రవేశముంది.

## ప్ర ము ఖు ల భా ర్య లు !

భర్త చాలా ప్రముఖుడుగాబట్టి భార్య ప్రముఖురాలయ్యేపద్ధతి సోవియట్ దేశంలోలేదు. స్టాలిన్‌సతి యీవేళ యేమన్నదో యేం చేసిందో, ఆవిడ యే అలంకారాలను వాడుతుందో అన్న విషయాలు తెలుసుకోవడానికి యెవరూ బాధపడరు. సైనికులపోటీలో బహుమానాలు కగనావిష్‌సతి నిజంగాపంచిపెట్టిందో లేదో అనిగానీ, కాలినిన్ సతో, వొరొషిలొవ్ సతో శిశుప్రదర్శనానికి ప్రారంభోత్సవం చేసిందోలేదోఅనిగాని, కిష్న్యాసతి బూటకపు వజ్రాభరణాలగురించి మోలొటొవ్‌సతి జన్మదినం విందులో సిడిరోవ్ సతి యేమన్నదోఅనిగాని తెలుసుకోవడానికి యెవరూ ఉబలాట పడరు. మేం యెంతో ప్రయత్నించినప్పటికీ ప్రముఖుల భార్యలగురించి యెవరూ కొంచెమైనా ఆసక్తిచూపినట్టు కనిపించదు. వారి చర్యలగురించి అసలే లేదు. స్టఖానోవైట్ కార్మికులూ షాక్‌బ్రిగేడర్లూ ఉత్పత్తిలో చూపిన కొత్తరికార్డు గురించీ, విమానాలు నడిపే స్త్రీలు సాధించిన అసాధ్యాల గురించీ, మేరియాడిమ్‌చెంకో గురించి గాని సోవియట్ దేశవీరుల (హీరోస్ ఆఫ్ ది సోవియట్ యూనియన్) గురించిగాని ఆర్డరాఫ్ లెనిన్, ఆర్డరాఫ్ రెడ్‌బేనర్ పతకాల్ని పొందినవాళ్ళను గురించిగాని తెలుసుకోవడానికి సోవియట్ ప్రజలు ఆత్రుతతో వుంటారు. ఈప్రముఖులు స్త్రీలైనా, పురుషులైనా ఒకేవిధంగా సోవియట్ ప్రజల మన్ననలకు పాత్రులవుతారు. తమలోవున్న విలువనుబట్టి మాత్రమే సోవియట్‌దేశంలోని స్త్రీలు గౌరవార్హులవుతున్నారు.

## విప్లవ పుత్రికలు

సామ్యవాదదేశం ఉత్పత్తిచేసిన నమూనా లనదగ్గ అనేకమంది యువతులతో మేం సంభాషించేం. సోవియట్ స్త్రీలకు ఉదాహరణగా యిద్దరు స్త్రీలవిషయం యీక్రింద ఇస్తున్నాం. ఇటువంటి స్త్రీలు సర్వసాధారణంగా ప్రతిచోటా కనిపిస్తారు.

మేము గోర్కీ పార్కుకు వెళ్ళినప్పుడు ఆమె అక్కడ విమాన నిర్మాణంలో ప్రేక్షకులకు సలహాలిస్తూంది. అప్పుడు ఆమె పరిచయం మాకు కల్గింది. విప్లవానికి పూర్వం ఆవిడ తండ్రి బడిలో ఉపాధ్యా

యుడుగా వుండేవాడట. ఆకాలపు ఉద్దేశాలను అనుసరించి కూతురికి గొప్ప సంబంధం చేయ్యాలని - కాస్తచదువు నాల్గు ఫ్రెంచి ముక్కలు - అలంకారానికి సంగీతం, నృత్యం అన్నిటికంటే ముఖ్యం అయింది - అందంగా బట్టలు వేసుకోవడం - ఈ విద్య నేర్పించాడట. కాని అంతర్యుద్ధం సమయంలో ఆమె తండ్రి చనిపోయేడు. తననూ, తన తల్లినీ, తన చెల్లినీ పోషించుకొనేభారం యీామెమీదపడింది. తండ్రి చెప్పించిన చదువు ఇందుకు పనికిరాకపోయింది. అప్పుడు 1924 లో యీామె విశ్వవిద్యాలయంలో ప్రవేశించి కెమికల్ ఇంజినీరింగ్ చదువుతూ, ఒక కెమికల్ ఫ్యాక్టరీలోచేరి క్రమేణ, అసిస్టెంటు ఛార్జిహేండుగా పనిచేసింది. 1932 లో ఒక ముఖ్యమైన ఉత్పత్తిశాఖను యీామె ఆధీనంలోవుంచేరు. రెండేళ్ళ తరవాత అసోస్-యేవియాకెంలో యీామె ప్రవేసించింది. ఈమె యిప్పుడు ఎనిమిదివందల రూబుళ్ళ జీతంతో ప్రభుత్వ విమాననిర్మాణశాఖలో ఒక ముఖ్యోద్యోగిగావుంది. ఈమె పెళ్ళిచేసుకుంది; భర్త సహకారశాఖలో ఉద్యోగి. జీతం ఐదువందల రూబుళ్లు. ఈమె చెల్లెలు రెల్వేవర్కుషాపులో టర్నరుగా పనిచేస్తూంది. తనదగ్గరేవుందట - నాలుగువందల రూబుళ్లు గడించుకుంటూంది. తనకు చాలా తెలివైన ముగ్గురు చిన్న కుమార్తెలున్నారని, మీరు తప్పకుండా మాయింటికివచ్చి వాళ్ళను చూడాలిసుమండీ! అని యీామె మాకు సగర్వంగా చెప్పింది.

## మ ట్టి ను ం డి

పోస్టాఫీసుకు యెదురు గుండావున్న స్టేషనరీ షాపులో రెండో ఆమె పరిచయం మాకు కలిగింది. ఈ షాపులో మాకు కార్బన్ కాగితం కావాలని అడిగేం. కాని షాపువాళ్ళకు బోధపళ్లేదు. అప్పుడే యీావిడ షాపులోనికి ఏదో కొనడానికి రావడం తటస్థించింది. 'లా హ్యూమానిటె' అన్న ఫ్రెంచి పత్రిక మాచేతుల్లోచూసి, తనసహాయమేమైనా కావాలా అని వెంటనే ఫ్రెంచిభాషలో అడిగింది.

తరువాత మేము, ఆమెతో బాల్‌షొగ్ వేపు వెళ్తుండగా మాటలుకలిసేయి. తన పన్నెండవయేట 1920 లో, మాస్కోవొచ్చి, ఒక హాస్టల్‌లో గృహసేవకురాలుగా పనిచేసేనని ఆమె తనకథ చెప్పింది. కొద్దిరోజులయ్యేక, ఈపని వదిలిపెట్టేసి, ఆప్రాంతంలోని బట్టలఫ్యాక్టరీలో పనిచెయ్య సాగిందట. అప్పటివరకూ ఆమెకువచ్చిన విద్య చాలతక్కువ. ఇలాగ

పనిచేస్తూ తన విద్యను అభివృద్ధిచేసుకోవడానికి రాత్రిపాఠశాలలకు హాజరయ్యేదట. 1923 సరికి తన పనితనంవల్ల పైకివచ్చి, ఆఫ్యాక్టరీలో నూలువడికేశాఖకు ఒకదానికి అధికారిణిఅయింది. ఈమె రాత్రిపాఠశాలలో ఫ్రెంచిభాష నేర్చుకొంది. ఫ్రెంచి అంటే తనకు చాలా ప్రీతిఅని మాతో చెప్పింది. 1935 సరికి, ఫ్యాక్టరీలోని యంత్రాలభాగానికి ఒక అసిస్టెంట్ ఫోర్‌మన్ అయింది. కొద్దికాలంలోనే ఫోర్‌మన్‌పదవి వస్తుందని ఆసిస్తూంది. ఇప్పుడీమె ఆరువందలఏభై రూబుళ్ళు ఆర్జిస్తూంది. తను ఫోర్‌మన్ కాగానే ఎనిమిదివందల రూబుళ్ళవరకూ ఆర్జించగలనని ఆసిస్తూంది ఆవిడ....

"మేజోళ్లా - మెషీనుగన్నా ?"

నిపుణలైన స్త్రీలు, స్వయంకృతలైన స్త్రీలు, తమ తమ పనుల్ని యెంతో చాకచక్యంతో చేస్తారు, తమ సహచరులతో యెంతో స్నేహభావంతో మెసులుతారు, సంపూర్ణమైన దేశభక్తిపరాయణలు, స్త్రీ సహజమైన లాలిత్యం తొణికిసలాడుతున్నవారు - యీ విప్లవ పుత్రికలు !

తమ పనినుండి వచ్చేసేక, అందంగా అలంకరించుకోవడం సోవియట్ స్త్రీలకు గౌరవప్రదమైన విషయంగా వారు పరిగణిస్తారని మాకు కనిపిస్తూంది. అందమైన సోవియట్ స్త్రీలకు యిప్పుడున్నవాటికంటె యింకా చక్కని బట్టలూ, దుస్తులూ, స్టాకింగులూ, జోళ్లూ వుండాలని మేం సస్నేహంగా అన్న హాస్యానికి, ఒకామె గంభీరంగా సమాధానం యిచ్చింది :

"ఇప్పుడు కావలసినవి టాంకులూ, మెషీన్లూ. సిల్కు స్టాకింగుల మాట తరవాత చూసుకోవచ్చు !"

సమిష్టి వ్యవసాయక్షేత్రంలో పశువైద్యురాలు యీ హాస్యానికే యింకో సందర్భంలో ఛలోక్తిగా సమాధానం యిచ్చింది :

"ఎప్పుడు చెయ్యవలసినపని అప్పుడు చెయ్యాలి. సిల్కు స్టాకింగులూ జరీజోళ్ళూ మాకు యెప్పుడు బహూకరించాలో మా కామ్రేడ్ స్టాలిన్‌కు తెలుసును !"

ఈ ప్రశ్నకే కగనావిష్ బాల్‌బేరింగ్ ప్లాంట్‌లో లేత్‌పని చేస్తున్న ఒకావిడ అన్నదికదా :

"అమెరికన్ స్త్రీలు వేసుకొనే యీ అందమైన సిల్కు స్టాకింగులు వేసుకొని తిరగడమంటే నాకు చాలా యిష్టము, సరదాను. కాని, యిప్పుడు మొట్టమొదటి అవసరం మెషీన్లు; తరవాత మెషీన్లను తయారుజేసే మెషీన్లు. ఆ తరవాత మెషిన్‌గన్లు తయారుజేయడానికి మెషీన్లు!"

జూరిచ్‌పట్నంలోవున్న మా స్నేహితురాలు యల్. ఐదేళ్లు ఇంజనీరింగ్ కాలేజీ చదువు పూర్తిచేసేక ఆడదానికి ఇంజనీరింగు ఉద్యోగం ఏమిటని, ఎవ్వరూ ఉద్యోగం ఇచ్చారుకారనీ యిక గత్యంతరంలేక ఒక యింజనీరుని ప్రేమించి పెళ్ళిచేసుకుందనీ, మేం చెప్పేసరికి సోవియట్ స్త్రీలు ఆశ్చర్యపడిపోయేరు!

నాజీ పరిపాలనలో కనడానికి వంటచెయ్యడానికి దేవుడికి మొక్కడానికీ మాత్రం తగుదురని ఖండింపబడ్డ వందలు వేలుగా జర్మనీలోవున్న స్త్రీ జనానికీ - ఈ సోవియట్ స్త్రీలకు ఎంత తారతమ్యం!

## తాతయ్యలకు ఉపచారాలు!

ఇక కార్మికుల సెలవులూ పించనీల విషయం:

ప్రతి కార్మికుడికీ పూర్తిజీతంతో సెలవులు పుచ్చుకోవడానికి హక్కుందనీ, కార్మికులతోనూ, మేనేజర్లతోనూ, కార్మికసంఘాల ఆర్గనైజర్లతోనూ చేసిన సంభాషణలబట్టి మేం తెలుసుకున్నాం. లైట్ ఇండస్ట్రీలలో పనిచేసే కార్మికులకు సంవత్సరానికి రెండువారాలు పూర్తిజీతంమీద సెలవు దొరుకుతుంది. హెవీ ఇండస్ట్రీలలో పనిచేసే కార్మికులకు సంవత్సరానికి ఒకమాసం పూర్తిజీతంమీద సెలవు దొరుకుతుంది. ప్రభుత్వమూ కార్మికసంఘాలూ సహకారసంఘాలూ ఫ్యాక్టరీలూ, నడుపుతూన్న విశ్రాంతి గృహాలూ, జబ్బు నెమ్మదిగావున్న తరవాత రోగికి పుష్టిని కలిగించే సౌకర్యాలుగల భవనాలూ చాలా వున్నాయి. నామమాత్రంగా డబ్బు చెల్లించి కార్మికులు యీ సదుపాయాలు పొందవచ్చును. వైద్యుని సలహాను అనుసరించి కార్మికుడు సెలవు తీసుకోవలసివస్తే, వైద్య సలహాతోబాటు యీ ఆరోగ్యమందిర నివాసం ఉచితం.

వృద్ధులపట్ల సోవియట్ ప్రభుత్వం తీసుకొనే శ్రద్ధా, చూపే ఆదరణా ముఖ్యంగా గమనించవలసినవి. సోవియట్ దేశంలో, యితర దేశాల్లోలాగ వృద్ధులకు చావకండా బ్రతకకుండా యేదో దయాధర్మభిక్ష పెడదామన్న దృక్పథంలేదు.

వృద్ధాప్యంలో తమ జీవనోపాధికి ప్రభుత్వంనుండి వేతనం పుచ్చుకొనే హక్కు సోవియట్ ప్రజలందరికీ వుంది. విప్లవానంతరం సోవియట్ దేశంలో యీ విషయం అమలులో పెట్టబడింది. వృద్ధాప్యంలో వేతనాలు పొందడానికి గలహక్కూ, అనారోగ్యంవల్ల వచ్చే వేతనాలూ, ప్రభుత్వం చాలా విరివిగా యేర్పాటుచేసిన భీమాపద్ధతివల్ల లభించేయి. ఫ్యాక్టరీలో పనిచేస్తున్నా, పొలంలో పనిచేస్తున్నా, షాపులోనో, బడిలోనో స్టూడియోలోనో పరిశోధనాలయంలోనో ఎక్కడ పనిచేస్తున్నా, ట్రాక్టరునో పంటలుకోసే యంత్రాన్నో రైలుబండినో దేనిని నడుపుతున్నప్పటికీ, యీ సదుపాయాలన్నీ కార్మికులు పొందుతున్నారు. ప్రభుత్వ వ్యయంతో నిర్మించిన విరివియైన వైద్యసౌకర్యాలు కార్మికులకు లభిస్తున్నాయి.

కార్మికుడు చేసిన పనిస్వభావాన్నిబట్టీ, కాలపరిమితినిబట్టీ, వృద్ధాప్య వేతనాలు వుంటాయి. స్త్రీగాని, పురుషుడుగాని, ప్రతి కార్మికుడూ తన ఉద్యోగకాలం పూర్తిఅయ్యేకకాని, పురుషుడైతే అరవైసంవత్సరాల వయస్సూ స్త్రీ అయితే యాభైఅయిదుసంవత్సరాలవయస్సూ నిండేకగాని, ఉపకారవేతనం పుచ్చుకుంటారు. గనులూ తదితర కష్టమైన వృత్తుల్లో పని చేసినవాళ్లకు తమజీతంలో నూటికి అరవైవంతులూ, హెవీ ఇండస్ట్రీలలో పనిచేసినవాళ్లకు తమజీతంలో నూటికి ఏభైఐదువంతులూ, లైట్ ఇండిస్ట్రీలలో పనిచేసినవాళ్లకు తమజీతంలో సగంభాగమూ విశ్రాంతి వేతనంగా ఇస్తారు. తమ ఉద్యోగాలలో పాతికసంవత్సరాల పరిమితిని చేరినవాళ్లు తమ సంవత్సరాదాయంలో సగంభాగం విశ్రాంతివేతనంగా పుచ్చుకొంటారు. ఇంతేకాకండా, ఒకేసంస్థలో నాగాలేకండా పనిచేస్తే, కార్మికులకు అదనంగా బోనస్ వస్తుంది. నాగాలేకుండా ఒకేసంస్థలో ఐదేళ్లు పనిచేస్తే 12°/o వస్తుంది; పదేళ్ళకు 15°/o, పదిహేనేళ్ళకు 20°/o, ఇరవైఐదుసంవత్సరాలకు 25°/o అదనంగా బోనస్ వస్తుంది. పెద్దపరిశోధనాలయాల్లోని ప్రొఫెసర్లూ, ప్రత్యేక విషయాల్లో పనిచేసిన వైద్యప్రముఖులూ, చాలా మంది కళావేత్తలూ సంగీత విశారదులూ తమ పూర్తివేతనాల్ని విశ్రాంతి వేతనంగా పుచ్చుకుంటారు. బాగా ఆరోగ్యంగా దేహదారుఢ్యంగా వున్న వృద్ధులు, తమపనులు చేసుకొంటూ తమ మామూలు జీతాలతోబాటు ఉపకారవేతనాన్ని అదనంగా పుచ్చుకుంటారు.

## రెండో బాల్యం

వృద్ధాలయాల్ని, అందులో నివసించేవారు నిజమైన నివాసగృహాలుగా భావిస్తారు. వాళ్ళు అక్కడ వూరికే వుంటూ కాలాన్ని వృధాచేస్తూ కాటికి కాళ్ళుచాపుకొని కూర్చోరు. చిన్న చిన్న పంటలు పండించడమూ, తేనె పట్టులు పెట్టించడమూ, కోళ్ళను పెంచడమూ, కూరలు పండించడమూ మొదలైన పనులు చేస్తుంటారు. ఈ వృద్ధులే తమంతటతాము వీటన్నిటినీ సహకారపద్ధతిని నడుపుకుంటారు. వాళ్ళకు వీటివల్ల కొంతరాబడివస్తుంది. మేం వెళ్ళిన వృద్ధాలయాలలో ఒకదానిలో, మాసానికి ఒక్కొక్కవ్యక్తికీ మూడువందలయాభై రూబుళ్ళ ఆదాయం వస్తుందని అక్కడి వృద్ధులు చెప్పేరు. తమ ప్రయోజనానికీ తమకుటుంబ ప్రయోజనానికీ ప్రత్యేకంగా సహకారభీమాసంఘాలున్నాయి. సోవియట్ దేశంలోవున్న అనేకవేల వృద్ధాలయాల్లోలాగనే యిందులో నివసించేవాళ్ళకుకూడా విరివిగా విద్యా సౌకర్యాలు విలాససౌకర్యాలు ఏర్పర్చబడ్డాయి. ఒక గ్రంథాలయమూ పత్రికలూ, వార్తాపత్రికలూ బాగా అమరివున్నాయి. వాళ్ళకి తమ స్వంత సినీమాలు, నాటకశాలలూ, సంగీతశాలలూ వున్నాయి. ధనంతోనూ, ఆదరాభిమానాలతోనూ యీ వృద్ధుల జీవితచరమదశను యెంత ఆనంద దాయకంగా చేయడానికి వీలుంటుందో అంత ఆనందదాయకంగా సోవియట్ ప్రభుత్వం చేసింది.

## ఎంతటి వ్యత్యాసం

యూరప్, అమెరికా, ఇండియా, జపాన్ దేశాలలో 1934, 1935, 1936, 1937 సంవత్సరాలు భయంకరమైన సమస్యలను యెదుర్కొన్న కాలం! నానాటికీ ఎక్కువైపోతున్న నిరుద్యోగము, పడిపోతున్న కూలీ రేట్లూ, జీవితానికి అవసరమైన వస్తువుల విపరీతంగా పెరిగిపోతున్న ధరలూ, కురచపడిపోతున్న జీవితావసర వస్తువ్యయం, మూసివేస్తున్న ఫ్యాక్టరీలూ, దివాలాతీస్తున్న వ్యాపారసంస్థలూ, బ్యాంకులూ, - రాజకీయ వేత్తలూ, ఆర్థికశాస్త్రజ్ఞులూ, పారిశ్రామికులూ చెప్పినజోస్యాలూ, యిచ్చిన హామీలూ అలా వుంటూండగా, యీ నాల్గు సంవత్సరాల్లో కార్మికులుపడిన యాతనలు, అనుభవించిన కష్టాలు చెప్పేదేమిటి!

మేం చూసినదానివల్లా, తెలుసుకున్నదానివల్లా, సోవియట్ దేశంలో యిదిసంభవించలేదు!

ఎప్పటికప్పుడు విషయాల్ని తెలియజేస్తూ బోధిస్తూ ఉత్సాహపరుస్తూ ప్రభుత్వం గోడలమీద విపులమైన ప్రచురణార్థం రాయించిన సంఖ్యలలో అభివృద్ధిచెందుతూన్న ఉత్పత్తీ, వేతనాలూ కనిపిస్తాయి. ఉదాహరణకు 1934-36 సంవత్సరాలమధ్య సోవియట్ దేశ జనసంఖ్యకు నూటికి ముప్ఫయిపాళ్ళచొప్పున, అంటే ఒకటింట మూడవభాగం, యెక్కువగా ఆహారం అభివృద్ధిఅయింది. విప్లవానికి పూర్వంవున్న రోజులతో యిప్పటి రోజుల్ని సరిపోల్చినట్టయితే, ఆహారభక్షణం రెండున్నరరెట్లు, యెక్కువయింది. పూర్వం, ఒకవ్యక్తి రోజుకు ఒకరొట్టెతింటూంటే యిప్పుడు రెండున్నర రొట్టెలు తింటున్నాడన్నమాట. జారిస్టురోజులకు యిప్పటికీ పాలుపుచ్చుకోవడమూ, మాంసభక్షణమూ రెట్టింపు అయింది. పూర్వానికీ యిప్పటికీ మూడున్నరరెట్లు యెక్కువగా పంచదార వాడుతున్నారు. కాయగూరలు సగానికిపైగా యెక్కువ ఖర్చవుతున్నాయి. ఐదేళ్ళ కార్యక్రమాలు ఆచరణలో పెట్టినప్పట్నుంచీ బట్టలు సగానికిపైగా యెక్కువ కర్చవుతున్నాయి. 1930 లో ఒకవ్యక్తికి ఒక్క బనియనేవుంటే యిప్పుడు దాంతోబాటు ఒక కమీజుకూడా కొనుక్కోగలడన్నమాట; ఒకవ్యక్తి సంవత్సరానికి ఒక్క సూటే అప్పుడు కొనుక్కోగలిగితే యిప్పుడు ఆసూటుతోబాటు ఒక పేంటుగాని కోటుగాని కొనుక్కోగలడన్నమాట.

## సంభవించిన ఒక అసంభవం

అధికారులు ప్రకటించిన యీ సంఖ్యలను షాపుల్లో జరుగుతున్న వ్యాపారం రూఢిచేసింది. గతరాత్రికీ యీవేళ ఉదయానికీ మధ్య ఒక ముఖ్యమైన సంఘటన జరిగింది. సహకారసంస్థల స్టోర్లలోనూ డిపార్టుమెంటు స్టోర్లలోనూ, చిన్నషాపుల్లోనూ, రెడ్ఆర్కేడ్ బజార్లలోనూ, ప్రతిచోటా అన్ని సామాన్లకీ నూటికి నలభైనుండి యిరవై ఐదువరకూ ధరలు తగ్గించినట్టు తెలియజేస్తూ నోటీసులు పెట్టబడ్డాయి! అకస్మాత్తుగా చేసిన యీవిధమైన ధరల తగ్గింపు కనీ వినీ యెరుగనట్టిది. పెట్టుబడిదారీ దేశాల్లో యిటువంటిది తరుగుతుందని భావించుకోవడానికైనా సాధ్యం కాదు. అసలు అసంభవం. ఒకవేళ అటువంటిది జరిగితే, వ్యాపారసంస్థలన్నీ దివాలాతియ్యడమూ, ఉత్పత్తిపంపిణీశాఖల్లో పనిచేస్తూన్న లక్షలాది ప్రజలకు ఘోరవిపత్తు రావడమూ జరుగుతుంది.

సోవియట్ దేశంలో ఇటువంటిది ఎలాసాధ్యమవుతుందా అని మాకు ఆశ్చర్యంవేసింది. ఎవరినుండైనా దీనిగురించి విపులంగా తెలుసుకోవడాని కని చుట్టూరాచూసేం. బజారులో అమ్మకం చాలా జోరుగాసాగుతూంది.

బోల్షయ్ నాటకశాలదగ్గరగావున్న ఒక చిన్నస్టోరులో ప్రవేసించేం. కొంచంమురబ్బాకొనే సాకుమీద డైరక్టరువద్దకువెళ్ళి మాప్రశ్నలన్నీవేసేం:

"ఈ ధరల తగ్గింపువల్లవచ్చే నష్టాన్నంతా యెవరు భరిస్తారు? ఈవిధమైన ధరలతగ్గింపు యెలాగ సాధ్యపడింది? ఏదో ఒక రూపంలో ప్రజలే యీనష్టాన్ని భరిస్తారా?"

సోవియట్ దేశంపట్ల సానుభూతిగల విదేశీయులువేసే ప్రశ్న పరంపరలకు యీషాపుల్లోవున్న వాళ్ళుఅలవాటుపడివున్నారు. మా అదృష్ట వశాత్తూ షాపు డైరెక్టరు చాలా బాగా జర్మన్ భాష మాట్లాడగలడు. కొద్ది మాటల్లో ఆయన మా సందేహాలన్నిటినీ తీర్చివేసేడు:

"ఈ షాపులతోబాటు ఉత్పత్తి పంపకాలు సోవియట్ ప్రభుత్వానివి అంటే సోవియట్ దేశ ప్రజలవన్నమాట. కార్మికుల దేశభక్తియుక్తమైన కృషివల్ల ఉత్పత్తి అధికమయింది.

"ఉత్పత్తికయ్యే వ్యయం చాలా తగ్గిందని ప్రభుత్వం తెలుసుకొని, అన్ని వస్తువుల ధరలూ తగ్గించవలసిందని నిర్ణయంచేసింది. నష్టమేమైనా వచ్చినట్టయితే దాన్ని ప్రభుత్వమే భరిస్తుంది; వ్యక్తిగతమైన వ్యాపారం, లాభోద్దేశం, దోపిడీలనే భూతాలకు పెట్టుబడిదారీదేశాలు పట్టాభిషేకం చేసేయి. అందుచేత ఆదేశాల్లో రాత్రితరవాత పగలువచ్చేటట్టు, ఎక్కువ ధరలూ తక్కువ కూలిరేట్లూ రాకతప్పదు; భాగ్యవంతులు మరీ భాగ్యవంతు లవుతారు. పేదవాళ్లు యింకా పేదవాళ్ళవుతారు. మాదేశంలో నినాదం యేమిటంటే: ఎక్కువగా ఉత్పత్తిచెయ్యి, చవకగా ఉత్పత్తిచెయ్యగలుగు తావు; ఎక్కువగా ఆర్జించి ఎక్కువగా కర్చుచెయ్యి! ఈ ధరల తగ్గింపు వల్ల ప్రజలు జీవితాన్ని యెక్కువ సౌఖ్యవంతంగా చేసుకుంటారు. దీని వల్ల యింకా యెక్కువగా ఉత్పత్తిచెయ్యడం అవుతుంది. దీనివల్ల వ్యాపారసంస్థలకు యింకా యెక్కువ లాభాలువస్తాయి! హెచ్చులాభాలు వస్తే దాంతో ధరలు ఇంకా తగ్గుతాయి!"

"కాని మీరు అడ్వర్టైజ్‌మెంటు చెయ్యరుగదా, మీతో పోటీ చేస్తూన్న మీ పొరుగు షాపుకంటె యెక్కువగా ఎలా అమ్మకంచేయగలు తున్నారు?" అని మేం అడిగేం.

"మేమందరంకూడి, కొనుక్కోవడానికివచ్చిన వాళ్ళకి సేవచేస్తూ మా సేవద్వారా యెక్కువ అమ్మకంచెయ్యడానికి పోటీచేస్తాంగాని, ధరలు తగ్గించీ, వస్తువనాణ్యాన్ని పాడుచేసీ, పనిచేసేవాళ్ళను కొందర్ని తీసివేసీ కాదు. ఉదాహరణకు, నాషాపుకు సామాన్లుకొనడానికివచ్చిన వాళ్ళకోసం చక్కటి ఫొటోగ్రాఫుక్లబ్బులపెట్టి ఆకర్షిస్తున్నా. మరి ఒకపెద్ద హాబీస్ క్లబ్బు నడపడానికికూడా ఆలోచిస్తున్నాను. సహకారసంఘం స్టోర్సువారు తమ ఖాతాదార్లను ఉత్సాహపర్చడానికి ఒక సినిమా నడుపుతూవుంది. ప్రక్కవీధిలోవున్న పెద్ద డిపార్టుమెంటుస్టోరు ఒక ప్రఖ్యాతమైన సంగీత పాఠశాల ఉచితంగా నడుపుతూంది; ఒకపెద్ద గ్రంధాలయాన్నికూడా నడుపుతూంది. నేను దీనికి పోటీగా ఒక సుప్రసిద్ధ శాస్త్రజ్ఞుడిచేత ఉపన్యాసాలు, లేకపోతే పెద్ద రచయితచేత గ్రంధపఠనంగాని పెట్టాలనుకుంటున్నాను. ఆర్థికంగా మాకు సాధ్యపడ్డట్టు మా పౌరులకు సేవచేయ్యడమే మా అందరి లక్ష్యమని, దీనిబట్టి మీకు స్పష్టమవుతుంది. అయితే - ఒక్కవిషయం మర్చిపోకండి. ఈ బజార్లు - ఈ షాపులు - ఈ స్టోర్సు - ఇవన్నీ గవర్నమెంటు సంస్థలు, గవర్నమెంటు అంటే ప్రజలు. అంచేత మేం గవర్నమెంటు ఉద్యోగులం అయినా ప్రజాసేవకులం - ఈ సరుకులన్నీ ప్రజల సొత్తు - ప్రజలే మా యజమానులు! కామ్రేడ్సు! సెలవు."

## జీవితం సుఖతరమైంది, తేజోవంతమైంది

ఇక కూలిరేట్ల తీరు ఎలాగవుంది? సౌష్టవమైన ఆర్థికవిధానాన్నీ ఉత్పత్తి విధానంలో సంపూర్ణమైన కొత్తవిధానాన్నీ రెండో ఐదేళ్ళ కార్యక్రమం ప్రవేశపెట్టడంవల్లను కూలిరేట్లునూ ప్రజల ఆదాయమునూ అభివృద్ధిపొందినట్లు మా భోగట్టాలవల్ల మాకు తెలిసింది.

1929 తో సరిపోల్చినట్టయితే 1936 చివరకు కార్మికుల ఆదాయాలు మూడున్నరరెట్లు అధికమయ్యేయి. భూములమీదవచ్చే ఆదాయం దాదాపు రెట్టింపయింది. ఫ్యాక్టరీ కార్మికుల ఆదాయం సుమారు మూడరెట్లయింది. మోటారుకార్లు ఉత్పత్తిచేసే పరిశ్రమలూ హెవీ ఇండస్ట్రీలులాంటి కొన్నిటిలో కూలిరేట్లు నాలుగురెట్లకుపైగా అయ్యేయి.

ఉత్పత్తి యెన్నోరెట్లు యెక్కువయింది. అన్ని పరిశ్రమలలోనూ ఈ అభివృద్ధివుంది. ఉత్పత్తిగమనంలో స్టక్‌నొవ్ ఉద్యమం దిగ్భ్రమ కలిగించే వింతలు చేసింది. ప్రతి ఫ్యాక్టరీలోనూ, సంస్థలోనూ షాక్‌బ్రిగేడ్లు

ఏర్పాడ్డాయి. కార్మికసంఘాల ప్రోత్సాహంతో, ఒకదానితో ఒకటి సామ్య వాద పోటీలు చేసేయి. అధికోత్పత్తి చేయడంలో ఒక బ్రిగేడు యింకో బ్రిగేడుతోనూ, ఒక ఫ్యాక్టరీ యింకో ఫ్యాక్టరీతోనూ పోటీలుపడ్డాయి. ఎక్కువగా ఉత్పత్తిచేసే కార్మికులు ఎక్కువగా ఆర్జించసాగేరు. బుద్ధి వైశద్యమూ నైపుణ్యమూగల పద్ధతుల్ని అనుసరించి, స్టక్‌నొవైట్లు అధికోత్పత్తిచేస్తూ పెద్ద పెద్ద బహుమతులు పుచ్చుకుంటున్నారు. ఈ అధికధనార్జనతోబాటు యీ స్టక్‌నొవైట్లు జాతీయవీరులుగా ప్రజల చేత అభినందింపబడతారు; వీరికి మంచి యిళ్ళు యివ్వబడతాయి; చదువు కోవడానికీ యెక్కువగా తర్ఫీదుపొందడానికీ అధికంగా విశ్రాంతి యివ్వ బడుతుంది. ఇదంతా సాధారణ కార్మికులనుండి వచ్చిన ఉద్యమం. బాగాను తెలివిగాను పనిచెయ్యడం దేశసేవగా పరిగణింపబడుతూంది; ఎక్కువగా ఉత్పత్తిచేయడం పవిత్రమైన కర్తవ్యం; యెక్కువనైపుణ్యమూ యెక్కువ బుద్ధి కౌశల్యమూ యెక్కువ చాకచక్యమూగల కార్మికునిగా తయారుకావడ మంటే తమతరంలోనే సోవియట్‌దేశాన్ని సామ్యవాదానికి యింకా సన్ని హితం చేయడం అన్నమాట!

మోటార్ల ఉత్పత్తి, బొగ్గుగనుల్లోపని, పెట్రోలుతీసి పరిశుభ్రం చేయడం, కలపకొట్టడం, ట్రాక్టర్ల ఉత్పత్తి, రైళ్ళు మరమ్మత్తు చేయ డమూ, వ్యవసాయమూ, ఇనుము కరిగించడమూ, ఉక్కుపోత పొయ్య డమూ, రసాయనిక పదార్థాలను ఉత్పత్తిచెయ్యడమూ, విమాన ఉత్పత్తి, యుద్ధసామగ్రి ఉత్పత్తి, కాగితం తయారుచేయడం, ముద్రణ ప్రచురణా, నిలవజేసిన తినుబడివస్తువులూ, రబ్బరు పరిశ్రమ, సిమెంటూ, ఇనుప సామానుల ఉత్పత్తి - వీటన్నిట్లో ఉత్పత్తి రెండురెట్లూ మూడురెట్లూ పెరిగిపోవడమేకాకుండా నూటికి పదినుండి యిరవైవరకూ హెవీ ఇండస్ట్రీలలోనూ, నూటికి యిరవైఐదునుండి ముప్ఫైవరకూ తక్కిన కొన్నిట్లోనూ ఉత్పత్తివ్యయం తగ్గించబడింది.

ఇరవయ్యవ విప్లవవార్షికోత్సవానికి ప్రోత్సాహకరంగా యీవేళ "మాస్కోన్యూస్" పత్రిక ఒక పేజీనిండా కార్మికుల ఉత్పత్తి గరిష్ట సంఖ్యల్ని ప్రకటించింది. దేశంలో నిరుద్యోగమన్నదిలేదు. పరిశ్రమలు విరామంలేకండా పనిచేస్తున్నాయి. ఆదాయాలు అధికమవుతున్నాయి. వస్తువులధరలు తగ్గిపోతున్నాయి. ప్రజల జీవితం నానాటికీ యెక్కువ సౌఖ్యవంతం అవుతూంది. ఈ సంవత్సరాంతంసరికి, అంటే రెండో

ఐదేళ్ళ కార్యక్రమం పూర్తిఅయ్యేసరికి, ఆదాయాలు యింకా అధిక మౌతాయి, వస్తువులధరలు యింకా తగ్గిపోతాయి। అని ఎంతో ఉత్సాహంగా చాలామంది మాతో అన్నారు "జీవితం సుఖతరమైంది. జీవితం తేజోవంతమైంది!" అని స్టాలిన్ అన్నమాటల్లో అతిశయోక్తియేమీలేదు.

## కా ర్మి క స్వ ర్గ ం

మేం చూడదలచుకున్న సంస్థలలో మాస్కో రొట్టెల ఫ్యాక్టరీ ఒకటి. వెళ్ళినవాట్లో మొదటి ఫ్యాక్టరీ కావడంచేత విపులంగా అక్కడి భోగట్టాలు రాసుకున్నాం. అప్పుడు ఏమివ్రాసుకున్నామో అవే ఈ క్రింద పొందుపరుస్తున్నాము.

ఈ ఫ్యాక్టరీ 1929 లో నిర్మింపబడింది. ఇందులో ఏడువందల మంది కార్మికులు పనిజేస్తున్నారు. వారిలో నూటికి ఎనభైమంది, అంటే ఐదువందలయాభై మంది స్త్రీలు. శారీరకంగా యెక్కువ కష్టమైన పనులు పుగవాళ్లు చేస్తారు.

విప్లవానికిపూర్వం రొట్టెల ఫ్యాక్టరీలూ తినుబడివస్తువుల్ని నిలవ జేసే పరిశ్రమలూ దేశంలోలేవు. తమ తమ యిళ్ళలో వ్యక్తులు రొట్టెల్ని తయారుచేసి అమ్మేవారు. ఈ బేకరీలలో పనిచేయడానికి ఆడవాళ్ళకు వీలు లేదు. విద్యుచ్ఛక్తితో పనిచేసే రొట్టెల ఫ్యాక్టరీ మొట్టమొదట 1924 లో నిర్మింపబడింది. మొదటి ఐదేళ్ళ కార్యక్రమంకాలంలో దీని నిర్మాణం జరగడంవల్ల యిందులో ఇంగ్లీషుయంత్రాలూ, అమెరికన్ యంత్రాలూ వున్నాయి. తరువాత సంవత్సరాలలో ఈ మెషన్లను అనుకరించి రష్యన్లు తమదేశంలో స్వంత మెషిన్లనుచేసి, ఈ ఫ్యాక్టరీలో అదనంగాఅమర్చారు.

పనిస్వభావాన్నిబట్టీ కార్మికుని నైపుణ్యాన్నిబట్టీ కార్మికులు అనేక రకాలుగా విభాగింపబడ్డారు. చేసినపని పరిమితిప్రకారం వేతనాలిస్తారు. నెలకు సగటునవచ్చే కనిష్ఠాదాయం నూటఎనభై రూబుళ్లు. పన్నెండు వందలరూబుళ్లు అన్నిటికన్నా పెద్ద ఆదాయం.

ఈ ఫ్యాక్టరీకి స్వంత శిశుసంరక్షణాలయాలున్నాయి. నూటఎనభై రూబుళ్ళకు తక్కువ ఆదాయంగల స్త్రీలు శిశుసంరక్షణాలయాలకేమీ చెల్లించనక్కరలేదు. ఇంతకంటె ఎక్కువ ఆదాయాలుగలవాళ్లు తమ జీతాల్లో చాలా కొద్దిభాగం చెల్లించవలసివుంటుంది.

కార్మికులకోసం ఒక క్లబ్బూ, బాగా పుస్తకాలుగల ఒక గ్రంథాలయమూ, వార్తాపత్రికలూ, మాసపత్రికలూ మొదలైనవిగల ఒక పఠనమందిరమూ ఫ్యాక్టరీకి వున్నాయి. వీటికేమీ రుసుం చెల్లించనక్కరలేదు.

ఫ్యాక్టరీకి ఒక పఠనబృందంకూడా వుంది. అందులో యితరులు వచ్చి వివిధభాషలూ వాఙ్మయాలూ బోధిస్తారు. ఫ్యాక్టరీలో సంగీత తరగతులు కూడా వున్నాయి. దీనికి కార్మికులు కొంచెం రుసుము చెల్లించవలసి వుంటుంది.

ఆ పేటలోని కమ్యూనిస్టు పార్టీసభ్యులకు యీ ఫ్యాక్టరీ ఒక కేంద్రంకూడా.

కార్మికుల సౌకర్యంకోసం, మాస్కో డిస్ట్రిక్టులోవున్న కొండల్లో ఫ్యాక్టరీకి స్వంత విశ్రాంతిగృహంవుంది. కొద్దిపాటి రుసుం చెల్లించి కార్మికులు తమ సెలవుదినాలు అక్కడ గడపవచ్చును. వైద్యసలహామీద కార్మికులు విశ్రాంతిగృహానికి పంపబడితే, భోజనానికిగాని వసతికిగాని వైద్యులకుగాని మందులకుగాని యేమీ యివ్వనక్కరలేదు. దీంతోబాటు, ఫ్యాక్టరీలో స్వంత వైద్యాలయంవుంది. ప్రతినెలా కార్మికుల ఆరోగ్యం పరీక్షింపబడుతుంది.

ఈ ఫ్యాక్టరీకి క్రెమియాలో యింకొక విశ్రాంతిగృహంవుంది. మాస్కో యితర ఫ్యాక్టరీలలో పనిచేస్తూన్న కార్మికులుకూడా యిక్కడ వుండవచ్చు.

పూర్తి జీతాలతో సంవత్సరానికి ఒక పక్షంరోజులు కార్మికులకు సెలవులుంటాయి. ఇరవైఐదుసంవత్సరాల ఉద్యోగపరిమితి అయిపోగానే పూర్తి జీతాలు పించనీగా యిస్తారు. లేకపోతే పురుషులకైతే యాభైఐదు సంవత్సరాలు స్త్రీలకైతే యాభై సంవత్సరాలు దాటగానే పూర్తిజీతాలు పించనీగా యిస్తారు.

పధ్నాలుగు సంవత్సరాల వయస్సప్పుడు ఎప్రిన్‌టిసుల్ని తీసుకుంటారు. వీళ్లు నాలుగుసంవత్సరాలు ట్రైనింగు పొందాలి. ఎప్రిన్‌టిసులు మొదటి రెండేళ్ళూ, రోజుకి రెండుగంటలు ఫ్యాక్టరీలోనూ, మూడుగంటలు ఫ్యాక్టరీకి అనుబంధంగావున్న పైలెట్‌ప్లాంటులోనూ పనిచేస్తారు. రెండు గంటలు క్లాసుల్లో చదువుకుంటారు. తరవాత రెండేళ్లూ, పైలెట్‌ప్లాంటులోనూ ఫ్యాక్టరీలోనూ మూడేసిగంటల చొప్పున పనిచేస్తారు; రెండు

గంటలు క్లాసులో చదువు కుంటారు. ఎప్రెన్‌టిసులకి నెలకు డెభై ్ఫరూబుళ్లు విద్యార్థివేతనాలిస్తారు; వాళ్లు ఫ్యాక్టరీలో సంపాదించినదాంతోబాటు నాలుగు వందలరూబుళ్ళవరకు కూడా ఆర్జిస్తారు.

కార్మికులకోసం ప్రత్యేక సాంకేతిక పాఠశాలను ఫ్యాక్టరీ నడుపు తూంది. పెద్ద ఉద్యోగాలుపొంది యెక్కువ ఆదాయం సంపాదించే అవకాశం పొందడానికి కార్మికులు నిర్బంధంగా యీ పాఠశాలకువెళ్ళి నేర్చుకోవాలి.

మూడుజట్లు (షిఫ్టులు) వారీగా ఒకొక్కటీ యెనిమిదిగంటల చొప్పున - ఫ్యాక్టరీ పనిచేస్తుంది. కార్మికులు పనిచేసేకాలం ఏడుగంటలు. పని మధ్యలో భోజనానికీ అప్పుడప్పుడు కాస్సేపు పొగతాగడానికీ మొద లైన వాటికి ఒకగంట విరామంవుంటుంది. ఈ గంటకు అధిక వేతనం ఇస్తారు. రాత్రి పది - ఉదయం ఆరు గంటల మధ్య పనిచేసేవారికి యెక్కువ జీతాలుంటాయి. ప్రతి ఆరోరోజు సెలవుదినం. ముందుగా రెండుమాసాలూ, రెండుమాసాలు తరవాతా పూర్తి జీతాలతో గర్భిణీస్త్రీ లకు సెలవులుంటాయి. జీతాలలో మగవాళ్ళకీ ఆడవాళ్ళకీ హెచ్చు తగ్గులులేవు.

మాస్కోలో విద్యుచ్ఛక్తితో నడుపుతూన్న రొట్టెల ఫ్యాక్టరీలు ఇంకా పదిహేనువున్నాయి. రొట్టెల ఉత్పత్తి ఒక నియమిత పద్ధతి (ప్లాను) ప్రకారం జరుగుతూంది. పదిమైళ్ళ వైశాల్యంలోగలవారికి సరిపోయే రొట్టెలు ఒకొక్క ఫ్యాక్టరీ ఉత్పత్తి చేస్తుంది. విప్లవంతరువాత సగటున ప్రతి వ్యక్తీ మూడురెట్లు యెక్కువగా రొట్టెలు తింటున్నాడు. దాంతో బాటు ప్రజల అభిరుచులుకూడా ఎక్కువ అవడంచేత అనేకరకాలరొట్టెలు, కేకుస్, బన్నులు, రస్కులు అవసరమవుతున్నాయి. అత్యధికోత్పత్తి ఫలితంగా జరిగే దుర్వ్యయం దండుగలులేకండా చెయ్యడానికి, జాగ్రత్తగా ఉత్పత్తిపద్ధతిని నిర్ణయించుకోవలసివచ్చింది. మిగిలిపోయిన రొట్టెల్ని బిస్కత్తులుగా చేస్తున్నారు. మిగిలిపోయిన రొట్టెల్లో కొంతభాగం పశువుల ఆహారానికి ఉపయోగిస్తున్నారు. ఈ ఫ్యాక్టరీ రోజుకి రెండువందలయాభై టన్నుల రొట్టెల్ని ఉత్పత్తి చెయ్యగలదు. ఇందులో నూటఎనభై టన్నులు "రై" ధాన్యంతోను గోధుమతోను కలిపిచేసే "నల్ల" రొట్టెలు; మిగిలిన భాగం అచ్చంగా గోధుమపిండితో తయారుచేసిన "తెల్ల" రొట్టెలు.

ఈ ఫ్యాక్టరీలోని యంత్రాలనన్నిటినీ సర్వదా ఉత్పత్తిని దృష్టిలో పెట్టుకొని పనిచేస్తారు. ఫ్యాక్టరీలో చాలాచోట్ల ఉత్పత్తి పటాలూ, దుర్వ్యయంకూడదుఅని నినాదాలు నదరైనచోట్లలో ప్రదర్శించబడ్డాయి. ముడివస్తువుల్నీ తయారైన పదార్థాల్నీ పరీక్షించడానికి మంచి పరికరాల తోనూ పరివారంతోనూవున్న పరిశోధనాలయాన్ని ఫ్యాక్టరీ నడుపుతూంది.

## బోనస్సులు

అన్ని సంస్థల్లోలాగనే యీ ఫ్యాక్టరీలోకూడా, ఫ్యాక్టరీ బాగా పని చెయ్యడానికీ, లాభకరంగావుండడానికీ ముఖ్యాధికారి అయిన మేనేజరు బాధ్యుడు. దాదాపు పన్నెండువందల రూబుళ్లు అతనిజీతం. ఫోరుమన్లూ, తదితర నైపుణ్యంగల కార్మికులూ, చేసిన పనినిబట్టి జీతాలు యిస్తారు గాబట్టి, మేనేజరు కంటె వీరికే హెచ్చు ఆదాయం ముడుతుంది. ఫ్యాక్టరీ వల్ల వచ్చిన లాభాలు ప్రభుత్వ ఆహారశాఖకు జమఅవుతుంది. ఇందులో నూటికి రెండు నుండి ఐదుపాళ్లవరకూ ఆహారశాఖ తిరిగి ఫ్యాక్టరీకే యిచ్చివేస్తుంది. ఫ్యాక్టరీ డైరెక్టరు యీ ధనాన్ని అందరు కార్మికులకూ అదనపు బోనస్సుగా పంచుతాడు. యెక్కువగా వుత్పత్తి చేసిన కార్మికు లకు అధికంగా బోనస్సు వస్తుంది. ఒకేరకం వస్తువుల్ని ఉత్పత్తిచేసే ఫ్యాక్టరీలు, అధికోత్పత్తి చెయ్యడంలో సవాలుచేసుకొని ఒకదానితో ఒకటి "సామ్యవాదపోటీ" పడతాయి. గెలుపొందిన ఫ్యాక్టరీకి ప్రభుత్వం మంచి మొత్తండబ్బు బహుమతిగా యిస్తుంది. ఈ డబ్బులో యెక్కువభాగం, కార్మికులకు ఫ్యాక్టరీ యేర్పాటుచేసిన సౌకర్యాలను అభివృద్ధి చెయ్యడానికీ, కొత్త సౌకర్యాలను కల్పించడానికీ, వినియోగింపబడుతుంది. ఉత్పత్తి యెక్కువ చేసిన వారికి అధిక ప్రతిఫలం చొప్పున, మిగిలిన ధనం కార్మికు లందరికీ పంచిపెడతారు. డైరెక్టరూ, ఇంజనీరూ, కోశాధికారివంటి పెద్ద ఉద్యోగులకు మాత్రం యిందులో భాగం వుండదు.

ఒక కార్మికసంఘ వార్తాపత్రికనూ, ఒక ముఖ్యమైన గోడవార్తా పత్రికనూ యీ ఫ్యాక్టరీ నడుపుతూంది. మేం వెళ్ళేటప్పటికి విరామంలో వున్న స్త్రీ పురుషకార్మికులు యీ గోడవార్తా పత్రికను బిగ్గరగానూ ఉద్రే కంతోనూ చదువుతున్నారు.

## చరిత్ర రూఢిచేసిన సత్యం

మేం యీ ఫ్యాక్టరీని చూడడం పూర్తయింది. ఫ్యాక్టరీగేట్లు దాటుతుండేసరికి, ముందుకు చాచుకొనివున్న మరతుపాకులతో రెండుటాంకులూ వాటిమీద ముందుకొకటీ వెనకకొకటీ పెద్దతుపాకులూ, మాదృష్టినిపడ్డాయి; పేల్చడానికి సిద్ధంగా వాటిదగ్గర మనుషులున్నారు; నిరపాయకరమైన రొట్టెల ఫ్యాక్టరీలో యీ మారణయంత్రాలేమిటి అని మాకు చాలా ఆశ్చర్యం వేసింది. ఇక్కడ యీ యుద్ధసామగ్రి యెందుకుంచేరని ఫ్యాక్టరీ మేనేజర్ని అడిగేం. ఫ్యాక్టరీ కార్మికులు చందాలువేసుకొని వీటిని కొన్నారనీ వీటిని ఉపయోగించడానికికూడా తర్ఫీదై వున్నారనీ మేనేజరు సమాధానంచెప్పేడు; అవసరంవస్తే తమ ఫ్యాక్టరీని రక్షించుకోడానికి సంసిద్ధంగా ఆ యుద్ధ సామగ్రిని అక్కడవుంచేమనీ చెప్పేడు.

మేం ఆశ్చర్యపోయి, "ఎవరిబారినుండి ఫ్యాక్టరీని రక్షించడానికి ?" అని అడిగేం.

మేనేజరు వెంటనే సమాధానం యిచ్చేడు; "మామీదికి దాడిచేయడానికి సాహసించేవారెవరిమీదకైనాసరే;"

మానేజరు ఉద్దేశపూర్వకంగానే సంక్షేపంగా సమాధానం యిచ్చేడు. అంతకన్నా యెక్కువగా వెల్లడి చేయడం అతని కిష్టంలేదు. అయినా మావెంటనుండి దేశాన్ని చూపుతూన్న దర్శకురాలిని అడిగేం. ఈమె చాలా తెలివైన మనిషి; కొంత విపులంగా చెప్పింది.

"గత ప్రపంచమహాయుద్ధం అయిపోయినవెంటనే. అప్పటివరకు ఒకదాన్నొకటి హతమార్చుకొంటూన్న దేశాలన్నీ కుమ్మక్కుచేసుకొని, మామీదికి దాడిచేసేయన్న సంగతి మీకు తెలుసు. విప్లవ విద్రోహులైన రష్యను సేనానుల సహాయంతో గ్రేట్‌బ్రిటన్, ఫ్రాన్సు, జర్మనీ, జకోస్లొవాకియా, అమెరికా, ఇటలీ, సెర్బియా, పోలండ్, ఫిన్‌లండ్, రొమేనియా, జపాన్— ఈ దేశాలన్నీ మాదేశంలోకి దాడిచేసేయి. మాస్కో, లెనిన్‌గ్రాడ్ పట్టణాల్ని శత్రువులు ఆక్రమించేసుకొంటారా అని భయం వేసింది. కాని 1922 సరికి వాళ్ళను బయటికి తరిమివేసేం. సైనికంగాను నేడు సోవియట్‌దేశం ఒక బలవత్తరమైన దేశంగా పెంపొందింది. మమ్మల్ని సవాలు చెయ్యడానికి ఎవడూ సాహసించడు, అయినా స్పైన్, అబిసీనియా దేశాల్లోని సంఘటనలూ, మాకూ జపానుకూ సరిహద్దుల్లో

జరిగిన సంఘర్షణలూ, మామీద విషం కక్కుతూ తమ నాయకునిపట్ల దేశరక్షణపట్ల సోవియట్ ప్రజలు చూపుతూన్న విశ్వాసాన్ని, పట్టుదలను చూస్తూంటే, మేము బెర్లిన్‌లో ఎ. బి. అనే మిత్రునితో మాట్లాడినసంగతి జ్ఞాపకానికి వచ్చింది. అది దీనికి పూ_ర్తిగా విరుద్ధం. ఆ ఎ. బి. అనే ఆయన మాలో ఒకరికి పదిహేనేండ్లుగా తెలుసు. జర్మనీలోని ప్రధాన వాణిజ్యసంస్థలో అతడు ప్రముఖోద్యోగి. మేము మాస్కోకు బయలు దేరేముందు సాయంత్రంగా ఆయనింటి కెళ్ళాము. సరే మా సంభాషణ జర్మనీలోని పరిస్థితులలోకి దిగింది. మాట్లాడుతూన్నట్టుగానే బి. సతి తటాలున లేచి కనుసన్నతో జాగ_ర్తగా బయిటికి తొంగిజూచి తలుపులన్నీ మూసి గడియవేసింది.

అప్పుడామె చెప్పింది. ఆమే ఆమె మగడూ హిట్లరు వ్యతిరేకు లట. నాజీల కీసంగతి తెలుసునా తాము ఖైదులోనుంచీ తప్పించుకొని వస్తున్నామని చెప్పింది. ఎ. బి. కి వ్యాపార ప్రపంచంలో ఉన్న ఉన్నత స్థానమే యిందుకు కారణమేమోనని వారిభావం. ఇంత దారుణంగా అణచి పెడుతున్నా. ఖూనీలు చేస్తున్నా, ఖైదులో తోస్తున్నా, ఇప్పటికీ ఇప్పటికీ రెండులక్షలవరకూ హిట్లరు వ్యతిరేకులున్నారు. వీరు జర్మనీ అంతఃపుర రహస్యసంఘాలూ సమితులూ యేర్పరచుకొని ఉన్నారనికూడా వారు మాకు చెప్పారు.

అతి శ_క్తివంతమైన నాజీపార్టీకి విరుద్ధంగా మీరు చేయగలదేముం దని అడిగాము. తామిప్పుడు కొద్దిమందే ఉన్నప్పటికీ, ఎలా వేచివుండాలో తమకు తెలుసుననీ. అయిదో పదో పదిహేనో సంవత్సరాలు పట్టినాసరే అవకాశం కోసంకాచుకొని వుంటామని తప్పకుండా వస్తుందనీ, అన్నారు. తాము సోషల్‌డెమాక్రాట్లలాగా దేశాన్ని హిట్లరుకు బహుమతిగాయిచ్చి పరువె_త్తిపోమని చెప్పారు.

ప్రస్తుత హింసావిధానాన్ని దేశంలో రూపుమాపేందుకు వీలయ్యే దినంకోసం ఎదురుచూస్తూ, ఎట్టి ప్రమాదాలనైనా ధైర్యంతో ఉదారంగా ఎదుర్కో సిద్ధంగా ఉన్నామనీ చెప్పారు.

వారికొడుకు హెల్మత్ ఇలా చెప్పాడు. అతనివయసు 14 ఏండ్లు వాని బడిలో తనకూ సహచరులుగా ఎలా నాజీ సిద్ధాంతాలు నూరిపోస్తారో తెలియజేశారు. అతనింటికి వస్తూనే ఒక కాగితం తీసుకొని రెండువైపులా నిండేవరకూ "హిట్లరో దెయ్యం. వాణ్ణి నాశనం చేస్తారు" అనేమాట

రాస్తాడట. తన ఈ దిన పాఠక్రమం ముగుస్తూనే ఆకాగితాన్ని అగ్గిలో పారేస్తాడట.

వాళ్ళకో చిన్నమ్మాయి 8 ఏండ్లదుంది. తమ యాత్రలూ విందులూ చెప్పింది. తానూ సావాసగత్తెలూ "హిట్లరుకూ జయ్" అని అరుస్తూ మనసులో "హిట్లరు నశించాలి" అనుకుంటూంటామని చెప్పింది.

ఎ. బి. లూ వారి రెండులక్షల హిట్లరు వ్యతిరేకులూ ఎప్పటికైనా, తమ మాతృదేశ ప్రేమను రుజువుచేసుకొనేందుకు వీలవుతుందో యేమో కానీ అదంతా మాకో అద్భుతవిషయ విజ్ఞానంగా తోచింది.

అనునిత్యం మా పొరుగుదేశాలనుండివచ్చే రేడియో దూషణలూ, తిట్లూ గమనించకండా మేం ఎలా వూరుకుంటాం? మేము నిరంతరం సిద్ధంగా వుండకపోతే శత్రువులు మాపీక పిసికేయరా? మీరు దర్శించే ఫ్యాక్టరీలన్నిటిలోనూ టాంకులూ, టాంకు విధ్వంసక తుపాకులూ మీకు కనిపిస్తాయి. కీడెంచి, మేలెంచాలన్నారు. అయినా మా కామ్రేడ్ స్టాలిన్ శాంతిపురుషుడు - యెప్పుడూ ప్రపంచశాంతికోసమే శాయశక్తులా పాటు పడతాడు.

## గోడవార్తాపత్రికలు

మేం చూసిన సంస్థలన్నిట్లోనూ గోడవార్తాపత్రిక గమనించవలసిన విషయంగా కనిపిస్తుంది. స్వభావాన్నిబట్టి రష్యన్లు చాలా ఆత్మచింతన గలవాళ్లు; ప్రజావిమర్శనానికి భయపడేతరహా వాళ్ళది. అంచేత గోడవార్తా పత్రికలు బాగా వ్యాపించేయి. ఫ్యాక్టరీలూ, పొలాలు, స్టోర్లూ, క్లబ్బులూ మొదలైన ప్రజాసంస్థల పరిపాలనగురించి ప్రభుత్వ ప్రోత్సాహంతో, స్థానిక ప్రజల అభిప్రాయాల్ని తెలియజేసే ముఖ్యాంగంగా గోడవార్తా పత్రికలు పెంపొందేయి. విమర్శనలో గోడవార్తాపత్రికలు, యెవరైనాసరే అధికారులనీ, సామాన్యపుపనివారని విచక్షణ చూపకండా నిష్పక్షపాతంగా విమర్శిస్తాయి. ఈ పత్రికల్ని కార్మికులే నడుపుతున్నప్పటికీ, నిర్భయంగా నిష్కపటంగా సూటిగా ప్రయోజనకరంగా తమలోపాల్ని వాళ్ళు విమర్శించుకుంటారు. ఈ గోడవార్తాపత్రికల్లో నిర్మాణరీత్యా చాలా విలువగల విమర్శలుంటాయనీ, ఉత్పత్తిని కుంటుపర్చే గుడ్డిపద్ధతులు సరిదిద్దబడతాయనీ, కార్మికుల్లోని నైపుణ్యాన్ని పరిశోధించి వారు ప్రోత్సహింపబడతారనీ, మేముచూచిన ప్రతి మేనేజరూ మాతో అన్నాడు.

## ఫ్యాక్టరీ సంఘాలు

సోవియట్ ఫ్యాక్టరీల పరిపాలనలో ఫ్యాక్టరీసంఘం యింకొక (Works Councils) ముఖ్యాంశం. ఫ్యాక్టరీలను చూడడానికి వెళ్ళేటప్పుడు, చాలా ఫ్యాక్టరీసంఘాలు సమావేశంకావడం చూసేం. ఉత్పత్తి కోటాను పూర్తిచెయ్యడమూ, నైపుణ్యంగానూ లాభకరంగానూ ఫ్యాక్టరీని పనిచెయ్యించడమూ సర్వాధికారియైన మేనేజరుపని. ఈవిషయంలో ప్రభుత్వానికి అతనేబాధ్యుడు. ఒక్కకార్మికుణ్ణయినా పనిలోనుండితొలగించకండా కార్మికులకూలిలో ఒక్క కోపెక్కయినా తగ్గించకండా మేనేజరు తనపని నెరవేర్చుకోవాలి. కార్మికసంఘం అర్గనైజరూ, కార్మికుల ప్రతినిధులూగల ఫ్యాక్టరీసంఘాల తోడ్పాటుతో, సర్వదా నిపుణుడైన మేనేజరు పనినడుపుకుపోతాడు. సాధారణంగా మేనేజరుకూడా కార్మికసంఘం సభ్యుడుగానే వుంటాడు. అంతర్గత క్రమశిక్షణ, ఉత్పత్తి లెక్కల్ని సరిచూడడం, పీస్ వర్కుకి పద్ధతుల్ని ఏర్పాటుచెయ్యడం, కూలిరేట్లను నిర్ణయించడం, ముడి వస్తువుల దుర్వ్యయాన్ని అరికట్టడం. కార్మికుల సాంఘిక సౌకర్యాలను నడపడం, శ్రమశక్తి సద్వినియోగమయ్యే పద్ధతుల్ని ప్రవేశపెట్టడం, ఓవరు టైము నిర్ణయించడం జీవితపరిస్థితుల్ని అభివృద్ధిచేయడమూ, నిపుణులైన కార్మికుల్ని ప్రోత్సహించడమూ మొదలైన విషయాలగురించి యీ ఫ్యాక్టరీ సంఘాలు పనిజేస్తాయి.

## నక్కకీ నాకలోకానికీ

ఈ ఫ్యాక్టరీసంఘాలకీ, యితరదేశాల్లోవున్న సంరక్షణసంఘాలకీ (Welfare Committees) యజమాన్లసంఘాలకీ (Employers 'Unions) యెంత వ్యత్యాసంవుంది!

మేం మాస్కో రావడానికి కొద్దివారాలముందు, జర్మనీలోని పెద్ద సిమెంటుఫ్యాక్టరీలలో ఒకదానికివెళ్ళేం; అక్కడ జరిగిన వింతసంఘటన ఒకటి యీసందర్భంలో మాకు జ్ఞాపకంవస్తూంది.

యజమానులూ కార్మికులూ కలసివున్న సంయుక్తసంఘం (Joint Councils of Employers & Workers) చాలా విజయవంతంగా ఫ్యాక్టరీని నడుపుతూండడాన్ని ప్రశంసిస్తూ, నాజీప్రభుత్వ కార్మికశాఖ యీ సిమెంటుఫ్యాక్టరీకి "ఆదర్శసంస్థ" అని బిరుదుయిచ్చింది. ఈదులాడ్డానికి విశాలమైన చెరువు, స్నానమందిరాలు హోటళ్లు, అంద

మైన క్లబ్బుగదీ, బీరుతాగేస్థలమూ ఆ సిమెంటుఫ్యాక్టరీ మేనేజరు మాకు సగర్వంగా చూపించాడు. అతనిదృష్టిలో అత్యుత్తమమైనదిగాబట్టి, సంయుక్తసంఘం సభామందిరాన్ని చిట్టచివరకు చూపడానికి వుంచేడు. ఓక్‌కర్ర అలంకరించిన గోడలతో ఓక్‌కర్రతో చేసిన అందమైన టేబిలూ కుర్చీలతో సభామందిరం దివ్యంగావుంది. హిట్లరు, నాజీజర్మనీ కార్మిక శాఖానియంత డాక్టరు వైగార్ల పెద్ద బొమ్మలు గోడల్ని అలంకరించి ఉన్నాయి. చర్మపు బైండుచేసి, సువర్ణాక్షరాలతో అలంకరింబడిన, సంయుక్తసంఘం యొక్క పెద్ద మినిట్సుపుస్తకం టేబిలుమీదవుంది. మహానాయకుడు హిట్లరు సంతకంతోవున్న సర్టిఫికేట్ మొదటిపేజీని అలంకరించివుంది. నాజీసూత్రాల ననుసరించి ప్రభుత్వాన్ని నిర్వహించ డంలో యీ సంయుక్త సంఘాలకుగల ఉన్నతస్థానాన్ని గురించీ, పారిశ్రామికార్థికంలో వాటికి గల ప్రాముఖ్యతను గురించీ, మాతో చెపుతూ డైరెక్టరు గర్వంతో ఉబ్బిపోయాడు.

"ఈ సంయుక్తసంఘంయొక్క అఖరుసమావేశం యెప్పుడు జరిగింది ?" అని అతని సంభాషణ మధ్యలో ప్రశ్నించేం.

అతని జబాబులో ఒకమాదిరీ క్షమాపణధ్వనించింది : "ఈ ఆరు మాసాలమధ్య జరగలేదు."

దాంతో మేం వూరుకోకండా యింకొక ప్రశ్నవేసేం : "అంతకు ముందు, సమావేశం యెప్పుడు జరిగింది ?"

డైరెక్టరు సమాధానం : "అది ప్రారంభం అయినప్పట్నుంచీ, సంయుక్తసంఘం యెప్పుడూ సమావేశంకాలేదు !"

పత్రికారచయితలన్నట్టు, యీ సందర్భంలో ఇంకా వ్యాఖ్యానిస్తే పునరుక్తి దోషం వస్తుంది !

## ఒక సమిష్టి వ్యవసాయక్షేత్రం

రష్యా గ్రామజీవితంగురించి తెలుసుకోవాలని సంకల్పించుకొని, పట్టణానికి నలభై మైళ్ళదూరంలో మాస్కో జిల్లాలోవున్న సమిష్టి వ్యవసాయక్షేత్రానికి వెళ్ళడానికి యేర్పాటుచేసుకుని మేము మరికొందరు కలిసివెళ్ళేం.

మొట్టమొదట డెబ్భైఏకుటుంబాల సభ్యత్వంతో యీ సమిష్టి వ్యవసాయక్షేత్రం 1929 లో ప్రారంభించబడింది. ఈ పద్ధతి జయప్రదంగా

కొనసాగుతుండడంవల్ల నూటనలభై కుటుంబాలవరకూ సభ్యత్వం పెరిగింది. ఈ కుటుంబాల మొత్తంసంఖ్య ఐదువందలమంది. అందరూ ఆగ్రామంలోనే నివసిస్తున్నారు.

వ్యవసాయపరికరాలు, మెషీన్లు, పశువులూ, ధనమూ మొదలైన వాటికి సభ్యులందరూ కలసిపెట్టిన పెట్టుబడివిలువ ఐదులక్షలరూబుళ్ళు.

ప్రతి సభ్యుడూ కష్టపడిన పనిరోజుల నిష్పత్తి ప్రకారం, వ్యవసాయక్షేత్రం ఆదాయాన్ని సభ్యులందరూ పంచుకుంటారు. పనిలోని కష్టాన్నీ పనిలోచూపవలసిన నైపుణ్యాన్నీ భూసారాన్నీ ఉపయోగించిన యంత్రాల్నీ మొదలైన వాటన్నిటినీ దృష్టిలోపెట్టుకొని, సగటున చెయ్య గలిగిన పనినిబట్టి పనిజేసినరోజుల్ని విలువకడతారు. ఈ పని కోటాను నెరవేర్చితే ఒకరోజుపనిచేసినట్టు సభ్యుడి లెక్కల్లో జమఅవుతుంది. ఇంకా యెక్కువపనిచేస్తే, నిష్పత్తినిబట్టి యెక్కువరోజులు పనిచేసినట్టు జమఅవుతుంది. పనికోటాను కొందరు చేయగలుగుతారు, కొందరు చేయలేకపోతారు. కాబట్టి, సంవత్సరాంతంసరికి ఒకసభ్యుడి లెక్కకి నాల్గువందల పనిరోజులూ యింకోసభ్యుడి లెక్కకి ఆరువందల పని రోజులూ తేలింది.

మొత్తం రాబడిలో ప్రభుత్వానికి చెల్లించవలసిన పన్నులు మొదట చెల్లించివెయ్యాలి. మరుసటిసంవత్సరానికి విత్తనాలకోసం అందులో ఒకభాగం ప్రత్యేకించాలి; సభ్యుల అనారోగ్యభీమాకోసం కొంతడబ్బు వుంచాలి; పశుసంపదను భీమాచెయ్యాలి. అనుకోకండా తగిలే కర్చులకీ, చిల్లర కర్చులకీ రాబడిలోనుండి కొంతడబ్బు వుంచాలి. మిగిలినమొత్తం సభ్యుల్లో పంపకంఅవుతుంది.

తన యిష్టానుసారం తనవంతుకు వచ్చినపంటవాటాను విక్రయించు కోడానికి ప్రతిరైతుకూ హక్కుంది. సమిష్టి వ్యవసాయక్షేత్రానికైనా అమ్మివేయవచ్చును, లేకపోతే తన వాటాలోని భాగాన్ని గాని పూర్తి వాటానుగాని పబ్లికు మార్కెట్‌లో అమ్ముకోవచ్చు. ధనరూపంలోను వస్తురూపంలోను సంవత్సర రాబడి పంపకం జరుగుతుంది. సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోని తన వాటాతోబాటు, తనయింటినీ, తోటనీ, ఆవూ కోళ్లూ, బాతులూ, పందులూ మొదలైనవాటినీ, ప్రతిరైతూ స్వంత ఆస్థిగా వుంచుకోవడానికి సోవియట్‌దేశ రాజ్యాంగ ప్రణాళిక అనుమతిస్తుంది.

కార్మికశక్తి నంతటినీ (గ్రామంలోవున్న స్త్రీ పురుషులందరూ కార్మికులే) నాలుగు జట్లుగా విభాగించేరు. రెండుజట్లు పొలంలో పని చేస్తున్నాయి. ఒకజట్టు కాయగూరలు పండిస్తూంది. నాలుగోజట్టు పశు సంరక్షణ చేస్తూంది. ఈ సమిష్టి వ్యవసాయక్షేత్రం ఐదువందల ఎకరాలు. ఇందులో, నూటడెబ్భైఐదు ఎకరాల్లో బంగాళాదుంపలు పండిస్తున్నారు. నూరెకరాల్లో పళ్ళతోటలున్నాయి. నూటడెబ్భైఐదు ఎకరాల్లో ధాన్యం పంటలు పండిస్తున్నారు. పళ్ళ మొక్కల్నీ కాయగూరపాదుల్నీ ఉష్ణసహాయంతో పెంచడానికి ఏభై యకరాలు వినియోగిస్తున్నారు. ఈ సమిష్టి వ్యవసాయక్షేత్రానికి స్వంతంగా ఒక రంగుల ఫ్యాక్టరీ ఆ గ్రామంలోనే వుంది. యీ ఫ్యాక్టరీని వాళ్లే నడుపుతారు.

ఇదొక చిన్న వ్యవసాయక్షేత్రం. కొన్ని పెద్దవాటికి పదిహేనువేల సభ్యత్వంతో ఒక లక్ష యిరవై ఐదువేల యకరాల భూములుంటాయి.

వివిధరకాల పనులకూ, దేని కేవిధంగా కూలి యివ్వాలో తెలియజేస్తూ ఒక పట్టికవుంది. దీనిప్రకారం సాయంత్రం అయ్యేసరికి ప్రతిసభ్యుడికీ కూలీ యిస్తారు. 1936 లో యీ క్షేత్రంలోని ప్రతి సభ్యుడికీ ప్రతి రోజుకూ సగటున పదిహేను రూబుళ్ళ డబ్బూ, ముప్ఫై కిలోగ్రాముల తూకం (60 పౌనులు) పళ్ళూ కాయగూరలూ వచ్చేవి. ఈ సంవత్సరం యిరవై రూబుళ్ళ నగదూ నలభై కిలోగ్రాముల తూకం (80 పౌనులు) పళ్ళూ కాయగూరలూ, రోజూ వస్తున్నాయి. ముగ్గురు పెద్దవాళ్ళుగల కుటుంబానికి, మొత్తం రాబడి పదిహేనువేల రూబుళ్ళ నగదూ, ముప్ఫైటన్నుల కాయగూరలూ యీ సంవత్సరానికి వస్తాయని అంచనాగా చెప్పవచ్చు. (మాసానికి నిపుణుడైన కార్మికుడిజీతం సగటున ఐదువందలనుండి ఆరువందల రూబుళ్ళవరకూ వుంటుంది.)

## సమిష్టి క్షేత్రంలో స్వయం పరిపాలన

ప్రతిసంవత్సరం సభ్యులందరూ సమావేశమై తమలోనుండి కార్య నిర్వాహక వర్గాన్ని యెన్నుకుంటారు. దీనిలో ఐదుగురు సభ్యులుంటారు. ఇందులో యిద్దరు సభ్యులు అధ్యక్షుడుగాను ఉపాధ్యక్షుడుగాను, లేకపోతే వ్యవహర్తగాను సహాయ వ్యవహర్తగాను వుంటారు. వారికి జీతాలుంటాయి. వారికి పొలంపని వుండదు. ఈ కార్యనిర్వాహకవర్గం, కార్యాలయం పనికోసం యిద్దరు గుమాస్తాల్ని పెట్టుకుంది. ఈ గుమా

స్తాలు పై వాళ్లు. వ్యవసాయక్షేత్రం సభ్యులుకారు. అవృత్తికీ మామూలుగా వచ్చే జీతాలు పుచ్చుకుంటారు. ఇప్పటి అధ్యక్షుడు, మునుపటి నాలు గేళ్లూ ఉపాధ్యక్షుడుగా పనిచేసేడు. గుమాస్తాలతోబాటు, యీ సమిష్టి వ్యవసాయక్షేత్రం జీతాలిస్తూ వ్యవసాయ నిపుణుల్ని పెట్టుకుంది.

పల్లెటూరి పిల్లలు !

మూడేళ్లు ఎనిమిదేళ్ళ మధ్య వయసుగల పిల్లలకు యీ సమిష్టి క్షేత్రం వారు శిశుసంరక్షణాలయాన్ని నడుపుతూన్నారు. రాజ్యాంగచట్టా న్ననుసరించి సమిష్టి వ్యవసాయక్షేత్రాలు విధిగా శిశుసంరక్షణాలయాలను నడపాలి. ప్రాధమిక ఆరోగ్యసూత్రాలు, టూత్‌బ్రష్‌తో పళ్లుతోముకోవ డమూ, కావలసినవన్నీ అమర్చుకొని స్నానంచెయ్యడమూ, తమ బట్టలు తామే ఉతుక్కోవడమూ, రంగుల్ని పోల్చడమూ, అంకెల్ని లెక్కపెట్ట డమూ, బొమ్మలు గియ్యడమూ, సంగీతం, నృత్యం ఈ శిశుసంరక్షణా లయంలో బోధిస్తారు. ఇందుకు సమిష్టిక్షేత్రంవారు తర్ఫీదుపొందిన ఉపాధ్యాయులను జీతాలమీద నియమించారు.

ఈ శిశుసంరక్షణాలయంలో తప్పటడుగులువేస్తున్న పసిపిల్లలూ కొంచెం ఎదిగిన పిల్లలూ స్నానాలుచేసుకొని, స్నానంతొట్టెల్ని కడుగు తున్నారు. మేం అక్కడికి వెళ్ళేటప్పటికి వాళ్ళందరికీ తలొక్కటి చొప్పున స్వంత అలమారాలున్నాయి. అలమరల్లోవున్న కొయ్యలకి టూత్ బ్రష్‌లు తగిలించుకుంటున్నారు. ఎవరితువ్వాలు వాళ్లు దండెలమీదవేసి యెండపెట్టుకుంటున్నారు. అంతవరకు బొమ్మరిళ్ళాటలు ఆడుకున్న నేలను తుడిచేసి అరల్లో తమ బొమ్మలు అమర్చుకుంటున్నారు యిళ్ళకు వెళ్ళిపోయేముందు.

ఈ సమిష్టి వ్యవసాయక్షేత్రానికి స్వంతసినీమావుంది. సభ్యుల కోసం ఒక క్లబ్బూ, పిల్లలకోసం ఒక గ్రంధాలయమూ వున్నాయి. సమిష్టిక్షేత్రం మదుపు అభివృద్ధి అవుతున్నకొద్దీ, సభ్యులకు కొత్త సాంఘిక సౌకర్యాలను కలిగించే ఉద్దేశంతోవున్నారు.

తమ సభ్యుల పిల్లలకోసం సమిష్టి వ్యవసాయక్షేత్రం ఒక పాఠ శాలనుకూడా నడుపుతూంది. ఈ పాఠశాలకు మేం వెళ్ళేం. అప్పుడు సుమారు సాయంత్రం ఐదుగంటలవుతుంది. శరదృతువుయొక్క గోరు వెచ్చని యెండలో ఆరుబయట పాఠాలు చెపుతున్నారు. ఉపాధ్యాయిని

ఒక యువతి. ఎనిమిది - పన్నెండుసంవత్సరాల మధ్యవయసులోవున్న పిల్లలు, బల్లలమీద ఆమెచుట్టూ కూర్చున్నారు. ప్రతి విద్యార్థి వంతుల ప్రకారం మధ్యకువచ్చి సాభినయంగా, పద్యంగాబోసు అప్పగిస్తున్నారు. ఒకొక్కరూ అప్పగించేక తమస్నేహితుల ప్రదర్శనంగురించి వాళ్ళందరూ చర్చచేస్తున్నారు. అందరూ అప్పగించడం అయ్యేక ఉపాధ్యాయిని లయ వేస్తుంటే, పాడుతూ, ఆడుతూ యిళ్ళకుపోయేరు.

## పంతులమ్మ

మేం చూడ్డానికివచ్చేంగదా అని ప్రత్యేకంగా పాటా ఆటా పెట్టేరా? అని దుబాసిద్వారా ఉపాధ్యాయురాల్ని అడిగేం. ఆవేళ పాఠశాలచూడడానికి యెవరైనా కొత్తవాళ్లు వస్తారని తమకు తెలీ దంది. ఆమెతో కాస్సేపు మాట్లాడేం. మంచి ఉత్సాహవంతురాలు. మీ విద్యావిధానంయొక్క ఆశ యాలేమిటి అని మేం అడిగితే - ఆమె నాలుగుమాటల్లో తేల్చేసింది.

"ఒకటి విద్యంటే వ్యక్తివికాసం, జ్ఞానపోషణ - వృత్త చదువు నిష్ప్రయోజనం.

"రెండు - వ్యక్తిత్వాన్ని, సమిష్టి జీవనాన్ని - విద్యావిధానంలో సమీకరించాలి.

"మూడు - కష్టపడిజీవించు, సౌఖ్యంగా జీవించు, సామాజికంగా జీవించు - విద్యావిధానం అంతాఇందుకే.

"నాల్గు - బాలబాలికలనందరినీ, మంచి సోషలిస్టులుగాను, మంచి మార్క్సిస్టులుగాను మంచి రష్యనులుగాను తర్ఫీదుచేయడం." యిది మామూలు కార్యక్రమమేనని ఆమె చెప్పింది.

## గ్రామజీవనం

మాస్కో మొదలైన పట్టణాలనుండి కార్మికయువకులూ, కమ్యూనిస్టుపార్టీ యువక సభ్యులూ (కామ్‌సొమోల్స్) తరచుగా యీ సమిష్టి వ్యవసాయక్షేత్రాలకు వస్తుంటారు. పిల్లల తోడ్పాటుతోనూ రైతుల సహకారంతోను, వేడుకలు, పాటకచేరీలు ఆటలపోటీలు హాబీ ప్రదర్శనలు వీళ్లు యేర్పాటు చేస్తుంటారు. పట్టణాలనుండీ ఫ్యాక్టరీలనుండీ యితర సమిష్టి క్షేత్రాలనుండీ యిక్కడికి నాటకసమాజాలుకూడా వస్తుంటాయి. తమ స్వంతనాటకసమాజాన్నీ వాద్యసమ్మేళనాన్నీ యేర్పాటుచేసుకొనే

ఆశతో వున్నామనీ, యీ సంవత్సరం తమ రంగుల ఫ్యాక్టరీవల్ల వచ్చే లాభంలోనుంచి వీటికి ఖర్చుచేసే ఉద్దేశంతో వున్నామనీ క్షేత్రాధ్యక్షుడు మాకు చెప్పేడు.

## యువక కమ్యూనిస్టులు

వ్యవసాయంపని యెక్కువగా వున్నప్పుడు, వంట కొయ్యడానికి పైనుండి కూలీలను తెచ్చుకుంటారు. ఈ సంవత్సరం పని సాయానికి పక్క ప్రాంతంనుండి యువక కమ్యూనిస్టుల్ని ఆహ్వానించేరు. పైనుండి తెచ్చుకొనే యిటువంటి కార్మికులకు - వాళ్ళు వృత్తిగా పనిచేసేవాళ్ళయినా ఐచ్ఛికంగా పనిచేసేవాళ్ళయినా సమిష్టిక్షేత్రం సభ్యులకు యిచ్చినట్టే, సరియైన కూలీ యివ్వాలి. ఇటువంటిపని చెయ్యడానికి యువకకమ్యూనిస్టులు వెళ్ళినప్పుడు తమ బసల్లోనే నివసిస్తూ, తమ కూలీలో ఒకభాగంగావచ్చిన కాయకూరలు వండుకొని తింటూ పనిచేస్తారు. లేక అక్కడ రైతుల యిళ్ళలో బసచేస్తే, తమ వసతికీ భోజనానికీ ప్రతిఫలంగా తమ కాయగూరలూ పళ్లూ గృహిణులకు యిచ్చివేస్తారు. ధనరూపంతో వచ్చిన తమ కూలీని తమ పార్టీనిధికి యిస్తారు.

## యంత్రాలతో వ్యవసాయం

ట్రాక్టర్లతో వ్యవసాయం చేసేపద్ధతిని సోవియట్ ప్రభుత్వం ప్రోత్సహిస్తుంది. ట్రాక్టర్లు వ్యవసాయంచేయడంవల్ల కలిగే గొప్ప లాభం, యంత్రసామగ్రివల్ల వ్యవసాయకార్యాలకుగల ఉపయోగమూ, సమిష్టి క్షేత్ర సభ్యుల మనసుకు నాటేటట్టు చెయ్యడానికి, అన్నిరకాల ప్రచారమూ, ప్రదర్శనాలూ ఉపన్యాసాలూ, వ్యవసాయనిపుణుల రాకలూ ప్రభుత్వం యేర్పాటుచేస్తుంది. సమిష్టివ్యవసాయక్షేత్రానికి డబ్బులేక ట్రాక్టర్లూ పంటలు కోసే యంత్రాలూ పెట్టుకోలేకపోతే, దగ్గిరలోవున్న యం. టి. యస్. (Motor Tractor Station) ధనసహాయానికి అర్జీపెట్టడంతోనే, ప్రభుత్వం డబ్బు బదులిస్తుంది. నూటికి ఒకటి నుండి రెండు రూబుళ్ళ వడ్డితో దీర్ఘకాలంగడువులో యీ డబ్బు తిరిగి చెల్లించాలి. సమిష్టిక్షేత్రాదాయంలోనుంచి, యీ అప్పులో కొంతభాగమూ ప్రభుత్వాని కివ్వవలసిన పన్నులూ మొట్టమొదట చెల్లించాలి. ఆదాయంలో యెక్కువ భాగంపంట అమ్మకంవల్ల వచ్చేది కాబట్టి, పంటల నష్టానికి హామీగా సమిష్టిక్షేత్రం



సోవియట్ కర్షకులకు యంత్రాలు సేవకులు

తనపంటల్ని భీమాచేస్తుంది. ఈవిధంగా ప్రభుత్వరుణం రూఢీగా చెల్లుబడి అయిపోతుంది. ఈ సమిష్టి వ్యవసాయక్షేత్రం విషయంలో, ప్రభుత్వ రుణానికి రంగుల ఫ్యాక్టరీ హామీగాబట్టి, అగ్నిప్రమాదం మొదలైన వాటి వల్ల నష్టంరాకండా అదిగూడా భీమా చెయ్యబడింది.

ట్రాక్టర్లకు సకాలంలో మరామత్తులూ మొదలైనవిచేసి ప్రశ స్తంగా వుంచాలి. యం టి యస్. దీనివిషయమై అన్నివిధాలా సాంకేతికసహాయం చేస్తుంది. ట్రాక్టర్లనూ పంటల్నికోసే యంత్రాల్ని నడపడాన్ని, వాటిని ప్రశ స్తమైనస్థితిలోవుంచే నైపుణ్యాన్నీ, కార్మికయువకులను తర్ఫీదుచేసి యం. టి. యస్. కలిగిస్తుంది.

పంటను కుప్పలువేసేక, సమిష్టిక్షేత్ర సభ్యులు పంచుకున్నారు. ట్రాక్టరునిమిత్తం బదులుపుచ్చుకున్నదానిమీద వడ్డీ, వాయిదాసొమ్మూ, మరుసటి సంవత్సరం వి త్తనాలఖరీదూ, సభ్యులకు చెల్లించిన అనారోగ్య భీమా మొత్తమూ, క్షేత్రపు ఆస్థిమీద చెల్లించవలసినపన్నులూ భీమాధనమూ., సౌకర్యాలకోసం చేసిన కర్చులూ, చిల్లరకర్చులూ, వ్యవసాయక్షేత్రం రంగుల ఫ్యాక్టరీవల్ల వచ్చిన లాభాలనుండి చెల్లించబడ్డాయి సమిష్టిక్షేత్రా నికి సోవియట్ ప్రభుత్వ బ్యాంకుతో కాతావుంది.

ధాన్యంపంపకమూ బంగాళాదుంపల పంపకమూ సంవత్సరానికి నాలుగుసార్లు జరుగుతుంది; మూడుసార్లు అడ్వాన్సులుగాను, నాలుగోసారి లెక్కల పూర్తిపరిష్కారానికీ జరుగుతుంది. తనకువచ్చిన పంటభాగాన్ని మార్కెట్టులో అమ్మడానికి ఉద్దేశించే సభ్యుడు, దగ్గరలోవున్న సంతకు గాని పట్టణానికిగాని తన పంటను తీసుకపోవడానికి సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి చెందిన గుర్రపు బళ్ళనూ లారీల్నీ అద్దెకు తీసుకోవచ్చు. ఇందు కోసం తనకున్న ఐదులారీల్ని యీ వ్యవసాయక్షేత్రం తన సభ్యులకు అద్దెలకిస్తుంది.

తను పండించే పంటలరకాలనుబట్టి సమిష్టిక్షేత్రం ప్రభుత్వానికి పన్నులు చెల్లిస్తుంది. ధాన్యంపంట అయితే పంటవిలువలో పన్ను నూటికి రెండు నుండి మూడువరకూ వుంటుంది: నూటికి యేడు నుండి యెనిమిది వరకూ బంగాళాదుంపల పంటకుంటుంది. కొన్ని పరిస్థితుల్లో సమిష్టి క్షేత్రం నుండి ప్రభుత్వంకూడా పంటలో కొంతభాగాన్ని కొంటుంది. గతసంవత్సరం పండిన బంగాళాదుంపలకు టన్ను వొక్కింటికి ఏభై రూబుళ్లు చొప్పునా, వసంతకాలంలో పండిన బంగాళాదుంపలకు

నూటయాభై రూబుళ్లు చొప్పున ప్రభుత్వం చెల్లించింది. మార్కెట్టు ధరలకన్నా ప్రభుత్వం కొంచం తక్కువగా చెల్లిస్తుంది. ఇది సమిష్టి క్షేత్రాలకు గిట్టదు. కాని వసంతకాలంలో పండిన దుంపలధరవిషయమై తక్కువయేమీ జరగలేదని యీ సమిష్టిక్షేత్రం వ్యవహర్త మాతోఅన్నాడు.

## స్టాలిన్‌కి కృతజ్ఞులం

ఈసందర్భంలో సమిష్టిక్షేత్ర వ్యవహర్తకీ మాతోబాటు చూడడానికి వచ్చిన యిద్దరు రష్యన్లు అమెరికన్లకీ వాదన ప్రారంభమైంది. సమిష్టిక్షేత్రంలో యొకటితరువాత ఒకటిగా వేస్తూన్న పంటలపద్ధతి తప్పనీ అశాస్త్రీయమనీ అమెరికన్లు అన్నారు దీనిమీద క్షేత్రంవారు వారి వ్యవసాయ నిపుణుణ్ణి పిల్చేరు; చర్చంతా రష్యన్ భాషలో సాగింది. దుబాసి అనువదించి మాకు చెపుతున్నాడు. వాదోపవాదాల ధోరణిచూస్తే చర్చ తెగదేమోనని మాకు భయంపుట్టింది. మాతోబాటు వచ్చిన వాచాలుడైన ఇటాలియన్ సోషలిస్టు. వున్నచిక్కుకి తోడు యింకా రెండుముడులు పెట్టడానికాలన్నట్టు, అమెరికన్లు యెలాగా చర్చప్రారంభించేరుగాబట్టి వాళ్ల క్షేత్రనిర్వహణగురించి కొన్ని ముఖ్యమైన ప్రశ్నలువేసి, అది లాభకరంగా పనిచేస్తుందోలేదో అన్నవిషయంమీద తమ అభిప్రాయం చెప్పవలసిందని కోరేడు. వ్యవహర్త, వ్యవసాయనిపుణుడూ, అకౌంటెంటూ, అంగీకరించేరు. అకౌంటెంటు తనంతటతాను గతసంవత్సరపు జమాకర్చుల పత్రాన్ని మాముందుంచేడు. మా అనధికారసంఘం పరీక్షసాగించింది!

పదినిమిషాలలోగా మా "అనధికారసంఘం" లెక్కలనుచూచి సమిష్టిక్షేత్రం చాలా లాభకరంగా నడుస్తూందని తన అభిప్రాయాన్ని వెలిబుచ్చింది. అందరమూ పెద్ద నిట్టూర్పు విడిచేం!

క్షేత్రవ్యవహర్త సంతోషించేడు. మాకు యీవిధంగా చెప్పేడు: "మేం మా సమిష్టిక్షేత్రాన్ని చాలా లాభకరంగా నడుపుతున్నాం. ఒక సంవత్సరం తరవాత యింకొక సంవత్సరం ప్రతి సభ్యుడూ యెక్కువగా ఆర్జిస్తున్నాడు. పైగా మా యువకులు తమ పనులలో యెక్కువ నైపుణ్యాన్ని సంపాదించి సమర్థులైన సాంకేతిక నిపుణులుగా తయారవుతున్నారు. ట్రాక్టర్లూ, లారీలూ, పరికరాలూ, పశువులూ, ఆబోతులూ వృద్ధి అవుతున్నాయి. వీటితో మా పెట్టుబడీ అధికంఅవుతూంది. మా రంగుల ఫ్యాక్టరీ నానాటికీ యెక్కువ లాభాల్ని పంచుతూంది. మొత్తంమీద

మాదంతా సౌఖ్యంగా జీవిస్తున్న ఒక కుటుంబం. ఇందుకు మా కామ్రేడ్ స్టాలిన్‌కి కృజ్ఞులం!"

## ఆదర్శమైన వ్యవసాయపద్ధతి

వ్యవసాయనిపుణుడు తన వాదం నిలుపుకోగలిగేడు. అకౌంటెంటు సంతృప్తిచెందేడు. ఎంచేతనంటే, సమిష్టి వ్యవసాయక్షేత్రాలు జయప్రదంగా సాగడంగురించి మేము స్వతంత్రమైన అభిప్రాయాన్ని యేర్పరుచుకోగలిగేం కాబట్టి. అందరమూ వాదోపవాదాలు జరిగినందుకు ఆనందించేం. ట్రాక్టర్ల సహాయంతో శాస్త్రీయపద్ధతిలో వ్యవసాయం చెయ్యాలనిచేసే విద్యావిషయకమైన ప్రచారంతోబాటు, నిరక్షరాస్యతను రూపుమాపడానికి చేసిన తీవ్రప్రయత్నం సమిష్టిక్షేత్రాలు జయప్రదం కావడానికి కారణం. సమిష్టి క్షేత్రాలు జయప్రదం కావడానికి, వీటన్నిటికన్నా కారణం - పరిశ్రమలూ పంచవర్ష ప్రణాళికలు మొదలైనవాటన్నిటిలాగే. ప్రభుత్వం వ్యవసాయంగురించికూడా ఒక ప్రణాళిక నేర్పరుస్తుంది. పండించవలసిన పంటలరకాలు, ఏపంటతరువాత యేపంట వెయ్యాలిఅన్న విషయమూ, ఎన్నియెకరాల్లో వెయ్యాలిఅన్న విషయమూ, ఎరువుల సరఫరా గురించీ, ప్రభుత్వం ఒకవిధానాన్ని యేర్పరుస్తుంది. దేశం మొత్తం మీద ప్రవేశపెట్టవలసినవిధానం నిశ్చయింపబడుతుంది. ప్రతి సమిష్టి క్షేత్రంలో ప్రవేశపెట్టవలసిన విధాన దేశీయమైనవిధానానికి అనుగుణ్యంగా వుండాలి. డిస్ట్రిక్టు సోవియట్ అంగీకరిస్తే, స్థానికపరిస్థితులకు సరిపోయేటట్లు ప్రత్యేకమైన మార్పులు అంగీకరించబడతాయి. సమిష్టిక్షేత్రం పని చెయ్యవలసిన విధానం గురించి డిస్ట్రిక్టు సోవియట్ వివరంగా ఆలోచిస్తుంది. ఆతరవాత ఆవిధానాన్ని క్షేత్రంవారు తమ సభ్యుల సమావేశంలో కార్యక్రమమూ వివరాలూ చర్చింపబడతాయి; సభ్యులేవన్నా సూచిస్తే మార్పులతో అంగీకరింపబడతాయి. ఆఖరుకు యివి డిస్ట్రిక్టు సోవియట్ ప్లానింగ్‌కమిటీకి పంపబడతాయి. అక్కడ అంగీకారంపొందేక ఆచరణలోనికి వస్తుంది. తరవాత జరిగిన పని అంతటికీ మానేజింగ్‌కమిటీ పూర్తి బాధ్యత తీసుకుంటుంది; తన సభ్యులకూ డిస్ట్రిక్టు సోవియట్‌కూ అదే జబాబుదారీగా వుంటుంది.

ఈ సమిష్టి వ్యవసాయక్షేత్రాలతోబాటు ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలు కూడా వున్నాయి. అతివిశాలంగావున్న ప్రభుత్వ క్షేత్రాల్లో, శాస్త్రీయ పద్ధ

తులతోనూ పూర్తిగా యంత్రసహాయంతోనూ సాగుచేస్తారు. మొత్తంమీద ప్రభుత్వ వ్యవసాయక్షేత్రం ఒక ఫ్యాక్టరీలాగ నడుస్తుంది. ఫ్యాక్టరీలో జరిగి నట్టుగానే యిక్కడ పనిచేసేవాళ్ళకు కూలీ యితరసౌకర్యాలుయిస్తారు.

వీటితోబాటు వ్యక్తిగతంగా సాగుచేసుకొనే రైతులుకూడా వుంటారు. వ్యక్తిగతంగా జరుగుతూన్న యీ వ్యవసాయంపట్ల ప్రభుత్వం సహనంచూపుతున్నప్పటికీ, బాగా యెక్కువపన్నులువేసి యీ పద్ధతిని నిరుత్సాహపరుస్తుంది. ఈవిధంగా నానాటికీ యీ ఒంటరితనపు రైతులు అదృశ్యమైపోతున్నారు.

## పల్లెటూరి ఇల్లు

పట్టణానికి తిరిగివెళ్ళిపోవడానికి బస్సు ఎక్కబోతుండగా, సోవియట్ పల్లెలలోని యిళ్ళు యెలాగవుంటాయో చూసిపోదామని మాస్నేహితుఁవొకడు అన్నాడు. గ్రామసోవియట్ అధ్యక్షుడు అంగీకరించేడు. అనాలోచితంగా మేము ఏదోవక యింటిని ఎంచి ఆయింట్లో ప్రవేసించేం.

ఇల్లు చాలా పరిశుభ్రంగావుంది. పెరడు కోడిపిల్లలతో నిండిపోయింది. అవి యింట్లోకీ బయటికీ పరుగెత్తుతున్నాయి. వసారాలో, రష్యను పొయ్యివుంది. నేలను మట్టితో అలికి మంచి పరిశుభ్రంగా వుంచబడింది. ఆయింట్లో ఒక ముసలమ్మ, ఆమెకొడుకులిద్దరూ వున్నారు. తనకు అరవయ్యోఏడి దాటిందనీ, తానుపొలంపని చెయ్యడంలేదనీ, కాని తనకు గ్రామసోవియట్ వృద్ధాప్యవేతనం ఇస్తూందనీ ఆమెచెప్పింది. సమిష్టి క్షేత్రం సభ్యులుగా తనకొడుకు లిద్దరూ వ్యవసాయం చేస్తున్నారని ఆమె చెప్పింది. ముసలివాళ్ళందరిలాగే యీమెకూడా వాచాలత్వం ఎక్కువ యీమె తనజీవితమంతా యీ గ్రామంలోనే గడిపింది. తన జీవితంలో చూసిన బ్రహ్మాండమైన మార్పులుగురించీ, రైతులకోసం సృష్టి అయిన నూతన ప్రపంచంగురించీ మాతో చెప్పడం మొదలుపెట్టింది. తన యింట్లోని ఎలెక్ట్రిక్ దీపాలూ, తనప్పుడువాడుతూన్న ఎలెక్ట్రిక్ యిస్త్రీపెట్టెనీ మాకు సగర్వంగా చూపించింది. ఇంట్లో నిరాడంబరమైన సామాన్లున్నాయి. మనదేశంలోలాగనే గోడలు కాళీగావున్నాయి. గదిలో ఒక మూలనున్న టేబులుమీద రేడియోవుంది. గదిలోవున్న అలంకారాలు క్రీస్తు, లెనిన్, స్టాలిన్ విగ్రహాలు మాత్రమే।



భూమిదున్నే యంత్రాన్ని
నడుపుతున్న సోవియట్ రైతు

## చక్కిలిగింతలో రక్కులు

మాస్కో పట్టణానికి మాతిరుగుప్రయాణంలో, టైరుపాడవడంవల్ల మాబస్సు ఆగిపోయింది. ఈపట్టణం మొదలయ్యేసరికి అస్ఫాల్టురోడ్డు అఖరయ్యింది. అప్పుడే వేస్తుండడంవల్ల రోడ్డు గతుకలుగావుంది. డ్రైవరు వెంటనే మరామత్తు ప్రారంభించేడు. బస్సు మరామత్తు సాగడంకోసం మేము దిగిపోయేం.

ఆవేళ మధ్యాహ్నం రెండుగంటలకు నాస్తాచేసినవెంటనే మాస్కో నుండి యీ క్షేత్రం చూడడానికి బయలుదేరేం. సాయంత్రం తొమ్మిదయి నట్టు అప్పుడుంది. చాలా పొలాలు, ధాన్యంకొట్లూ, పశువులశాలలూ, కోళ్ళదొడ్లూ, ఆఫీసులూ చూస్తూ ఆమధ్యాహ్నమూ సాయంత్రమంతా నడుస్తూనేవున్నాం.

అందరిమూ అలసివున్నాం. టైరుయిబ్బంది మాలో కొందరికి చికాకుకలిగించింది. ఈ వ్యవధిలో చాలామట్టుకు హాస్యప్రసంగంసాగింది. అన్యథా తలపెట్టకపోయినా, యీ చక్కిలిగింతల్లో రక్కులుకూడాపడ్డాయి. కొత్త టైర్లు అంతవేగంగా పాడవడం వింతగావుందంటూ సోవియట్ దేశపు టైర్ల స్వభావం అంతేగాబోలని ఒకతను అన్నాడు. బహుశా మాస్కోలోవున్న రబ్బరు ఫ్యాక్టరీలలో యీ టైర్లు తయారై వుండొచ్చును; ఐదేళ్ళ కార్యక్రమంలో యేదో దోషంవుండాలి. అయినా యిటువంటి చిన్న సంఘటనల వల్లేలోపలి బండారం బైటబడుతుందని యింకొకతను కలిపేడు. అనుభవంసంపాదించడానికి వేసిన యిటువంటి రోడ్లతోను అనుభవంసంపాదించడానికి వేసిన యిటువంటి టైర్లతోనూ యింతకంటె బాగా యెలాగ జరుగుతుందనీ, తెల్లవారకముసుపుగనుగ మనంకూడ హోటళ్ళకు చేరుకోగలిగితే ధన్యులమనీ అంటూ, మాతోనున్న అమెరికన్లు వెంటనే అమెరికారోడ్ల అందచందాల్ని వర్ణించడం మొదలెట్టారు. "ఫోర్డుకారు, సోవియట్ప్రభుత్వం ఒక్కలాగున్నాయి. చెట్టుపేరుచెప్పి కాయలమ్ముతున్నారు." అని ఒక తెలివైన యువతి చర్చను యింకా సాగదీసింది. అందరం పకపకానవ్వేం. "సోవియట్ దేశంలోని వస్తువులు అన్నీ అమెరికాలో తయారవుతున్నాయి. కాని వాటిని నడపడం తెలియక రష్యన్లే పాడుచేసుకుంటున్నారు." అని పీటన్నిటినీ తలదన్నిన వ్యాఖ్యానం యింకోతను చేసేడు. మాయిద్దరికీ యీ ధోరణి నచ్చక; అదేమిటలా

అంటారు ? "కృప్స్ కంపెనీ తయారుచేసిన కొత్తమార్సెడ్‌కారులో మేము కిందటిమాసమే పోతూంటే మాగ్డెబర్గ్‌నుండి బెర్లిన్‌కు పోయేతోవలో పైర్లు పేలిపోవడంవల్ల కారు మూడుసార్లాగిపోయిందీ. పైర్లు పేలడం రష్యాలోజరిగినా అమెరికాలోజరిగినా రోమన్‌రహదారిలో జరిగినా వింతేమీ లేదనీ మేం అన్నాం. పైరు మరామత్తు అయిపోయింది. యికబస్సులో కూర్చోవచ్చునని అదృష్టవశాత్తు మేం అన్న వెంటనే దుబాసిచెప్పేడు.

బస్సు బయలుదేరగానే జరిగిన అసందర్భం అంతా మర్చిపోవడమే కాకండా చికాకుపడి అకారణంగా సోవియటును గురించి వేళాకోళం చేశామే అని హృదయపూర్వకంగా నొచ్చుకొని, మళ్ళా కులాసాగా సంభాషణ సాగించేం. సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లో జయప్రదంగా జరుగుతూన్న కార్యనిర్వహణాన్ని బాగా చూడగలిగేమనీ, యిటువంటి సంస్కరణలకు స్వార్థపరులు యితరదేశాల్లో ఆటంకాలు కలిగిస్తుండడం చాలా విచారించవలసిన విషయమనీ, మాస్కో ప్రాంతాల్లోపున్న దేవదారు అడవులూ, ఆకుపచ్చని కొండలూ దాటి, సోవియట్ గ్రామాల్లో అత్యద్భుతమైన సంచారం చేసేమనీ మేమందరమూ నిర్ణయించుకున్నాం.

బస్సు నడుస్తూవుంది. మాస్కోనగరపు పాతవంతెనలు ఒక వింత సొగసునూ పాతకాలపు అలంకారాన్నీ పట్టణానికిచ్చేయి. వంతెన ఎత్తయిన ఆర్తీలక్రిందనుంచి కారునల్లని నదీజలాలు వడి వడిగా ప్రవహిస్తున్న దృశ్యం, కార్యనిమగ్నంగా యెడతెరపిలేకండా గట్లమీద జరుగుతూన్న రాకపోకల దృశ్యమూ - గతకాలపు చారిత్రక సాంప్రదాయానికీ కొత్తయుగపు మహోజ్వల ప్రభాతానికీ యీ రెండు దృశ్యాలు చుట్టరికం కలిపేయి. వసంతకాలపు సాయంసంధ్యలో దీర్ఘచ్ఛాయలను పరచుకొంటూ మా "అన్వేషణ"ను కొనసాగించేం. మోస్కావొట్సెకి, క్రింస్కీ, బొరొవిన్‌స్కీ. దూరంగా చీకలోవున్న మాస్కోనగరపు మిణుకు మిణుకు దీపాలూ, క్రెమ్లిన్‌భవనాల సన్నని శిఖరాలను బ్రహ్మాండమంత హస్తంతో పెనవేసుకొనివున్నట్టున్న దూరంలోని కొండలూ - కన్నులకు పండువగా, మర్చిపోదామన్నా మరుపురాని దృశ్యం అది !

## సోవియట్ పత్రికలు

పట్టణానికి తిరిగివచ్చి, వూళ్లో తిరిగే బస్సులో మా హొటేలుకు వెళ్తుండగా, చాలా వీధుల్లో పెద్దబారులుగా నిలబడ్డ ప్రజల గుంపులు మాకు

కనిపించేయి. అవేమిటని మాతోడి ప్రయాణీకుణ్ని ఒకణ్ణి అడిగేం. అతను బయటికిచూసి, అసాధారణమైనది తనకేమీ కనిపించలేదని చెప్పేడు. రోడ్లపక్కగా బారులుతీర్చివున్నవాళ్ళని చూపించేం. చిరునవ్వి, ఓహో! యీజనం ఏమిటి అనా మీరు అడుగుతున్నారు? పత్రికల ఆఖరు ప్రతుల కోసం మాస్కో పౌరులు కాచుకొనివున్నారని" అతను చెప్పేడు॥

మర్నాటిఉదయం మేము "అండరుగ్రౌండు" (సొరంగంగుండాపోయే) రైలులో ప్రయాణం చేస్తూంటే స్త్రీ పురుషులు ప్రతిఒక్కరూ తనఅభిమాన పత్రికను లీనమైపోయి చదువుతూ మాకు కనిపించేరు.

అక్కడ చాలా పత్రికలున్నాయి. స్టాలిన్ 1912 లో స్థాపించిన "ప్రవదా" పత్రిక అన్నిటికన్నా జనరంజకమైన పత్రిక. ఈ మాస్కో పత్రికల ప్రచారం యెంత వుంటుందని మా దర్శకుణ్ని అడిగేం. కమ్యూనిస్టు పత్రిక ప్రవదాకు అన్నిటికన్నా యెక్కువగా యిరవైలక్షల ప్రతులకు పైగా ప్రచారం వుందని చెప్పేడు ప్రభుత్వ పత్రిక "ఇజ్వెస్టియా" పదిహేనులక్షల ప్రతులకుపైగా చెల్లుతుందట. యువక కమ్యూనిస్టు పార్టీపత్రిక "కామ్సొమాల్స్కయాప్రవదా," పిల్లలపత్రిక "పాయ్‌నీర్ స్వయాప్రవదా" పత్రికలు ఒకొక్కటీ రమారమి ఏడెనిమిది లక్షల ప్రతులు చెల్లుతాయి. ఇవికాక కార్మికసంఘం పత్రిక 'ట్రూడ్' ఎర్రనౌక మాస్కో సోవియట్ పత్రిక 'రాబొచయా మాస్కవ' పత్రిక సుమారు పదిలక్షల ప్రతులవరకూ ప్రచారంవుంది. కాగితం పరిశ్రమలు అవసరమైనంత కాగితాన్ని సరఫరా చెయ్యగలిగిన శక్తికిరాగానే, పాఠకుల అవసరాలకు సరిపోయేటట్టు ప్రవదా పత్రిక యింకో యిరవైలక్షల ప్రతులు అధికంగా వెయ్యదలచుకుందని అందరూ అన్నారు.

సోవియట్ వార్తా పత్రికలలో అడ్వర్‌టైజ్‌మెంట్లు వుండవు. వ్యక్తుల ఆస్థిగావున్న స్వంతపరిశ్రమలు లేకపోవడంవల్లా, ఒక ఫ్యాక్టరీకి యింకో ఫ్యాక్టరీతోనూ ఒక వ్యాపారానికి యింకో వ్యాపారంతోనూ పోటీ లేకపోవడంచేతా, అడ్వర్‌టైజ్‌మెంటు చెయ్యవలసిన అగత్యంలేదు. వార్తా పత్రికలతోబాటు గోడలూ మొదలైనవి ఎడ్వర్‌టైజ్‌మెంట్లు లేక కాళీగా వుంటాయి. విడాకులు పుచ్చుకొనేటప్పుడు పోలీసుకోర్టుల్లోనూ వెల్లడయ్యే కామోద్రేకాన్ని కలిగించే వార్తలూ, అలజడిని కలిగించే ఖూనీలవార్తలూ ఆత్మహత్యల వార్తలూ, ఊకదంపుకబుర్లూ, మచ్చుకైనా సోవియట్ పత్రికలో కనిపించవు. సోవియట్ పత్రికలకు ఎడ్వర్‌టైజ్‌మెంట్లు లేక

పోవడంతోబాటు యిది యింకొక ప్రత్యేకత. ఇవి లేకపోవడంవల్ల సోవియట్ పత్రికలకు కలిగిన లోపమేమీలేదు. వార్తల్నీ, అభిప్రాయాల్నీ, విమర్శల్నీ, ఉత్పత్తిసంస్థల గురించి, పరిశ్రమలలోనూ, వ్యవసాయంలోనూ కొందరు చూపిన అసాధారణ సామర్థ్యాన్నీ, స్టఖానొవైట్లు చూపిన ప్రజ్ఞనూ సోవియట్ పత్రికలు ప్రకటిస్తాయి: కొత్తగ్రంథాలగురించీ, శాస్త్రపరిశోధనలగురించీ, కళలను గురించీ-తమాషా కబుర్లుకాకుండా, వైజ్ఞానికములైన రచనలుంటాయి. ఫ్యాక్టరీలలోగాని, సంస్థల్లోగాని వుత్పత్తివిధానంలో జరిగిన తప్పులను విమర్శించి వాటిని సరిదిద్దుకోవడానికి సలహాలిచ్చే వ్యాసాలు-పత్రికా ప్రతినిధులవల్లనైతేనేం, సామాన్యపు జనం వ్రాసినవైతేనేం - వుంటాయి. సామ్యవాద ఆదర్శానికి సేవచెయ్యడమే సోవియట్ పత్రికల ఆశయం.

## పానకంలో పుడకలు

నాస్తా అయ్యేక ఒకనాటి ఉదయం వూళ్లోకి తిరగడానికి వెళ్ళేముందు మా దగ్గరున్న విదేశనాణేలను రూబుళ్ళలోకి మార్చుకోవడానికని, మా హొటేలు కార్యాలయంలోకి వెళ్లేం. చేతిలో నోట్లు పట్టుకొని, మా ప్యాస్‌పోర్టుల నిమిత్తం కావలసిన మరికొన్ని ఫొటోగ్రాఫుల విషయమై భోగట్టా చేయడానికి మానేజరు కార్యాలయానికి వెళ్లేం. మానేజరు మమ్మల్ని పలకరించేక, ఏం పనిమీద వచ్చారని ఆమె సంభాషణ ప్రారంభించింది. ఆవిడ ముప్పయిసంవత్సరాల ప్రాయంయువతి. వెయ్యిగదులుగల హొటలు వ్యాపారాన్ని నడుపుతుండడంచూస్తే, ఆవిడ ఎంతో సమర్థతగల మనిషయి వుండాలి. మా పని విన్న తరవాత డ్జర్‌జిన్‌స్కి డిస్ట్రిక్టు మంత్రివర్గం స్థానికశాఖతో టెలిఫోన్‌లో మాటాడి మాకు యిబ్బందేమీలేకండా యేర్పాటు చేసింది.

మేం వెళ్ళబోతుండగా మాచేతుల్లోవున్న డబ్బువేపు చూపుతూ, డబ్బు,విలువైన వస్తువులు - ముఖ్యంగా వాచీలు మీరు చాలా జాగ్రత్తగా వుంచుకోవాలిసుమండీ అని హెచ్చరించింది. ఆహెచ్చరికవిని అర్థం వూహించుకొంటూ ఓహో అని ఒకరిమొఖం వొకరు చూసుకున్నాం. మా చూపులు గ్రహించుకొని ఆమె అంది: "నా హెచ్చరికకు మీరు వింత పడడంలేదని నాకు తెలుసు, కాని సోవియట్ దేశ ఉద్యోగినైననేను, చిన్న చిన్న చోరులూ జేబుదొంగలూ లేకపోలేదని ఒప్పుకోవడంచూసి మీరు

వింతపడుతున్నారు. అవును. కొందరున్నమాట నిజమే. మేం యింకా ప్రపంచాన్ని స్వర్గంగా మార్చివెయ్యలేదు! కాబట్టి జాగ్రత్తగా వుండడం మంచిది. ఏమైనా జరిగినట్టయితే, మాదేశానికి విదేశాలనుండి వచ్చిన వాళ్ళు తిరిగి యిళ్ళకు పోగానే, సోవియట్ దేశం దొంగలదేశం ఖూనీకోర్ల దేశం అని ప్రపంచమంతా అనుకునేటట్టు గందరగోళం లేవదీస్తారు. ఇప్పటికీ ప్రపంచం మమ్మల్ని రక్తపిపాసులుగా చాలవరకూ చిత్రించింది! ఈవిషయంలోని యథార్థం యేమిటంటే, వాచీలు మొదలైన వస్తువులు చాలా అరుదుగా వుండడంవల్ల, ఒక్కటైనా వుంచుకుందామని ప్రతి ఒక్కరికీ చాలా ఉబలాటంగావుంది. కార్మికజీవితంలోని క్రమశిక్షణను సరిగా అలవర్చుకోని దుర్మార్గులు కొందరున్నారు. కాబట్టి, మా మంచి కోసం మీ మంచికోసం దయచేసి జాగ్రత్తగా వుండండి."

## నాగరకతలో తేడాలు

ఆమె హెచ్చరికకు అవసరం పట్టలేదు. ఒక కోపెక్కయినా యెప్పుడూ మేం పోగొట్టుకోలేదు. అంచేత జేబుదొంగలులేనేలేరనడానికి వీల్లేదు; సోవియట్ ప్రజలందరూ మహాపురుషులేఅని అనడానికీ వీల్లేదు. మాస్కోలో మేం వున్నప్పుడు అన్నివేళల్లోనూ, పాతపట్టణం సందు గొందుల్లో స్కాటెర్ట్నీ (మేజాబట్టలసందు), అర్బట్, ఖ్లెబ్నీ (రొట్టెల సందు) మొదలైనవాట్లో తిరిగేం; చాలా రాత్రయ్యేకకూడా తిరిగేవాళ్ళం. అయినా తాగుబోతులుగాని దొంగలుగాని రౌడీలుగాని పడుపువృత్తివాళ్లు గాని మాకు తారసిల్లలేదు. యాచకుల్లాగ కనిపించే కొద్దిమంది వృద్ధుల్ని చూసేం. కాని వాళ్లు మమ్మల్ని యాచించలేదు; మేం చూసినంతవరకూ యింకెవర్నీ యాచించలేదు.

లండన్, ప్యారిస్, బెర్లిన్, కలకత్తాలలోనా - అమ్మో! రాత్రి పూట ఇలా నిర్భయంగా తిరగడమే?

## సోషలిస్టు వీరులు

ఈవేళ బస్సులో వెళుతూండగా ఒక యువకుని పరిచయంఅయింది.

ముప్ఫైయేళ్ళతను జర్మను భాషచక్కగా మాట్లాడేడు. వాల్గా నదిమీదవున్న మార్క్స్ పట్నంట అతనిది. ఆజిల్లాలోవున్న ఒకట్రాక్టరు స్టేషనులో మెకానిక్కుట అతను. ఐదువందలరూబుళ్లట అతనికిజీతం.

ఇంకా తర్ఫీదుపొందదానికని వేతనంఇచ్చి తన ట్రేడ్‌యూనియన్‌వారు అతన్ని మాస్కోలో మోటారు ఫ్యాక్టరీకి పంపించారు. రెండు మూడు సార్లు కలుసుకున్నాం. అన్నివిషయాలు చక్కగాను ఉత్సాహంగాను మాట్లాడేడు.

ఒకమాటు అతనితో స్టఖానోవైట్లు ప్రసంగం వచ్చింది. అతని అనుభవంలోవున్న ఉదాహరణలు నిన్నమొన్న జరిగినవి చెప్పేడు. ఒక కంబైన్ మామూలుగా ఒకరోజుకి 20 ఎకరాలుభూమిలో పంటనుకోసి కట్టలుకట్టుతుందట. అటువంటిది ఒక కంబైన్ డ్రైవరు ఇరవైరోజుల్లో 1200 ఎకరాల పూర్తిచేసి, యీ ఇరవైరోజుల్లోనూ రెండువేలరూబుళ్ల జీతం సంపాదించాడుట. మరొక డ్రైవరు వక్కరోజులో నూరు ఎకరాల గోధుమపంటకోసి ఆరోజుకూలి మూడువందల రూబుళ్ల నగదు సంపాదించాడుట. మరోక్షేత్రంలో పదిహేనురోజులక్రిందట, వకలారీ డ్రైవరు పదిరోజుల్లో పన్నెండువందలమైళ్ళు నడిపి ఇరవైగేలన్ల పెట్రోలు లాభం కనబర్చి, నాల్గువందల రూబుళ్ల యీ పదిరోజుల్లోనూ సంపాదించాడుట. "ఇలాంటివారు అన్ని పరిశ్రమలలోనూ వున్నారుసుమండీ, వీళ్లు శాండోలు కారు. వీరు చేసేది ఇంద్రజాలం, మహేంద్రజాలంకాదు. తమ పనిని జాగ్రత్తతోనూ, శాస్త్రజ్ఞానంతోనూ, నిపుణతతోనూ చేసే సోషలిస్టువీరులు-వీళ్లు" అన్నాడు.

## ఒంటిమనిషి భాగోతంకాదు

ఒకనాడు రాజ్యాంగంగురించి ప్రసక్తివచ్చి, హిట్లరు, ముసోలినీల గురించి మీ అభిప్రాయం ఏమిటి అన్నాం. అందుకు అతని జబాబు: "నిన్న రౌడీలు - ఈరోజు మహారాజులు - రేపు బ్రహ్మరాక్షసులు! వీళ్లు బతికి వుండేంతకాలం వీళ్ళహయాంకు అడ్డుండదు. ఆతరవాతా - ఒక పెద్ద బండిసున్న!"

"మీదేశంలో స్టాలిన్ తరవాత?"

"మా స్టాలిన్ మాత్రం మార్కండేయుడా ఏమిటి? లెనిన్ తరువాత లెనిన్ అంతటివాడు స్టాలిన్? అలాగే స్టాలిన్ తరువాత స్టాలిన్ అంతటివాడు మరోడొస్తాడు. మాది ఒంటిమనిషి భాగోతంకాదు. అయితే ఓ ఏభై ఏళ్ళపాటు మాఖర్మాన్ని మమ్మల్ని వోనిస్తే మాకంతేచాలు" అని అన్నాడు.

మరొకరోజు మా సోవియట్ అనుభవాలు గురించొచ్చింది.

"మేం వక్క మాస్కోతప్ప మరేవూరు మరేప్రాంతం చూడడం లేదు. మాస్కోపరిస్థితులకీ మీప్రాంతంపరిస్థితులకి ఏమైనా తేడావుంటుందా?" అని అడిగేం. అందుకు అతను: "ఈహడాహుడి, ఈ జనసమర్దం, ఈరసగంధం, ఈ ఇరవై అంతస్తుల భవనాలు, ఈ మెట్రో - ఇది మినహా, సోవియట్ అంతట విధానం వక్కటే. మావూళ్లోనూ స్కూళ్లూ, క్రెచీలు, కిండరుగార్టెనులు, ఆస్పత్రుల్లో, ఫ్యాక్టరీలూ, నాటకశాలలు - అన్నీ వున్నాయి, అన్నీ యీ నమూనామీదే నడుస్తున్నాయి" అన్నాడు.

మేం వున్నదే వారంరోజులు. అందులోకీ భాషరాకపోవడం వక పెద్ద ఇబ్బందిగావుంది" అన్నాం. అతను: "మీరు మా వాల్గాప్రాంతం వచ్చివుంటే మీకు భాష ఇబ్బందివుండేదికాదు. అక్కడ జర్మనీ నుండి, స్విట్జర్లెండునుంచి వలసవచ్చిన వారున్నారు. అందరికీ జర్మనుభాషవచ్చును. మాప్రాంతంలో పరిశ్రమ వ్యవసాయం కలిసిమెలిసి సన్నిహితంగా వుంటాయి. అంతా కన్నులపండువగావుంటుంది. ఈమాటు మీరు సోవియట్ దేశం వచ్చేటప్పుడు సరిగ్గా మవూరేవచ్చేయండేం!" అన్నాడు.

సూర్యోదయం. త్వరగా మెళుకువచ్చింది. అందమైన క్రెమ్లిన్ భవనాల గోపురాలను ఉదయకాంతులు కమ్ముకొంటున్నాయి; పచ్చని కొండలు మంచు ముత్యాలతో మెరిసిపోతున్నాయి. ఆ ఉదయాకాశంలో క్రెమ్లిన్ దుర్గం వింతసొగసులు చూపుతూంది.

హోటల్ గదిలో, బల్లమీదవున్న టెలిఫోన్ గంట మోగింది: "హల్లో! ఏడువందలముప్పైఎనిమిదో గదినుండి మాటాడుతున్నాను. కామ్రేడ్ ల—?"

ల :—ఆరువందల తొమ్మిదోగదినుంచి - కామ్రేడ్ ల - మాట్లాతూంటా. కామ్రేడ్ సో—? నువ్వేనా?

సో :—నేనేలే, గుడ్ మార్నింగ్ - టోవారిష్!

ల :—"గుడ్" మార్నింగేమిటి? "రెడ్" మార్నింగను! విశేషాలేమిటి?

సో :—ఏంలేదూ - బాగా నిద్రపోయావా? డీలా ఫెల్డుగారి నల్లులు లేవుకద?

ల :—లేవులే! డిలా ఫెల్డమ్మగారిని అంటుకుని అవి వెళ్ళిపోయేయుండాలి. కాని - యీ షెవర్కీన్స మార్కెట్టు మరికాస్త శుభ్రంగా వుంచుతే బాగుణ్ణుసుమా, యీ మాస్కో సోవియట్ వాళ్లు.

సో :—నువ్వు సలహాయివ్వలేదనే వాళ్లూ చూస్తున్నారు. అయినా - బెంగ పెట్టుకోకు! వచ్చే సంవత్సరంలో రెడ్‌స్క్వేర్ మరి రెండంతలు విశాలంచేస్తారుట - అప్పుడీమార్కెట్టు ఎగిరిపోతుందిలే.

ల :—అవును గాని - యీ లెనిన్ - స్టాలిన్ పూజలు మరీ విగ్రహారాధన లోకి దిగిపోతున్నాయేమోసుమా?

సో :—ఓయి, పిచ్చివాడా! నేను మొదట ఇండియా వచ్చినప్పుడు - ఆసేతు హిమాచలపర్యంతరం - ఏఇంట్లోచూసినా, ఏదుకాణంలో చూసినా, ఏకాఫీక్లబ్బులోచూసినా, ఏకిళ్ళీకొట్టు, ఏసోడాషాపులో చూసినా - గాంధీగారి బొమ్మ, జవహర్లాలు బొమ్మ - అప్పుడు నేనూ ఇలాగే అనుకున్నాను.

ల :—అవునులే, గాంధీగారు గోలపెడుతున్నా - మనం ఆయన్ని మహాత్ముణ్ణి చేశేయలే!

సో :—"స్టాలిన్ - పూజ" అంటే అసలు స్టాలిన్‌కే తలనొప్పిటగా - ఫౌయిక్ట్వాంగరు రాయలే?

ల :—ప్రజకి, ప్రేమవిశ్వాలు ఒకమాటు కుదిరిపోయాయంటే - గాంధీగారు గోలపెట్టినావినరు - స్టాలిన్ మొర్రపెట్టినా వినరు.

సో :—సరేకాని, వాతావారణం చాలా చక్కగావుంది. యింకా పక్క మీంచి లేవవా?

ల :—అవశ్యం! ఉళ్ళోతిరగడాసికెళదాం! స్టాస్కీగడియారం అప్పుడే తొమ్మిదికొట్టింది. కాఫీగదిలో కలుసుకో - ఏమంటావ్?

సో :—తక్షణం!

## హిందూదేశ ప్రస్తావన

యీవేళ కొన్ని వుత్తరాలు టైపుచేయించవలిసివుంది. అందుకు గాను ప్రభుత్వంఅనుమతిమీద ఫారేను ఆఫీసుకివెళ్ళేం. (నార్కొమిండెల్) టైపుచెయ్యవలసిన వుత్తరాలు, ఆ సంబంధమైన కాగితాలన్నీ ఒక అధికారి మొదట తనిఖీచేశాడు - ఆతరువాత వాటిని టైపిస్టు ఒకామె టైపుచేసింది. మాపని పూర్తిఅయింది - ఆఫీసు మూసేవేళ అయింది. మేం దగ్గిరవున్న రెస్టారెంటుకివెళ్ళేం. మాకు పరిచయం అయిన వారిద్దరుకూడా అక్కడికే వచ్చారు - మా బల్లదగ్గిరే కూచున్నారు. అందరంకలిసి ఫలహారంచేశాం.

మా పత్రికల్లో - విశాఖపట్నం-బెజవాడ - ఆంధ్ర - అని వుండడం చేత హిందూదేశం గురించి వచ్చింది. గాంధీ, నెహ్రూ, కాంగ్రెస్ అని పేర్లుచెపుతూ - ఇంకా ఇండియాగురించి తెలుసుకోవడానికి ఉత్సాహంతో ప్రశ్నలువేసేరు.

"హిందూదేశానికి ఎప్పుడైనా సోషలిజం వస్తుందా ?" అని అడిగేరు. అందుకు లహోరు, కరాచీ తీర్మానాలగురించి చెప్పాం.

"తీర్మానాలు సరేలెండి, కార్యసాధనం ఎలాగ ?" అని అడిగేరు. ఖద్దరు, స్వదేశీగ్రామపరిశ్రమలు, వీటిగురించి మేం చెప్పేం. గాంధీతత్వం మాట్లాడేం. మేం వేసుకున్న ఖద్దరుబట్టలు - కాశ్మీరుపూలు షరాయిలు, సీతానగరం కమీజులు, పొందూరు రుమాళ్ళు - చూపించాము. చాలా అందంగా వున్నాయని మెచ్చుకున్నారు. రాజకీయ, ఆర్థిక స్వాతంత్రానికి, వ్యవసాయ పరిశ్రమాభివృద్ధికి - ఖద్దరే పునాది అన్నాం.

మా మాటలు శ్రద్ధగావిన్నారు. "సోషలిజం, స్వాతంత్ర్యం వక్కసారేగనక మీరు సంపాదించగలుగుతే ప్రపంచకానికంతా హిందూదేశం ఆదర్శప్రాయం అవుతుందన్నారు వాళ్లు.

## సోవియట్‌లో స్వేచ్ఛ

తరువాత కమ్యూనిస్టుపార్టీగురించి వచ్చింది.

మేం :—సోవియట్‌లో కమ్యూనిస్టుపార్టీ తప్ప మరోపార్టీకి తావులేనప్పుడు, వ్యక్తిస్వేచ్ఛకి, వ్యక్తిస్వాతంత్రానికి తావెక్కడుంది అని సోవియట్ వ్యతిరేకులు అంటారే - అందులోనిజం ఎంతవరకు ?

వాళ్లు :—అయితే, అమెరికాలోనూ, ఇంగ్లండులోనూరెండు - అనల్ పక్షాలురెండేగా !- పక్షాలున్నాయికదా, మామూలు మనుష్యుడికి నిజమైన స్వాతంత్ర్యం, స్వేచ్ఛవుందా చెప్పండి ?

మేం :—యదార్థానికి లేదనే చెప్పాలి.

వాళ్లు :—ఒప్పుకొన్నందుకు సంతోషం ! ఇక - పార్లమెంటువిధానం రావడం, ఒకవైపు ధనికులు మరొకవైపు బీదలు రెండుపక్షాలు ఏర్పడడం, వాళ్ళకివీళ్ళకితగాయిదాలు, నిరంతరంభేదాలు, ఆదేశాల ఆర్థిక రాజకీయ పరిణామంలో తప్పనిసరి. మాది ప్రజారాజ్యం. ప్రజలని అణగదొక్కేవాళ్లు, పీడించేవాళ్లు ఎవ్వరూలేరు. అంచేత

ప్రజానీకంఅంతా ఒకటే - దేశం అంతా ఒకటేపక్షం. అలాంటప్పుడు - రెండుపక్షాలెందుకుండాలండీ ?

మేం :—వ్యక్తిగతస్వేచ్ఛవుండకపోతే ఎలాగుఅంటారు పై దేశాలవాళ్లు.

వాళ్లు :—వాళ్ళస్వేచ్ఛ బంగారంగానూ ! అందరం సమానం అందరం సౌఖ్యపడాలి, దారిద్ర్యం అజ్ఞానంనశించాలి - అని అందరం తంటాలు పడుతూంటే - ఛీ, ఛీ, బీదతనంవుండాలి, బానిసత్వం వుండాలి, అజ్ఞానంవుండాలి, అంటూ మరోపార్టీవుండాలీ ? ఇదేమిటండీ ?

మేం :—చిన్న విషయాల్లోనైనా అభిప్రాయభేదంవుండొచ్చుగా అంటారు, మీ వ్యతిరేకులు.

వాళ్లు :—పార్లమెంటులు లేకపోతే చిన్నచిన్న తేడాలు సరిపెట్టుకోలేమూ ? మేం సరిపెట్టుకోవడంలేదూ ?

మేం :—పార్లమెంటు లేకపోగానే - నిరంకుశం ఏర్పడ్డానికి అవకాశం వుంటుంది - చూడండి, సోవియట్‌కి, నాజీకి ఏమి తేడాలేదు. ఇసకతక్కె, పేడతక్కె - అంటున్నారు మీ వ్యతిరేకులు.

వాళ్లు :—ఆవాదానికి నాజీలు, ఫాసిస్టులు ఒప్పుకుంటారా ? ఒప్పుకోరే ! అదికాదు మాకు వాళ్ళకీ ఉత్తరధృవం, దక్షిణధృవం, హస్తిమశకాంతరంతేడా, జర్మనీలో వ్యక్తిస్వేచ్ఛఎక్కడ ? ప్రతీది పైనుంచి రావాలి. సవారీలోకూర్చొనేవాళ్ళు నాయకులు - సవారీమోసేది బంట్లు, బానిసలు. ప్రతీదినిర్బంధమే, ప్రతీదీఆజ్ఞే. శిరసావహిస్తావా-చస్తావా ? అంతే - మీరు చూశారుగా జర్మనీలో ?

మేం :—అవును, నిజమే.

వాళ్లు :—ఇక - సోవియట్‌లోనా ? ప్రతిమార్పు, ప్రతిప్రతిపాదన, ప్రతి విధానం - క్రిందసంస్థలనుంచే రావాలి. ప్రజలనుంచి వెళ్లాలి ప్రభుత్వానికి - పిటీషన్లుకావు, ఆజ్ఞలు. ఆజ్ఞాపించేది ప్రజ - అనుసరించేది ప్రభుత్వం. తన జీతం నిర్ణయించుకోవడంలో - తను పనిచేసే పరిస్థితులు ఏర్పాటుచేసుకోవడంలో, తన ఫ్యాక్టరీ, తన ఆఫీసు, తనక్షేత్రం అభివృద్ధికి తీసుకురావడంలో సంపూర్ణమైనస్వేచ్ఛ, స్వాతంత్ర్యం, విమర్శనహక్కూవుంది. ఏం అంటారు ?

మేం :—స్టాలిన్ రాజ్యాంగవిధానం అంటే సోవియట్ ప్రజల్లో మంచి ఉత్సాహంవుంది. నిజంగా చూడవలసిందేలెండి !

వాళ్లు :—ఏమైతేనేం ! మీ స్విట్జర్లెండు మహారాజ్యంమాత్రం మా సోవి యట్ను ఇంతవరకు గుర్తించలేదుకదా ! ఏంచేస్తాం ?

అందరంనవ్వేం, బాతాఖానీ పూర్తిఅయింది, అందరం లేచిపోయేం.

## మానవనాటకంలోని రంగాలు

కేంద్రజాగ్స్ (జనన మరణ వైవాహికకార్యాలయం) కార్యాలయం చాలాపెద్దది. సోవియట్ ప్రజల నిత్యజీవితంలో వాస్తవంగా దానికి చాలా పెద్దస్థానంవుంది. స్త్రీలూ, పురుషులూ, వృద్ధులూ, యువకులూ, పసి పిల్లలూ, కాస్త యెదిగినపిల్లలూ, తప్పటడుగులపిల్లలూ, కులుకుతూన్న దంపతులూ, విలపిస్తూన్న దంపతులూను, పిల్లల్ని చంకనిపెట్టుకుని సగ ర్వంగావున్న తల్లులూ, చెంగుకువేలాడుతూన్న పిల్లలతోవచ్చిన తల్లులూ, జట్లుకట్లుకొని నవ్వుతూనడుస్తూన్న పెద్దపిల్లలూ మొదలైన జనసమూ హంతో కార్యాలయం కిటకిటలాడుతూంది.

ఒకహాలులో వివాహాలు రిజిస్టరు చేయించుకోవడానికి దంపతులు వరసలుతీర్చి నిలబడివున్నారు. కొంతమంది సంతానం కలిగేక రిజిస్టరు చేసుకోవడానికి తమపిల్లలతోసహా వచ్చేరు : రిజిస్ట్రేషన్కొరకు తమ దరఖాస్తులను చూపుతున్నారు. ఉభయపక్షాలను కొన్ని ప్రశ్నలువేసి ఆఫీసుపుస్తకాల్లో రాసుకున్నతరవాత, రెండురూబుళ్ళ రుసుము చెల్లించి సగర్వంగా దంపతులు వెళ్ళిపోతున్నారు. ఇంకో దంపతులు వచ్చేరు. వరుడు యేదో పెద్ద ఉద్యోగంలో వుండివుండాలి. క్రీపుజోళ్లూ మంచి ఓవర్కోటూ - నీటుదుస్తులు. వధువుకూడా చక్కగా అలంకరించుకొంది. ఇంపుగా కుట్టినబట్టలూ దిట్టమైనజోళ్లూ - సిల్కుబ్లౌసు - వీళ్ళకు పిల్లలు లేరుగాబట్టి అదేపద్ధతిని యింకా వేగంగాను రిజిస్ట్రేషన్ ముగిసింది. స్త్రీ పురుషుల జీవితాల్లో అత్యంత ప్రముఖమైన యీ సంఘటన నిరాడంబ రంగా ఆనందకరంగా ప్రేమయుతంగా జరపబడుతూంది. మేం హాలులోకి వెళ్ళి ఆ నాటకాన్ని వింతగాచూస్తూన్నాం. మొట్టమొదటి భార్యాభర్తలు ఇద్దరు పిల్లలతోకూడా వచ్చారు. వారు ఇదివరకే భార్యాభర్తలగా సంసారం జరుపుతూన్నారు. ఇప్పుడు వివాహం రిజిస్టరు చేయించు కుంటున్నారు.

ఇంకోహాలులో పరిస్థితులు యింత నవ్యంగా వెళ్ళడంలేదు. ఇందులోకూడా దంపతులు కనిపెట్టుకొనివున్నారు. కొందరు పిల్లలతో

వున్నారు. ఇది విడాకులు కార్యాలయం. విడాకులు పరిష్కారంచేసే గుమస్తా వుభయపక్షాల్నీ ప్రశ్నిస్తున్నాడు.

మేం వెళ్ళేటప్పటికి - ఒక ఇద్దరు భార్యభర్తలు తగాదాలుపడుతున్నారు. ఆ స్త్రీ కోపపుమాటలుబట్టిచూస్తే ఒకరిమీద ఒకరు నేరారోపణ చేస్తున్నట్టు స్పష్టమవుతుంది. ఆవిడ మాటిమాటికీ తనప్రక్క బెంచీమీద కూర్చునివున్న పిల్లలివేపు చూపుతూంది. ఇద్దరుపిల్లలూ ముద్దులమాటలు; తలకు తెల్లని రుమాళ్లు చుట్టివున్నాయి. కుర్చీమీదకూర్చుని మరొకడు వున్నాడు. కాగితంకట్టలతో నిండివున్న అతని తోలుసంచి సాధికారపు వర్తనా చూస్తే అతను కార్మికసంఘం ఆర్గనైజరు అయివుండాలి. ఆ ఉభయపక్షాలవారూ అతనికి బాగాతెలిసివుండాలి. కొన్ని వాదప్రతివాదాలు జరిగేయి. అంతవరకూ చిటపటలాడుతూన్న భార్యాభర్తల ముఖాలు కొంత చల్లబడ్డాయి. గుమస్తా యిదికూడా కనిపెట్టేడు. అతనేదో వ్యవహారం పరిష్కరిస్తూ మాటాడుతున్నాడు. వాళ్లెవరూ అతని మాటలమధ్యలో యేమీ అనలేదు. పిల్లల్ని కార్మికసంఘం ఆర్గనైజర్ల యెత్తుకున్నాడు. భర్త వాళ్ళను తీసుకొని ముద్దులాడుతున్నాడు. విడాకుల గుమాస్తా కార్మిక సంఘం ఆర్గనైజరు మధ్యవర్తిత్వంవల్ల విడాకుల దరఖాస్తు రద్దుచేసుకున్నారు దంపతులు, సమాధానపడ్డారు.

ఇంకోదరఖాస్తుదారుడువచ్చేడు. అతను ముప్పైసంవత్సరాలలోపు యువకుడు, మంచిబట్టలు వేసుకున్నాడు, కొత్తజోళ్లు తొడుక్కున్నాడు, ఉద్యోగపత్రం చేతిలోవుంది. నెలకు ఐదారువందల రూబుళ్లు తెచ్చుకుంటూన్నట్టు కనిపిస్తాడు; ఉభయుల్లోనూ అన్యాయం తనకే జరిగినట్టు అతని గొంతుకవల్ల స్పష్టంగా తెలుస్తూంది. యువతి అందంకోసంకంటె ఫాషను కోసం, చాలాకీకోసం యెక్కువగా అలంకరించుకుంది. ఆవిడ అతనికి తగినభార్య కాదని నిశ్చయంగా చెప్పవచ్చు. భర్త గుమస్తాదగ్గిరకొచ్చి, ఆవిడకిచ్చిన విడాకులు నోటీసు కాబోలు, ఒకకార్డు యిచ్చేడు. భార్యకూడా అటువంటికార్డే చూపింది. గుమాస్తా ప్రశ్నిస్తున్నాడు. ప్రశాంతంగా గౌరవపురస్సరంగా భర్తసమాధానాలిస్తున్నాడు. గుమాస్తా భార్యను ప్రశ్నిస్తున్నాడు. బడబడలాడుతూ తన్ను సమర్ధించుకొంటూన్నట్టు ఆవిడ మాటాడుతూంది. గుమాస్తా విసుక్కున్నాడు. అతనికి ఆవిడధోరణినచ్చనట్టుంది. గుమాస్తా వాళ్ళిద్దరికీ ఆఖరుప్రశ్న వేసేడు. నిశ్చయంగా వప్పుకోము అన్నట్టు తొందరగాతలలూపి సమాధానం యిచ్చేరు. సరే

మీఖర్మం. నేనేంచేస్తాను అన్నట్టు గుమాస్తా పెదవివిరిచి ఒక పెద్ద పుస్తకాన్ని తీసేడు. వాళ్ళిద్దరిమధ్యా సమాధానం సాధ్యమూకాదు కోరనూ కూడదని అతను విశ్చయించేడు. ఆస్త్రీని గుమస్తా రెండుమాటలతో ఒక ప్రశ్నవేసేడు. ఒక్కమాటలో ఆవిడ సమాధానం చెప్పింది. యీామెకు పరిపాటులాగేవున్నట్టు మాకు అనిపించింది. ఆవిడ ఒక చిన్నపుస్తకం గుమాస్తాకిచ్చిది. అది ఆవిడ జీతంకార్డులాగవుంది. గుమాస్తా యేదో లెక్కపెడుతున్నాడు. చివరకు పుస్తకంలో ఏదోవ్రాసి అది బయటికి చదివేడు. పద్ధతిప్రకారం తప్పనిసరిగా యిచ్చుకోవలసిన డబ్బు నిర్ణయమైందనీ, అది ఆ స్త్రీ యిచ్చుకోవాలనీ, తండ్రి అధీనంలో శిశువు శిశుపోషణాలయంలో వుండాలనీ గుమాస్తా చదివిన దానిఅర్థం అని మాకు తోచింది. గుమాస్తా యెవరినోపిలిచేడు. ఒకయువతి, ఫ్యాక్టరీ శిశుపోషణాలయం దాదికాబోలు వచ్చింది. శిశువును తన ఖాయిదాలో వుంచడానికి అధికారంగల ఒకకార్డు దాదికి గుమాస్తా యిచ్చేడు. తల్లి కొంతడబ్బు చెల్లించి రసీదుపుచ్చుకుంది. రెండోదఫా విడాకులురుసుం నూటయాభై రూబుళ్లూ, శిశుపోషణకు ఆమె యివ్వవలసిన రూబుళ్లూ యిచ్చింది. స్త్రీ పురుషులిద్దరూ తలొకదారినిపోయేరు. నాటకం సమాప్తమైంది. ఇంకా కొందరు కాచుకొని వున్నారు.

మూడోహాలు మరీ జనసమ్మర్దంగావుంది. ముందు పుస్తకాలు తెరుచుకొని చాలా మేజాబల్లలముందు గుమాస్తాలు కూచొనివున్నారు. ఒకరూ - యిద్దరూ - ముగ్గురూ - యింకా యెక్కువమంది పిల్లలతోను తల్లితండ్రులు గుమస్తాల దగ్గిరికివస్తున్నారు. ఏదోచెపుతున్నారు. రిజిస్టర్లలో సంతకంచేసి చిన్నకాగితంముక్కల్ని పుచ్చుకుంటున్నారు. అవి జాగ్రత్తగా దాచుకొంటూ వెళ్ళిపోతున్నారు. పిల్లలతోటున్న కుటుంబాలు ఇళ్ళకోసం డిస్ట్రిక్టు సోవియట్‌లో రిజిస్టరుచేసుకొనే కార్యాలయంఅది. వాళ్ల దరఖాస్తులు పెట్టుకున్నారు. తరవాత వాళ్ళకి సమాధానం వస్తుంది. తమకియిల్లొకటి చూపించమని కార్మికసంఘం ఆర్గనైజరుని యింతకు ముందే వాళ్ళడిగివుంటారు; లేకపోతే అధికసంఖ్యగల తమకుటుంబానికి యెక్కువ గదులుగల యిల్లు యింకొకటి చూపించమనిఅయినా అడిగి వుంటారు. ఇళ్ళకరువు చాలా యెక్కువగావుందని వాళ్ళకు తెలుసు; చాలాకాలం వేచివుండాలనీ తెలుసు. కాని అదృష్టంబాగుంటే త్వరలోనే ఒకయిల్లు దొరకవచ్చు. డిస్ట్రిక్టు సోవియట్ కొత్తయిళ్లు కట్టిస్తూంది.

తమ కార్మికసంఘంకూడా కట్టిస్తూంది. తమ ఫ్యాక్టరీ నిర్వాహకులు కట్టిస్తున్నారు. గృహనిర్మాణ కార్యక్రమం - సర్వతోముఖంగాను సత్వరం గాను జరుగుతోంది. అంచేత త్వరగానే వీళ్ళందరికీ దొరకొచ్చు.

నాటకం సమాప్తమైంది. వివాహాలు, విడాకులు, పుట్టుకలు, చావులు - అన్నీ వొకే మందిరంలో వున్నాయి. ఒకే మానవనాటకంలో యివన్నీ వివిధరంగాలుకావా? ఈ కార్యకలాపాలు జరిగిన రష్యన్‌భాష మాకు తెలిసివుంటే యెంత బాగుండేది! ఏమైనా, జాగ్స్ కార్యాలయం చూస్తూంటే చాలా సరదాగావుంది!

## మత స్వాతంత్ర్యం

సమిష్టి వ్యవసాయక్షేత్రంలోని ముసలమ్మ యింట్లో మాకు కనిపించిన ఏసుక్రీస్తు విగ్రహం మమ్మల్ని చాలా ఆందోళనపెడుతూంది. యూరోపియన్ అమెరికన్, బ్రిటిష్ పత్రికలలోని పెద్ద గందరగోళమూ, చర్చి అధికారులూ బిరుదులూ హోదాలుగలవాళ్ళూ రాజకీయవేత్తలూ సంతకాలుచేసి ప్రచారంచేసిన సోవియట్‌దేశంలోని భయంకరమైన మత నిర్మూలనం కథలు చదివేక చాలాకాలంకిందటే ఆ క్రీస్తువిగ్రహాలు వేయి ముక్కలుగా ధ్వంసంచేయబడివుండాలి; ఆ ముసలమ్మను నానాహింసలూ పెట్టి బహిరంగంగా ఉరితీసివుండాలి; సంకెళ్లువేసి ఆమె కొడుకుల్ని ఆర్కిటిక్‌తీరానికి తరిమివేసివుండాలి: ఆ సమిష్టి వ్యవసాయక్షేత్రాన్నీ దాన్లోవున్నవాళ్ళనీ సర్వనాశనం చేసివుండాలి; ఆబూడిదను నిరీశ్వర ప్రదర్శనశాలలో పెద్ద ఉత్సవంతో ప్రతిష్ఠించడానికి అని యువకకమ్యూనిస్టులు స్టాలిన్‌కు బహూకరించివుండాలి! ఎక్కడో యేదోలోపం జరిగివుంటుంది! ఈ క్రీస్తువిగ్రహం యింకా సోవియట్‌దేశంలో వుండడంచేత, ఆవిషయాన్ని స్వయంగా తెలుసుకుందామనుకున్నాం!

తెలుసుకోవడం యెలాగాఅన్నది ప్రశ్న. ధ్వంసంచేయగా మిగిలిన క్రీస్తువిగ్రహాలన్నిట్నీ లెక్కపెట్టడం మాకు సాధ్యంకాదుకదా! విగ్రహారాధనచేస్తున్న గుళ్ళు, చర్చిలు - వాట్ల జనాభాలెక్కలు తీయడంకూడా తెలివితక్కువపనే - మాస్కోలో మిగిలిపోయివున్న చర్చిలన్నిట్నీ లెక్కపెట్టడమూ, అవేవన్నావుంటే దైవారాధనచేసుకోవడానికి అనుజ్ఞగల వాటి సంఖ్యను లెక్కపెట్టడమూ చెయ్యాలన్న అద్భుతమైన అభిప్రాయాని కొచ్చేం! మాహోటలుదగ్గరనుండి ప్రారంభించి ఆవీధిలోవున్న వాట్నన్ని

టినీ లెక్కపెట్టేం. మధ్యాహ్నంసరికి ముప్ఫైరెండిట్ని లెక్కపెట్టేం. తొమ్మిది రకరకాల శిధిలావస్థల్లోవున్నాయి; క్లబ్బులు, ఆస్పత్రులు, శిశు పోషణాలయాలు మొదలైన వివిధ సంస్థలక్రింద పదకొండింటిని వినియోగిస్తున్నారు. ఐదింటిలో చిన్న ఆఫీసులున్నాయి; రెంటిని తాత్కాలికంగా హాస్టలుగా చేసేరు. అవి తాళంవేసివున్నాయి. రెండు చర్చీలుగా పనిచేస్తున్నాయి. రెండున్నూ గ్రీకు సనాతనపద్ధతి చర్చీలు. ఒకదాంట్లో ఏదో పూజ జరుగుతూంది కొవ్వొత్తులు కాలుతున్నాయి; పూజారి అరవైఏళ్ళ వృద్ధు. ఆచారంగావస్తూన్న గడ్డమూ విలువైన దుస్తులూ, మతకిరీటమూ-సనాతనచర్చి పూజారి వుండవలసినవిధంగా వున్నాడు. అందరూ కలసి ప్రార్ధనలు పాడుతున్నారు. ఒకవిధమైన ఆధ్యాత్మిక వాతావరణం రెండో చర్చిలో యింత అట్టహాసంలేదు; చాలా చీకటిగావుంది. దైవపీఠంముందు యిద్దరు వృద్ధస్త్రీలు ప్రార్ధనలో లీనమైవున్నారు. వీరు మినహా చర్చిఅంతా కాళీగానేవుంది.

మాస్కోలో జోళ్లు కొటకంగావున్నాయి కాబట్టిఇంతటితో మాఅన్వేషణ ఆపుచేసేం. తిరిగి పెద్ద చర్చికి వెళ్ళేం. భక్తులు బయటికి వస్తున్నారు. మినహాయింపులేకండా అందరూ ఏభయ్యోవడిదాటినవాళ్ళు; అంతకన్నా పెద్దవాళ్లూ వున్నారు. గ్రాండ్ హోటల్లోవున్న కొందరు యాత్రీకులకు మాంసం మూటలుకట్టే ఫ్యాక్టరీని చూపించి తిరిగి వచ్చిన దుబాసీనొకణ్ణి. మేం హోటలుకు తిరిగివచ్చేక యీ సంభాషణలోకిదించేం. దుబాసి మాకోరికవిని సోవియట్ దేశంలోని మత స్వాతంత్ర్యం యదార్ధపరిస్థితి చెప్పేడు.

"మత విశ్వాసానికీ ఆరాధనకూ సోవియట్ ప్రజలందరికీ హక్కుంది. ఈహక్కును యేమాత్రం ఆటంకపర్చినా ప్రభుత్వం సహించదు. ప్రార్ధనమందిరం తమకు కావలసినవాళ్లెవరైనా ఒకటి ఉంచుకోవచ్చు. చర్చి నిర్వహణానికీ, పూజారినీ ప్రార్ధన గాయకులనూ పోషించడానికీ, చర్చిని సక్రమంగా నడపడానికీ సామర్ధ్యంవుంటే వాళ్ళలాగ చెయ్యవచ్చు. వ్యక్తుల్లాగనే చర్చిగూడా ఆదాయాన్ని యిస్తుండే ఆస్థిని వుంచుకోకూడదు; పూర్వం చర్చీలకుండే భూములూ తదితర ఆస్తులూ జప్తుచేయబడ్డాయి. చర్చీలు అపారంగా అభివృద్ధినిరోధకతత్వాన్ని ప్రజల్లో వ్యాప్తిచేస్తుండే పాతరోజులపద్ధతికి మళ్ళిపోవడం యిక కలలోనిమాట. చర్చీ, ప్రభుత్వమూ శాశ్వతంగా వేరుచేయబడ్డాయి. వివిధమతాలు తమ తమ

మతాల్లో కలుపుకోవడానికి శుద్ధిచెయ్యడంగాని విదేశ మతప్రచారకుల్ని దేశంలోనికి రానివ్వడంగాని వీలుపడదు. "ఆదివారపు మతపాఠశాలలు" పెట్టడానికిగాని మతబోధ చెయ్యడానికిగాని చర్చీలకు అనుమతిలేదు. కుటుంబంలో మతబోధ చేసుకోవచ్చు; తమకుటుంబంలో తమ పిల్లలకు తలిదండ్రులు మతబోధన చెయ్యకండా ఎవరూ ఆటంకపర్చరు. కాని, తమ కుటుంబంలోనుంచి వచ్చినప్పటికీ మతంపట్ల యీతరంవాళ్లు యెవరైనా సమ్మతిస్తారనడం సందేహాస్పదం. కారణం, దాపరికంయేమీలేకండా ప్రభుత్వం మతానికి పూర్తిగా వ్యతిరేకం; ప్రచారంద్వారా ప్రదర్శనశాలల ద్వారా యువకుల్లోని మతవ్యతిరేక దృక్పథాన్ని ప్రోత్సహిస్తుంది; యీవిషయంలో కమ్యూనిస్టుపార్టీవారూ బాలసంఘసభ్యులూ యువకకమ్యూనిస్టులూ కార్మికసంఘాలూ ఫ్యాక్టరీల నిర్వాహకులూ, షాపుల నిర్వాహకులూ ప్రభుత్వాన్ని దిట్టంగా బలపరుస్తారు.

"కొత్తరాజ్యాంగచట్టం ప్రకారం, పూజార్లకుండే రాజకీయమైన యిబ్బందులు తొలగించివేయబడ్డాయి. ఓటుహక్కు తదితర రాజకీయ అవకాశాలూ వాళ్ళకివ్వబడ్డాయి. సోవియట్ దేశంలోని యితరుల పిల్లలకిచ్చినట్టే పూజార్ల పిల్లలకుకూడా సమానంగా ఎట్టి విచక్షణలేకండా అన్ని సౌకర్యాలూ అన్ని అవకాశాలూ యివ్వబడ్డాయి. పూర్వపు ధనికవర్గాలకు చెందినవారి పిల్లలకుకూడా వీరితోబాటుగా, యీ రాజకీయహక్కులు మునుపటిలాగనే యివ్వబడ్డాయి. కాలస్థితినిబట్టి సోవియట్ సమాజం బాగా నిలకడకురాబట్టి, యీ మతబృందాలు యిక విప్లవవిద్రోహకార్యాలకు కీలకాలు కాలేకపోవడమే దీనికి కారణం. వాళ్ళకు సమాన రాజకీయస్థానాన్ని యిచ్చి కొత్త రాజ్యాంగచట్టం నవశకాన్ని ప్రారంభించడం పరిస్థితుల్నిబట్టి చాలా సమంజసంగావుంది.

"సోవియట్ యూనియన్‌లో యింకా యితర మతాలున్నాయన్న సంగతికూడా మీరు మర్చిపోకండి. మాదేశం తూర్పుభాగంవేపు చాలా ప్రాంతాలు ముస్లిం మతకేంద్రాలు; మంగోలియాలో కొంతమంది బౌద్ధ మతస్తులు వుంటారు లక్షలకొద్దీ యూదులున్నారు; వాళ్ళకు స్వతంత్రమైన స్వతంత్రరాష్ట్రముంది. వాళ్ళ యూదుజాతి చరిత్రలో మొట్టమొదటిసారిగా, నిజమైన మతరాజకీయ స్వాతంత్ర్యాలు వాళ్ళు అనుభవిస్తున్నారు. తాము జాత్యహంకారానికి గురిఅయి దారుణహింసలపాలుపడకపోవడమూ, వాళ్ళ దేవాలయాల్ని యెవరూ దోపిడీచేసి తగలబెట్టకపోవడమూ, తమ

గడ్డాల్ని బలవంతంగా యెవరూ కత్తిరించకపోవడమూ, అసహనంతో తమమీద యెవరూ వుమ్మివేకపోవడమూచూస్తే ఆ యూదులకే వింతగా కనిపిస్తూంది ! ఇంతెందుకు, వాళ్లు యూదులుకారా అని యెవరూ యెప్పుడూ అడిగేశ్రమకూడాపడరు ! క్రైస్తవచర్చి సనాతన గ్రీకుపద్ధతికి చెందినది. కాని రోమన్ కేథలిక్కులూ కొంతమంది బాప్టిస్టులూ యితర ప్రొటస్టెంట్లుకూడా వున్నారు. విదేశపత్రికల్లో తీవ్రంగా అబద్ధప్రచారం సాగుతున్నా, సోవియట్ యూనియన్‌లో సంపూర్ణమైన మతస్వాతంత్ర్యంవుందని నిర్మలంగా సత్యంగా చెప్పగలం. మాస్కోలో యిప్పుడు సుమారు యిరవై చర్చిలలో పూజాపునస్కారాలు జరుగుతూనేవున్నాయి. కాబట్టి, ఆసమిష్టిక్షేత్రంలోని ముసలమ్మ క్రీస్తువిగ్రహాన్ని తలుచుకుంటూ, దయచేసి రాత్రుళ్లు నిద్ర లేకండా బాధపడకండి !" అని దుబాసి హాస్యంగా సంభాషణ ముగించేడు.

అతను చెప్పినది సత్యంగా కనిపిస్తూంది. సోవియట్ యూనియన్‌లో మతాలకూ మతాభిప్రాయాలకూ మతారాధనకూగల స్థానాన్నిగురించి అతను చెప్పినది నూటికి నూరుపాళ్లు సత్యం. పైగా ఒకరోజున రెడ్ స్క్వేర్‌లో యిద్దరు క్రైస్తవసన్యాసులు (బెనిడిక్టివ్ మాంగ్స్) - రక్తమాంసాలతో సజీవంగా వున్నవాళ్లు - వాళ్ళవెనక అల్లరిమూకలులేవు, హింసించి హత్య చేయడానికి గుంపులుకూడలేవు - క్రైస్తవసన్యాసుల్ని యీపరిస్థితిలో మాకళ్లారా చూసేం !

## జాతుల సౌభ్రాతృత్వం

ఈవేళ మాహోటల్లో పెద్దకార్యమేదో జరగబోతున్నట్టుంది. ఈ హంగామా ఏమిటి అని చీఫ్ వెయిటర్ని భోగట్టాచేస్తే, దూరప్రాచ్య రాష్ట్రాలనుండీ జాతులనుండీ కార్మికయాత్రికులు వచ్చేరనీ, వాళ్ళీ హోటల్లో బసచేసేరనీ చెప్పేడు. మెట్రొపోల్ హోటల్లోనూ గ్రాండ్ హోటల్లోనూ సాధారణంగా ధనికులైన విదేశయాత్రీకులు బసచేస్తుంటారు; యితర దేశాలనుండివచ్చే అధికార ప్రతినిధులకూ రాయబారులకూ యెల్లప్పుడూ అక్కడే బసలిస్తారు. మా హోటలు, "న్యూమాస్కోవ్‌స్కాయా" అంత దర్జాఅయినదికాదు. సోవియట్ పౌరులూ సోవియట్ సమాఖ్యలోని రాష్ట్రాల ప్రతినిధులూ సోవియట్ దేశంలోని స్వాతంత్ర్య ప్రదేశాలనుండి వచ్చిన ప్రతినిధులూ యిందులో యెక్కువగాబసచేస్తారు. విదేశయాత్రీకులు కొద్దిమంది మాత్రమే ఇక్కడ దిగుతారు. మొత్తంమీద యీ హోటల్లో

సోవియట్ దేశంలోని అన్నిప్రాంతాల ప్రజలనూ చూడవచ్చు. వారితో వ్యక్తిగత సంబంధమూ పెట్టుకోవచ్చు.

భోజనాలవేళకి అతిధులువచ్చేరు. వాళ్ళలో చాలమంది, తమదేశానికి ముఖ్యపట్టణమైన మాస్కోకు, అదే మొదటిసారిగా వచ్చినట్టు స్పష్టంగా కనిపిస్తూంది. మేజాలముందు కుర్చీల్లో కూచుంటూంటే, వాళ్ళ ముఖాల్లో ఆశ్చర్యానందాలు స్పష్టంగా ముదపడివున్నాయి. బంగారంగిల్టుపూసిన కుర్చీలను కొందరు వేళ్ళతో తడుముతున్నారు; కొందరు ముఖ్మలు కుషన్ల లోని సౌఖ్యాన్ని అనుభవిస్తున్నారు; భోజనశాలలోని దీపస్థంభాల్నీ కొవ్వొత్తిదీపాల్నీ కొందరు తేరిపారచూస్తున్నారు. ఆవైభవమంతాతమదే అన్న సంతృప్తీ గర్వమూ వాళ్ళందరిలో మూర్తీభవించివుంది: మాస్కో-లెనిన్‌గ్రాడ్ కీవ్‌పట్టణాల పౌరులులాగనే ప్రాచ్యప్రాంతాలకు చెందిన తాముకూడా తమదేశ నూతనజీవితం సిరిసంపదలలో అర్హతలలో సమాన భాగస్వాములమన్న సంతుష్టీ గర్వమూ వాళ్ళందరి ముఖాల్లోనూ ఉట్టిపడుతూంది.

వడ్డనకుపూర్వం మాస్కో-సోవియట్ ఉద్యోగి ఒకతను క్లుప్తమైన ఉపన్యాసంతో వారిని ఆహ్వానించేడు. వాళ్ళతరఫున ఒకముసలిస్త్రీ ఒక యువకుడూ ఆహ్వానాన్ని స్వీకరించేరు. చప్పట్లూ హర్షధ్వనులూ చెలరేగేయి. తరవాత భోజనాలు మొదలయ్యేయి. విందు చాలాఘనంగా యేర్పాటుచేయబడింది. అతిధులు నిర్మోహమాటంగా ఆరగిస్తున్నారు.

సోవియట్ దేశంలో సంచారం చెయ్యడానికి యిటువంటి యాత్రిక దళాలను బాగా ప్రోత్సహిస్తారు. సోవియట్ దేశ యాత్రాసంఘంతోబాటు వివిధకార్మికుల యాత్రాసంఘాలూ యీ యాత్రలను సాధారణంగా యేర్పాటు చెయ్యడంవల్ల, కర్చులు తరుచు నామమాత్రంగావుంటాయి .

## ఏక కుటుంబం

పద్దెనిమిదికోట్లమంది ప్రజలు !
నూటయేనభై జాతులు !
నూటయాభై భాషలు !
నలభైతొమ్మిది స్వతంత్ర రాష్ట్రాలు !

ఒకే మాతృభూమిలో, ఒకే నాగరికతలో వీటన్నిట్నీ పోతపోసి ఒకే దేశంగా చేయడం యెంతటి బ్రహ్మాండమైన సమస్య ! దీని అపార

తనూ నిస్సంశయమైన విజయాన్నీ. సోవియట్ జాతుల ప్రదర్శనశాలను చూసిన తరవాతనే సరిగా తెలుసుకోగలిగేం. ఈప్రదర్శనశాలలో, ఈనూట యెనభై జాతులలో ఒక్కొకదానికి ప్రత్యేకంగా ఒక భాగంవుంది. ఒక్కొదాని సంస్కృతి చరిత్ర సాంప్రదాయం జానపదవిజ్ఞానం కళలు సారస్వతం సంగీతం పరిశ్రమలు వ్యవసాయం చేతిపరిశ్రమలు ఖనిజ ఆర్థిక విద్యుచ్ఛక్తి ఆధారాలు (రిసోర్సెస్)భవిష్యదభివృద్ధికిగలఅవకాశాలు ఐదేళ్ళ కార్యక్రమంలోగల స్థానమూ - యీ విషయాలన్నీ నమూనాలు ఫొటోలూ సంఖ్యలూద్వారా ప్రదర్శించబడ్డాయి. బాగా తర్ఫీదుపొంది ఆయా విషయాలలో బాగా నిపుణతగల తెలివైన ప్రదర్శకులు కార్మిక దళాలకు ప్రదర్శనశాల చూపుతుంటే వాళ్ళతోకలసి మేమూ చూసేం. ప్రదర్శనశాల చూడడానికి వచ్చినవాళ్ళలో అల్పసంఖ్యాకజాతులకు చెందినవాళ్ళుకూడావున్నారు. తమ కళలూ పరిశ్రమలూ సంస్కృతి సమాజ వాతావరణం అక్కడ ప్రదర్శితమవడమూ, దేశంలోని యితర ప్రజలు వాటిపట్ల గాఢమైన సానుభూతీ అభిరుచీ కలిగివుండడమూ వాళ్ళ హృదయాలకు హత్తుకపోయింది.

ఈ అల్పసంఖ్యాజాతుల సంస్కృతినీ సారస్వతాన్నీ సాంప్రదాయాల్నీ నిరుత్సాహపర్చకపోవడమే కాకండా, వారి జాతీయాభిమానాన్ని పెంపొందజేయడానికీ వారి సంస్కృతిని వారు సగర్వంగా ప్రేమించేటట్టు చేయడానికీ తాను చెయ్యగలిగినదంతా సోవియట్ ప్రభుత్వం చేస్తుంది. జాతుల సారస్వతాభివృద్ధికోసమూ జాతీయ నాటకరంగాలు విశ్వవిద్యాలయాలు కళాశాలలు సాంకేతిక పాఠశాలలూ వారి వారి భాషల్లో పత్రికలూ స్థాపనచెయ్యడంకోసమూ, జాతీయ కళలకూ చేతిపరిశ్రమలకూ అపార ప్రోత్సాహం కలుగచెయ్యడంకోసమూ జయప్రదంగా సోవియట్ప్రభుత్వం చేస్తున్న కృషికి, యీ ప్రదర్శనశాలే పెద్ద నిదర్శనం. సోవియట్ ప్రభుత్వ స్థాపనకు పూర్వం, యీ అల్పసంఖ్యాజాతులలో కొన్నిటికి మాటాడేభాష మాత్రమేతప్ప లిపివుండేదికాదు, అంచేత పుస్తకాలు సారస్వతమూ వుండేవికావు! నేడు యీ అల్పసంఖ్యాకజాతులకు సోవియట్ సమాఖ్యలో సౌభాగ్యాలతో తులతూగుతున్న స్వతంత్ర రాష్ట్రాలున్నాయి - అన్నీ బలిష్టమైన సోవియట్ దేశంలో సమానమైన సభ్యులు!

ఆ సాయంత్రం మేం హోటలుకు తిరిగిరాగానే, ఆ పెద్ద భోజనశాలలోని కుర్చీలు మేజాలు తీసివేసివున్నాయి. దిట్టంగా దీపాలు వెలుగు

తున్నాయి. వాద్యసమ్మేళనంతోబాటు తమజాతీయ నృత్యగీత సంగీతాలతో ప్రాచ్యప్రాంతాలనుండి వచ్చిన కార్మిక అతిధులు హోటల్లో వుంటూన్న యితర అతిధుల్ని ఆనందింపజేస్తున్నారు. పొాశవుపాటి పిలకలు వేలాడు తున్నాయి; వారి కుర్తాలూ దుస్తులూ రాపాడుతున్నాయి; కపాలానికి అంటిపెట్టుకొనివున్న టోపీలూ ఫెజ్‌టోపీలూ టార్‌బుష్‌టోపీలూ ఒకటితో వకటి కలసిపొయ్యేయి. ఆ నృత్యగీతవాయిద్యాలలో - ఏదో చిన్నవాళ్ళు చేస్తున్నారు మనం చూస్తున్నామనే గర్వదృష్టి వారికి ఆతిధ్యమిచ్చిన మాస్కో పౌరులలోలేదు; వర్ణం (రంగులోనూ) జాతీయంగానూ మనం తక్కువవాళ్ళమనే చైతన్యం అల్పసంఖ్యాజాతులవారిలోలేదు. జాతులు నిష్కల్మషంగా సమ్మిశితమయ్యేయి. ఉల్లాసమూ ఆనందమూ చిందులు తొక్కేయి. గాఢమైన సౌభ్రాతృత్వం పొంగులాడుతూ ప్రవహించింది.

## భోజనాల సంరంభం

స్వెర్డ్లోలవ్ స్క్వేర్‌లోని ఒక ఓపెన్ ఎయిర్ రెస్ట్రాంట్‌లో యీవేళ సాయంత్రం భోజనం చేసేం ఆ ప్రదేశమంతా భోజనాలుచేస్తున్న వాళ్ళతో నిండిపోయింది. అందులో చాలామంది కుటుంబాలతో వున్నారు. కఫేలు, రెడీసర్వీస్ లంచెకౌంటర్లూ, ఆటొమేటిక్ స్నేక్ సప్పర్‌బార్లు విరివిగా వుండడంచేత కార్మిక స్త్రీలకు వంటచాకిరీ తప్పిపోయింది. అంతే కాకండా, వాళ్ళకీ, వాళ్ళ కుటుంబాలకీ చాలా తక్కువధరలో రకరకాల బలిష్టమైన పదార్థాలూ, రుచిగల పదార్థాలు లభ్యమవుతున్నాయి. వడ్డన చేసేవాళ్ళు చాలా చురుకుగా మర్యాదగా వున్నారు; దురుసుతనంగాని సేవకభావంగాని అతిచనువుగాని తొందరపాటుతనంగాని వాళ్ళలోలేదు.

నవ్వులు కేరింతలతో రెస్ట్రాంటు ప్రతిధ్వనిస్తూంది. అనేక మేజాల ముందున్న భోక్తలు ఒకరిమీదనొకరు ఛలోక్తులు విసురుకుంటున్నారు. స్త్రీలు అందమైన దుస్తులు వేసుకున్నారు; కెరటాల దుస్తులు చేతులూ గోళ్లూ బాగా అలంకరించుకున్నారు. కాని వారి దుస్తులు యింకా నాణ్యమైనవైతే బాగుండుననిపిస్తుంది; సర్వసామాన్యంగా వాళ్ళు వేసుకున్నవి నూలుమేజోళ్ళే. మగవాళ్ళుకూడా బాగా ముస్తాబయ్యేరు; కాని వాళ్ళ దుస్తులు చాలా ముతకవి, వాటి పనితనంలో కొంతలోపం కనిపిస్తుంది. నగలు పూర్తిగా అదృశ్యమైపోవడం ప్రముఖంగా గోచరిస్తుంది. జోళ్ళ తోలు చాలా తక్కువరకంది. భోజనపదార్థాలు పుష్కలంగా సంతుష్టిగా

వున్నాయి. భోజనం వడ్డించిన చైనా పళ్ళేలూ, కత్తులూ చాలా మోటువి. బోర్షు, కట్ లెట్ లూ, మాకారొని, కేబేజి, కవియర్, కాంపోటి- భోజన పదార్థాలు. కాఫీకావాలన్నాం. క్రీంవేసి కాఫీ యిచ్చేరు।

## క్రీం దొరకని నాజీ పితృభూమి

క్రీం తలుచుకుంటే మాకు జర్మనీ జ్ఞాపకానికొస్తుంది. ధన ధనేత రాలు యేంయిచ్చినా నాజీ పితృభూమిలో క్రీం దొరకదు. అంచేత ప్రతి హోటల్లోనూ రెస్టారెంటులోనూ క్రీంవేసి కాఫీయిమ్మని అడగడం మాకు నిత్యచలోక్తి అయిపోయింది మేం జర్మనీలోవున్నప్పుడు, "క్షమించండి. క్రీంలేదు" అని వైటర్లతో అనిపించుకొనేవాళ్ళు. కొలోన్ పట్టణంలోని ఒక పెద్ద హోటల్లో భోజనంచేస్తూ యీవిషయమ్మీద ఒకసారి తంటా తెచ్చుకున్నాం. భోజనాలైపోయేయి, పుడ్డింగ్ వడ్డనైంది. మాపళ్ళేల్లో వేసిన మిరాంగ్ చాలా ఘోరంగావుంది. అందులోది అసలు క్రీమా లేక పోతే, అసలు దానికి బదులుగా పెట్టిందాఅని వైటర్ని వేళాకోళానికిఅడిగేం. దానిమీద మాతోపాటు భోజనంచేస్తున్న ఒక యస్. యస్. ఆఫీసరు ఖారాలు మిరియాలునూరుతూ మమ్మల్ని తీక్షణంగాచూసి, పొగరుబోతుగా లేచి నుంచున్నాడు; జోళ్లు భూమికికొట్టి నాజీ సెల్యూట్ పెట్టేడు; "ఇటు వంటి వేళాకోళపు ప్రశ్నలు పితృభూమిలో అడ్డగడానికి వీల్లేదు!" అని మామీద హుంకరించేడు। హిట్లరు జర్మనీలో క్రీంపేరెత్తితే దేశద్రోహం, మహాపరాధం అన్నమాట।

## అతుకు బ్రతుకులు

స్వెర్ డ్లోవ్ స్క్వేర్ రెస్టోరెంటులో కూర్చుని వుండగా నాజీ దేశాన్నీ, బెర్లిన్‌లోని గుంపుల్నీ, అక్కడ ఆఖరుసారి మేంచేసిన భోజనాన్ని జ్ఞాపకానికి తెస్తున్నాయి. రెస్టోరెంటు కాళీలేకుండా పూర్తిగా నిండిపోయింది. గోధుమ, నలుపు, ఆకుపచ్చ, బూడిదరంగుల యూని ఫారాలు వేసుకున్నారు ముప్పాతిక మూడువంతులు. డాబుగా నాజీపార్టీ గుర్తులు తగిలించుకున్నారు. యూనిఫారాల్లోవున్న యీ యువక సింహా లను యువతీమణులు చుట్టుకొనివున్నారు. మేం దేవతాసంభూతులం— లోకానికంతా మేంశ్రేష్టులమన్నగర్వం వాళ్ళందరిలో కనిపిస్తూంది. వాళ్ళ మహానాయకుడు హిట్లరు చెప్పలేదూ మనమంతా ఉత్తమ జాతివాళ్ళమనీ?

ఈచిన్నదేముళ్ళు మోతాదుమీరి మధుపానం చేస్తున్నారు. తలకాయలూ కాళ్ళూ వాళ్ళవశం తప్పిపోతున్నాయి..................వాళ్ళసంభాషణ గోలగా అహంకారంగా సాగుతూంది. బీరూ— "షాన్నప్సా" ప్రవహిస్తున్నాయి. నవ్వులతో యిల్లెగిరిపోతున్నది.....కాని వాళ్ళ లోలోపల యేదో బితుకు కనిపిస్తూంది. ఛలోక్తులాడుకొంటూ పక్కలు చెక్కలయ్యేటట్టు నవ్వుతున్నారు....ఒక్కసారిగా నవ్వులు ఆగిపోయేయి. ఏదో అదృశ్యమైవున్న భూతంవచ్చినట్టు వాళ్లు చూస్తున్నారు....తరవాత ఒకరినొకరు అనుమానంగా చూసుకొంటూ అప్రయత్నంగా వాళ్ళచేతులు గొంతుకల దగ్గరకు పోతున్నాయి. తమసంభాషణ యెవరో వింటున్నట్టూ. మాటాడకూడనివి తాము మాటాడినట్టూ వాళ్ళముఖాలు వివర్ణమైపోయేయి....మళ్ళా ఒక్కసారిగా కోలుకున్నారు. తమ నీడచూసి తామే భయపడ్డామని గుర్తించుకున్నట్టు మళ్లా యథాప్రకారంగా వెర్రి నవ్వుల దుమారంలో మునిగిపోయేరు........................కాని, పిరికితనంతోనూ కండ కావరంతోనూ వున్న యీదేవుళ్లు, అహంకారంతో తలలు రొమ్ములు విరుచుకొని, మిలటరీకవాతుతో వీధులంబడి నడుస్తారు. అయినా యెవరో వెన్నాడుతున్నారనే బెంగా, హడలూ వాళ్ళకళ్ళల్లో కనిపిస్తూనేవుంది. యువకుల్లోనూ వృద్ధుల్లోనూ యూనిఫారాలు వేసుకున్న పురుషుల్లోనూ అలంకరణంతో వున్న స్త్రీలలోనూ యిదే భీతావహం కనిపిస్తూంది. ఆదేశానికి—యీ దేశానికి ఎంతవ్యత్యాసం!

స్టాస్కీ-శిఖరం అర్ధరాత్రి పన్నెండుగంటలు కొట్టింది. క్రెమ్లిన్ గంటలు అంతర్జాతీయగేయాన్ని మోగిస్తున్నాయి. క్రీంతో కాఫీతాగి స్వెర్డ్లోవ్స్కీ నుండి వెళ్ళిపోయేం.

## బాధితుని సాక్ష్యం

పాతమాస్కో-పట్టణంలో, సామ్రాజ్యతత్వ శిల్పకళావింత విన్యాసాలతో నిర్మితమైన గోపురాలమధ్య, చీకటిసందుగొందుల్లో తిరుగుతున్నాం. నికోల్స్కీ-ద్వారందగ్గరనున్న "చైనాగోడ" పక్కగుండా వెళుతున్నాం. స్టాలిన్ ట్రాన్సుపోర్టు ఎకాడెమీ ఆఫ్ కలినిన్‌లో, పట్టణంలోని లోకొమొటివ్ ఫ్యాక్టరీలో పనిచేస్తున్న స్టఖనొవైట్లకు ఉత్తమతరగతి సాంకేతిక తర్ఫీదు యివ్వడానికి కొత్తబోధనాతరగతులు పెడతారని ఆవేళ మాస్కో న్యూస్‌పత్రికలో ప్రకటించబడింది. ఆసంగతి పురస్కరించుకుని

ఐదేళ్ళ కార్యక్రమాల వర్ధమానస్థితిని గురించి మాలో మేం బిగ్గరగా జర్మనుభాషలో వ్యాఖ్యానించుకుంటున్నాం. వియన్నాయాసతో మమ్మల్ని జర్మన్ భాషతో పలకరిస్తూ వెనకనుండి ఒకగొంతుక మమ్మల్ని ఆశ్చర్య పర్చింది. అతను మమ్మల్ని కలుసుకున్నాడు; సంభాషణ ప్రారంభమైంది. తన్ను తాను పరిచయంచేసుకొని, మాకు తెలియకండా మా సంభాషణ విన్నందుకు క్షమాపణ చెప్పుకొని, లోకొమొటివ్ యింజినీరు కావడంచేత తాను మా సంభాషణలో పాల్గోవడానికి మాకు అభ్యంతరం వుండకూడదని తానకున్నానని చెప్పేడు. సోవియట్ దేశ పరిస్థితులపట్ల అతని అనుభవం గల అభిప్రాయాల్ని సంతోషపూర్వకంగా స్వీకరిస్తామనీ మా అభిప్రాయా లతో సరిపోల్చుకుంటామనీ· చెప్పేం.

తాను వియన్నానుంచి యీ దేశానికి ఆరేళ్ళక్రితం ప్రత్యేకమైన ఒప్పందంమూలంగా వచ్చిన లొకొమొటివ్ యింజినీరుననీ, అప్పట్నుంచీ లొకొమొటివ్ రిపేరుషాపులో పనిచేస్తున్నాననీ చెప్పేడు. సోవియట్ దేశంలోని జీవితం, ఐదేళ్ళ కార్యక్రమాలు సాధించిన అత్యద్భుతమైన అభివృద్ధి, మా అభిప్రాయాల్ని రూఢిపరుస్తూ అతను మాటాడేడు. స్త్రీ పురుషులమధ్యగల పూర్తియైన సమానత్వంవిషయంలో మా అభిప్రాయాల్ని అతను యింకోసారి దృఢపర్చేడు.

## స్వయంకృతాపరాధం

అకస్మాత్తుగా అతని చెక్కిళ్ళమీదనుంచి జారుతూన్న కన్నీటిని చూసి చాలా ఆశ్చర్యపడ్డాం. అతనికి దుఃఖం పొర్లుకొంటూవస్తూంది. కోలుకొని తనకథ చెప్పేడు. ఒక సోవియట్ స్త్రీని వివాహంచేసుకున్నాడు, చందమామల్లాంటి యిద్దరు పిల్లలు, ఒకకుమారుడూ ఒక కుమార్తె వున్నారు. తన ఆస్ట్రియన్ పౌరత్వం వదిలిపెట్టి సోవియట్ పౌరత్వం స్వీకరించడానికి యిష్టంలేకపోయినా సోవియట్ దేశంలోనే వుండిపోదామని అతను ఆలోచిస్తుండేవాడట. ఒప్పందంకాలం (పీరియడ్ ఆఫ్ కాంట్రాక్టు) రెండుమాసాలక్రితం అయిపోయింది, మళ్లా ఒప్పందం నిర్ణయంకాక తప్పదన్న దృఢవిశ్వాసంతో సెలవులమీద వెళ్ళేడు. గత వారం తిరిగి యింటికి వచ్చేసరికి, ఒప్పందం యికమీదట నిర్ణయింపబడదనీ, అతను ఒకపక్షంరోజుల్లో సోవియట్ దేశం విడిచివెళ్ళవలసి వుటుందనీ ప్రభుత్వం తెలియజేసింది; యేకారణమూ చెప్పలేదు; గత కొద్దిమాసాల్లో తన వర్కు

షాపు ఉత్పత్తి యిరవై మూడు లోకొమొటివ్‌లనుండి కొంతతగ్గిపోవడం తప్పిస్తే తనకుకూడా యేకారణం కనిపించలేదు; కాని తగ్గుదల గురించి ప్రభుత్వానికి తగిన సమాధానం యిచ్చేడట. తనకధ సమాప్తానికి వచ్చే సరికి దుఃఖంతో అతను పూర్తిగా వివశుడై పోయేడు. తన భార్యాబిడ్డలకు ఆస్ట్రియాదేశ పౌరత్వం లేకపోవడంచేత, వాళ్ళను సోవియట్‌దేశంనుండి తీసుకపోవడానికి అనుమతిలేకపోవడం తక్కినవాటన్నిటికన్నా బాధాకర మైన విషయమని అతను చెప్పేడు. అతనికధ సమాప్తమయ్యేసరికి ప్వెర్‌స్వయా చేరుకున్నాం. తన ప్రవర్తనకు క్షమించవలసిందని, మేం జర్మన్‌భాష మాటాడుతుండడం అభిమానాన్ని పురికొల్పి తన ఆత్మకధను చెప్పుకొనేటట్టు చేసిందనీ వందనంచేసేడు. ఐదేళ్ళ కార్యక్రమంలోని కొన్నింటిలో ఉత్పత్తి కొంతవరకు సరిగాలేకపోయినప్పటికీ పంచవర్ష ప్రణాళికలు మనకాలంలోనే సోవియట్‌దేశాన్ని దృఢంగా సామ్యవాద మార్గంలో ప్రవేశపెట్టిందనీ. పెట్టుబడిదారీవిధానం వ్యక్తిలాభాలు దోపిడీ విధానంవేపు సోవియట్‌దేశం నడవడం నిశ్చయంగా అసంభవమనీ, పెద్ద విచారంతోనూ బాధతోనూ తానాదేశాన్ని విడిచిపెట్టవలసిన అవసరం వచ్చినప్పటికీ సోవియట్‌దేశంపట్ల తనలో దుర్బుద్ధి కలుగకుండేటట్లూ నూతన నాగరికతా సంస్థాపనార్థం అది సాధించిన అపూర్వాలపట్ల వ్యతిరేక భావం కలుగకుండేటట్లూ సర్వేశ్వరుణ్ణి కటాక్షించమని కోరుకుంటున్నాననీ, అతను మాదగ్గరనుంచి వెళ్ళిపోతూ చెప్పేడు.

మూడురోజులతరవాత, కన్నీళ్ళతో సాగనంపుతూన్న భార్యాబిడ్డల మధ్యనుంచి అతను మాస్కోనుండిపోయే రైలులో యెక్కుతూం డడం చూసేం.

ఇతను విధ్వంసకుడా ? అన్యాయానికి గురిఅయినవాడా ?

ప్రధమ కార్మికులు వేస్తున్న "ఉక్కు తయారుచేయడం ఎలాగ" (నికొలాయి ఆస్ట్రోవిస్కీ) అన్న నాటకం చూడడానికి మేయర్ హోల్డు నాటకశాలకు వెళ్ళడానికి నిర్ణయించుకున్నాము. దురదృష్ట వశాత్తు సకాలంలో సీట్లు బుక్‌చేసుకోలేదు. కాని అక్కడికెళ్ళి ప్రయ త్నిస్తే దొరుకుతాయేమోనని ఆశపడ్డాం. కాని లాభం లేకపోయింది. మాస్కోవాసులకు నాటకాలంటే చాలా యెక్కువ అపేక్ష వుండడంచేత కొన్నిరోజులు ముందుగానే టిక్కెట్లు అయిపోతాయి. ఆలస్యంగా వచ్చే

వాళ్ళకు ఆశాభంగం అవుతుంది. ప్రవేశం దొరకక మేం తిరిగివస్తూంటే, ఆనాడు జాగ్సుకార్యాలయంలో మాకు సహాయపడిన ఆంతరంగికవిషయం ప్రభుత్వశాఖలో పనిచేస్తున్న స్నేహితుడు కలిసేడు మేయర్‌హోల్డు నాటకశాలనుంచి అతనూ మాలాగే తిరిగివస్తున్నాడు. గార్కీవీధికెళ్ళి టీ ఆరగిస్తూ ఆసాయంత్రం కాలక్షేపంచేదామని నిశ్చయించుకున్నాం.

ఆస్ట్రియన్ ఇంజనీర్‌కథ మామనసులో వుండడంచేత ఆవిషయమై మీవుద్దేశం యేమిటని మాస్నేహితుణ్ణడిగేం. బహుశా అందులో ప్రత్యేకత యేమీవుండదంటూ, సోవియట్‌కార్మికులు నానాటికీ నైపుణ్యంలో అభివృద్ధి చెందుతుండడంచేత దేశానికి విదేశీయుల అవసరం వుండదనీ, అంచేతనే ఆస్ట్రియన్ యింజనీరు కాంట్రాక్టు పొడిగింపబడలేదనీ, అతను చెప్పేడు. అతను విధ్వంసకుడనిగాని అన్యాయానికి గురిఅయినవాడనిగాని తాననుకోననీ, కాని సోవియట్ పౌరసత్వంపొంది తన ఉద్యోగాన్నీ, భార్యాబిడ్డల్నీ తనగృహాన్నీ కాపాడుకోలేక పోయినందుచేత అతను తెలివి మాలినవాడు మాత్రమేననీ, అతను చెప్పేడు. ఈ పరిస్థితులలో అతని ఫ్యాక్టరీ ఉత్పత్తి కుంటుపడడం అతనిఅనావశ్యకతను బలపర్చివుంటుంది; నైపుణ్యంలేని విదేశ ఇంజనీర్లు మాకు అనవసరం అని అతనన్నాడు. తనకు అన్యాయం జరిగిందని అతను అనుకుంటే, న్యాయం జరపవలసిందని అతను నొక్కి చెప్పడానికిహక్కుంది; అతను విధ్వంసకుడే అయితే అతన్ని ప్రభుత్వం తప్పకుండా న్యాయస్థానంలో నిష్పక్షపాతంగా విచారణచేసి వుండేదని చెప్పేడు.

## ఒకప్పటిమాటకాదు కావలసింది ఇప్పటి మాట

"నిష్పక్షపాతమైన విచారణ" అన్న అతని మాటవిని, జినోవేవ్, రాడెక్, రైకోవ్, బుఖారిన్, కామనెవ్, టుకఛవ్‌స్కీలకు యీ మధ్య చేసిన విచారణలూ, విదేశాల్లో శత్రువుల్లోనూ మిత్రుల్లోనూ ఒకలాగే అవిచారణలూ, శిక్షలూ కలుగచేసిన అత్యాశ్చర్యాన్నీ అతనికి జ్ఞాపకం తెచ్చేం. ఒకప్పుడు కమ్యూనిస్టు నాయకత్వ ఉన్నతస్థానాల్లో వున్న ఈ వ్యక్తులు స్టాలిన్‌ను కూలదోయడానికీ నిజంగా ట్రాట్స్కీతో కుట్రచేసి వుండడానికి యేదోపెద్దకారణం వుండివుండాలనీ అన్నాం. వెనకెప్పుడో ఘనకార్యాలు చేశాం—ఇప్పుడు తప్పుడు పనులుచేస్తాం అంటే—పని కొస్తుందా? "వాళ్లు స్టాలిన్‌కి శత్రువులుకారు. సోవియట్ ప్రజలకు శత్రు

వులు" అని వెంటనే మాస్నేహితుడు బల్లగ్రుద్దిఘంటాపథంగా చెప్పేడు. ఈవ్యక్తులు ద్రోహులనీ, సోవియట్ న్యాయశాస్త్రం ప్రకారం వాళ్ళకు నిస్సందేహంగా నిష్పక్షపాతమైన విచారణజరిగిందనీ, దేశద్రోహుల పని పట్టడం అవసరమైనదని సోవియట్ ప్రజలు నమ్ముతున్నారనీ అతను అన్నాడు.

ఈవిచారణల గురించి యితర కార్మికులతో మాటాడేం. వాళ్ళందరూ యించుమించు యిదేమాటల్లో—సమాధానాలు చెప్పేరు.

## భారతదేశం గురించి సోవియట్ ప్రజలకేమైనా తెలుసా?

తరవాత అతను ప్రశ్నించ సాగేడు. "మాకొత్తరాజ్యాంగ చట్టం గురించి మీభారతదేశంలో యేమనుకుంటున్నారు? సోవియట్ దేశంపట్ల భారతీయులకు ఆసక్తివుందా?" అని అతను ప్రశ్నించేడు. సోవియట్ యూనియన్‌లో జరుగుతూన్న మహత్తర నిర్మాణాన్ని భారతీయులు చాలా ఆసక్తితో చూస్తున్నారనీ, దొరకిన కొంచెం భోగట్టాతో వివిధ జాతుల ఐక్యతకు ఆదర్శరాజ్యాంగచట్టంగా కనిపిస్తున్న కొత్తరాజ్యాంగ చట్టాన్ని భారతీయులు చాలాదీక్షగా పరిశీలిస్తున్నారనీ అతనికి చెప్పేం. యింకా ప్రశ్నపరంపరలు కురిపించేడు. "దరిమిలా గాంధీగురించి మాకేమీవార్తలు రాకుండావున్నాయేమి? భారతదేశం సహాయనిరాకరణ వదులుకుందా? కాంగ్రెసు మంత్రిపదవుల్ని యెందుకు స్వీకరించింది?"

మాకుచేతనైనంతబాగా భారతదేశ పరిస్థితుల్ని అతనికి చెప్పేం; యిప్పటివరకూ నిస్సంశయంగా గాంధీ ప్రజానాయకుడుగా వున్నాడనీ, దేశంలోని ప్రజాసామాన్యానికి కాంగ్రెసు బలవత్తరమైన రాజకీయసంస్థ అనీ, బ్రిటీష్ ప్రభుత్వం ప్రవేశపెట్టిన సంస్కరణలు విధ్వంసం చెయ్యడానికే కాంగ్రెసు మంత్రిపదవుల్ని స్వీకరించిందనీ అతనికి వివరించాము. "మాఖద్దరు దుస్తులను చూపించాం. చాలాబాగున్నాయి. మంచిఅందంగా వున్నాయి అన్నాడు. అప్పుడు ఖద్దరు ఉద్యమం గురించిచెప్పాం. ఖద్దరు మాచేతుల్లో విష్ణుచక్రం అన్నాం. అదివిని" యీ నూలుపోగుతో మీరేం సాధించగలరు? అంతసూక్ష్మంలో మోక్షమా? అని నవ్వుతూ అనేసాడు.

భారతదేశంలో కార్మికోద్యమంగురించి కమ్యూనిస్టుపార్టీ గురించి అడిగేడు. 1926 లో రైల్వేసమ్మెలో మాకు అప్పటి కమ్యూనిస్టులకు

వచ్చిన విభేదాలు, తదుపరి కార్మికోద్యమంలో చీలికలు, మీరటుకేసు, కమ్యూనిస్టుపార్టీ చట్టవిరుద్ధమని నిషేధించబడడం, చెప్పి వారిగురించి ప్రస్తుతం మాకేమీ తెలియదని చెప్పేం. "టాగూరు సంగతేమిటి? ఆయన యింకా గ్రంధరచన చేస్తున్నాడా? ఆయన కాంగ్రెసులో యెంచేత చేర లేదు? భారతీయ మేధావులు టాగూరులాగనే వుంటారా? " టాగూర్ సోవియట్ దేశం వెళ్ళినప్పుడు మాస్నేహితుడాయన్ని చూడలేదు. కాని రష్యన్ భాషలోనికి అనువదింపబడ్డ ఆయన గ్రంధాలన్నీ చదివేడట.

టాగూరు యింకా గ్రంధరచనల చేస్తున్నాడు; చాలా సంవత్సరాల క్రితం ఆయన రాజకీయాల్లో ప్రవేసించేడు; ఆయనఅన్నిటికన్నా ముఖ్యంగా మేధావంతుడే గనక తరవాత రాజకీయాలనుండి నిష్క్రమించేడు; భారతీయ భావగమనానికి ఆయన యెలాగ నాయకత్వం వహిస్తున్నాడో చెప్పేం; కాని భారతీయ యువకులకు ఆయన మర్మ సాహిత్యంపట్ల కొంచం అసంతృప్తికలిగి టాగూర్ సాంప్రదాయంనుండి విడిపోతున్నట్టు కనిపిస్తూందనీ అతనికి సూక్ష్మంగా చెప్పేం.

సోవియట్ దేశంలో, భారతదేశవిషయంలోనూ దానిపరిస్థితులు గురించీ యెంత ఆశ్చర్యకరమైన ఆసక్తివుంది! టాగూరు గురించీ గాంధీ గురించీ కాంగ్రెసుఉద్యమం గురించీ కొంతమంది కార్మికులు మమ్మల్ని యెప్పుడూ ప్రశ్నిస్తుండడంచూస్తే మాకు చాలా కొత్తగా కనిపించింది మంచి ఆదాయమూ సుఖమైన జీవితముతోబాటు, బాగా విశ్రాంతీ విద్యాసౌకర్యాలు కార్మికులకుంటే అప్పుడే యిటువంటి విశేషం తప్పక సాధ్యమవుతుందన్న నమ్మకం మాకు కలిగింది.

లెక్కా జమా లేనన్ని కప్పుల రష్యన్ "ఛాయి" ఆరగించేం. అప్పటికే అర్ధరాత్రి దాటింది. సెయింట్ బసిల్ దగ్గర మా స్నేహితుడూ మేమూ విడిపోయేం. హోటలుకు వస్తూన్నదారిలో మేయర్ హోల్డులోని నాటకం చూడలేకపోయినందుకు విచారించనక్కరలేదనుకొంటూ చాలా ఆనందదాయకంగా ఆసాయంకాలం గడిపేమని మాలోమేము అనుకున్నాం.

## పార్కు ముచ్చట్లు

ప్రపంచంలోవున్న యింకేదేశమూ సోవియట్ యూనియన్ చేసినంత వ్యయంతో యువకుల ఆనందానికి సౌకర్యాలు కలిగించలేదు. లెనిన్‌గ్రాడ్‌లో ఖార్కోవ్‌లో బాకులో స్టాలిన్‌గ్రాడ్‌లో టాష్కెంట్‌లో స్వెర్లోవ్‌స్కులో

నొవొసిబిర్‌స్క్‌లో, వేలకొద్దీవున్న యితరపట్టణాలలో, నాటకశాలలూ క్లబ్బులూ స్టాడియమ్‌లూ పార్కులూ యువకుల విలాసంకోసం యేర్పర్చబడ్డాయి. ఇవన్నీ, మాస్కోలోని గార్కీపార్క్ ఆఫ్ కల్చర్ అండ్ రెస్ట్ మాదిరిగా నిర్మింపబడ్డాయి.

గార్కీపార్కు వైశాల్యంలో ఆశయంలో ఆచరణలో బ్రహ్మాండమైనది. దాన్ని వర్ణించడానికి అలవికాదు. ఏడువేల ఐదువందల ఎకరాల వైశాల్యంలో, తోటలతో ఆరు బయటనున్న నాటకశాలలతో, ఆటస్థలాలతో, సరస్సులతో, రిస్టారెంట్లతో, ప్రదర్శనశాలలతో, సాంకేతిక పాఠశాలలతో, కళామందిరాలతో, సర్కసులతో, ఉపన్యాసాలతో - పార్కు చేరువనుండి ప్రవహిస్తున్న నదితో కన్నులపండువగా వుంటుంది. కొద్ది కోపెక్కుల రుసుంచెల్లిస్తే ప్రవేశం లభిస్తుంది!

మాస్కోనుండి ఉత్తరధృవంమీదుగా అమెరికావెళ్ళి తిరిగివచ్చిన ముగ్గురు సోవియట్ వైమానికుల పెద్ద చిత్రపటాలు సింహద్వారాన్ని అలంకరిస్తున్నాయి. తమదేశానికి గౌరవంసంపాదించిన యీ వీరులను ఆహ్వానించడానికి మాస్కోపట్టణ యువకులు అక్కడవున్నారు. "స్టాలిన్ రహదారి" అని కార్మికులు పేరుపెట్టిన యీ వైమానిక సాహసాన్నిచేసి ఒక అసాధ్యాన్ని సాధించినందుకు వారిని యువకులు గౌరవిస్తున్నారు. పార్కులో ప్రవేశించేసరికి అర్ధచంద్రాకారంగావున్న నాటకరంగంతో ఫ్లడ్‌లైట్లతో దూరశ్రవణయంత్రాలతో జంత్రసమ్మేళనంతోవున్న నాటకశాల మొట్టమొదట మాదృష్టి నాకర్షించింది. మాస్కో వివిధ ప్రదర్శన నాట్యమంటలి "పర్వతగులాబి" అన్న నాటకాన్ని ఆడుతున్నారు. నాటకశాల పూర్తిగా నిండిపోయింది.

కొంత ముందుకు వెళ్ళేసరికి, అన్నిరకాల ఆటలు కనిపించేయి. స్త్రీ పురుషులు కలసి ఆడే జట్లతో టెన్నిసుకోర్టులతో ఆటసాగుతూంది. చాలా కోర్టులలో వాలీబాల్ ఆడుతున్నారు. యువకులు యువతులు కలిసి ఆడే జట్లనుబట్టీ, ప్రేక్షకుల ఉత్సాహము ప్రోత్సాహముబట్టీచూస్తే పోటీ పందాలవుతున్నట్టు స్పష్టమవుతుంది. స్ప్రింటింగ్, జవెలెన్ త్రోయింగ్, డిస్కస్‌త్రోయింగ్, పుటింగ్ ది బాల్, రైఫిల్‌రేంజస్, ఆర్చరీ, ఫెన్సింగ్, బార్స్‌రింగ్సు, ట్రపీజ్, బాస్కెట్‌బాల్, బాక్సింగ్, హాకీ - అన్నిరకాల ఆటలూ జరుగుతున్నాయి. కాని అన్నిటికన్న యెక్కువగా ఆడబడేది సక్కర్‌ఫుట్‌బాల్, ఎన్నోడజన్ల ఆటస్థలాల్లో యీ ఆట ఆడుతున్నారు.

వేలకొలది ప్రేక్షకులు చూస్తున్నారు. సరస్సుల్లో పడవనడపడమూ యీదడమూ అలవాటుచేసుకుంటున్నారు. పార్కుకుపక్కగాప్రవహిస్తున్న నదిలో లెక్కలేనన్ని పడవనడపడం పోటీలు జరుగుతున్నాయి. పిల్లలాడుకోవడానికి యెన్నో ఆటస్థలాలున్నాయి. ప్రభుత్వం జీతాలిస్తున్న తర్ఫీదు పొందిన ఉపదేశకులు యీ ఆటస్థలాలన్నిటికీవున్నారు. దేహపరిశ్రమ కోసం యీ ఆటస్థలాలను నిర్మించడం చాలా ఉత్కృష్టమైనపని. దేశంలో తర్ఫీదు యిచ్చేవాళ్లు ఉపదేశకులు పరికరాలతోబాటు వేలలెక్కలో స్పోర్ట్సు క్లబ్బులున్నాయి. కొంచం రుసుము చెల్లిస్తే విచక్షణలేకండా అందరికీ ప్రవేశం లభ్యమవుతుంది. వృత్తి ఆటగాళ్లు సోవియట్ దేశంలోలేరు. అందరూ తమతమ పనులు చేసుకుంటూన్న కార్మికులే. వాళ్లు పోటీల్లో పాల్గొనడానికి వెళ్ళినప్పుడు, ప్రభుత్వం ఉచితంగా వాళ్ళకు జీతం యిస్తుంది. అన్నివయస్సులలోవున్న స్త్రీ పురుషులూ బాలబాలికలూ "దేశంకోసం శ్రమించడానికి దేశాన్ని రక్షించడానికి" అని రాసివున్న ఐదుకోణాల నక్షత్రాలు తగిలించుకొని అనేక వేలమంది మాకు కనిపించేరు. శరీర దారుఢ్యానికీ, ఆటల నైపుణ్యానికి అకుంఠిత దేశభక్తికీ యీ నక్షత్రం నిదర్శనం.

## గాలిగుమ్మటాలు - ఏరోప్లేనులు

కొంతదూరం వెళ్లేక, యెత్తైన ఉక్కుగోపురాన్ని చేరుకున్నాం. గాలిగుమ్మటంనుండి గెంతడం దీనిమీదనుండి బాలబాలికలకు తర్ఫీదు చేస్తున్నారు. తమపిల్లలు యంత్రంద్వారా గోపురంమీదికివెళ్ళి, గాలి గుమ్మటం పరికరాలన్నీ తగుల్చుకొని. ఉపదేశకుడు సౌజ్ఞ చేయగానే గెంతివేయడం ప్రేక్షక సమూహాలు చూస్తున్నాయి. గాలిగుమ్మటానికి తేలికైనతాడు కట్టివుండడంచేత గాలికి కొట్టుకపోయే ప్రమాదంలేదు. గోపురంచుట్టూవున్న పెద్ద ప్రేక్షక సమూహాన్నిచూస్తే దీనికి చాలా జనాకర్షణవున్నట్టు తెలుస్తుంది.

సమీపంలో అనేకరకాల విమానాలు వున్నాయి. యూనిఫారం దుస్తులు వేసుకున్న ఉపదేశకులు, స్త్రీ పురుషులకూ బాలబాలికలకూ విమాన నిర్మాణాన్ని నేర్పుతున్నారు. విద్యార్థుల్ని విమానంలో కూర్చోబెట్టి, లీవర్సుతిప్పడమూ, పరికరాల్ని ఉపయోగించడమూ, ఫ్యూజిలేజిగురించి రిగింగ్ గురించి బోధించడమూ చేస్తున్నారు. ఇంకొక విమానంలో

ఇంజినూ యితరయంత్రాలూ ప్రదర్శిస్తున్నారు. "సోవియట్ వీర" బిరు దాంకితులైన వైమానికుడు గ్రోమోవ్, అతని యిద్దరు సహచరులూ ఈ మధ్య ఉత్తరధృవానికి వెళ్ళిన గాలిబాటను తెలియజేస్తూన్న పెద్ద పఠాలు ప్రదర్శించబడ్డాయి. మొత్తంమీద, వైమానికవిషయాల్లో పౌరులు శ్రద్ధతీసు కొనేటట్టు చేయడానికి ప్రభుత్వం చాలా ప్రోత్సాహిస్తూంది. నైమానిక రసాయినిక శాస్త్రాభివృద్ధిసంఘం బాడ్జీలను చాలామంది ధరించేరు.

## ప్ర జా వి జ్ఞా నా ని కి

పన్నెండు సంవత్సరాలు ఆదిగువ వయస్సుగలవారి ఉపయోగార్థం ప్రత్యేకంగా సాంకేతిక ప్రదర్శనశాలవుంది. ఈ ప్రదర్శనశాలలో విశాల మైన హాల్సు చాలావున్నాయి. ఒకొక్కదానిలో సాంకేతిక శాస్త్రశాఖలలో యేదో ఒకటి ప్రదర్శింపబడివుంది. ఇక్కడ సాంకేతిక నిపుణులు విద్యా ర్థులకు బోధిస్తుంటారు. చీకటిగదులతోను పరికరాలతోను ఛాయాచిత్ర గ్రహణం సూక్ష్మదర్శినీ యంత్రంవి నియోగించడమూ తదితర దృష్టివిద్యా పరికరాలు వాడుకచేయడం నేర్పడానికి వేరువేరు హాలులున్నాయి. విద్యు చ్ఛక్తికీ రేడియో విజ్ఞానానికీ యింకోహాలుంది. మేం లోపలికి వెళ్ళగా రేడియో వేయడం ప్రదర్శింపబడుతూంది. ఎలెక్ట్రికల్ డైనమోలు, మోటర్లూ, జనరేటర్లూ, ట్రాన్స్ఫార్మర్లూ యింకోహాల్లో కనిపిస్తున్నాయి. కొన్ని యంత్రాలు యథాతథంగా చూపబడుతున్నాయి. తక్కినవాటిని బాల బాలికలు విడదీసి తిరిగి కలుపుతున్నారు. అన్నిరకాల స్టోరేజి బాటరీలూ, ఎక్యూమలేటర్లూ అక్కడ వున్నాయి. ప్రఖ్యాతమైన అన్ని వంతెనల నమూనాలు, వంతెనలను నిర్మించే యంత్రాలు యింకోహాల్లో వున్నాయి. నమూనాలు నల్లబల్లమీదరాసిన చిత్రపటాల సహాయంతో వస్తుసామగ్రిని వినియోగించడం బోధింపబడుతూంది. ఎలెక్ట్రిక్ పైలాన్సు వాటర్టవర్సు, లైట్హౌసెస్, సిలోస్ నమూనాలుకూడా అక్కడ వున్నాయి.

ఇంకోహాలులో హైడ్రాలిక్స్, హైడ్రోఎలెక్ట్రిక్సు ప్రదర్శింపబడ్డాయి. నీపర్డామ్, మాస్కో వాల్గాకాలువ, తెల్లసముద్రం కాలువ నమూనా లున్నాయి. తరవాత ఆటోమొబైల్ యింజినీరింగుకు ఒకహాలుంది. క్రాస్సెక్షన్లో వున్నట్టుగా, అనేకరకాలుగా పిస్టన్ తిరగడమూ, ఇంజిన్ వివిధభాగాలూ చూపుతూ నాలుగుచక్రాల ఇంటర్నల్ కంబస్చన్ మెషీన్ ప్రదర్శింపబడింది. మరామత్తూ, వివిధభాగాల్ని కలపడమూ యువకులు

చేస్తున్నారు. ఒక హాలు పేరోనాటిక్సుకీ యింకొకటి ట్రాక్టర్లకీ, కంబైన్లకీ, త్రెషింగ్ యింప్లిమెంట్లకీ వినియోగింపబడింది. లిఫ్టులవీ క్రేన్లవీ డెర్రిక్కులవీ గ్రెయిన్ ఎలివేటర్లవీ తదితర లిఫ్టింగు బిల్డింగు పరికరాల ఎలెక్ట్రిక్కు మోడల్సు యింకోహాలులో వున్నాయి. ఇందులో ఒక హాస్యజనకమైన సంఘటన జరిగింది, ఇతరుల ఆటంకమేమీలేకండా, బాలుడుగాని బాలికగాని స్వేచ్ఛగా వాడుకచెయ్యడానికి అవకాశం కలిగించాలి. అని యిక్కడ జరిగే ప్రదర్శనలు పాఠ్యతరగతులన్నిటిలోనూ నియమం వాళ్ళంతట వాళ్ళకు ఆసక్తికలిగి ప్రశ్నలువేసినప్పుడే, ఆయా విషయాలు బోధింపబడతాయి; యింకోవిధంగా చెప్పరు.

## బాల విజ్ఞానం

ఈ హాలు మేం చూస్తున్నప్పుడు, ధాన్యాన్ని పైకియెత్తేయంత్రం గురించి ఆసక్తితోవున్న యువకులకు బోధపరుస్తున్నారు. ఇరవై అడుగుల హౌసు లిఫ్టు నమూనావున్న ఒకమూలను మేం నిలబడివున్నాం. ఒక పన్నెండేళ్ళ పిల్లవాడు ప్రవేశించేడు. చుట్టూ చూసేడు. లిఫ్టు నమూనా వాడిదృష్టి నాకర్షించింది. నమూనా దగ్గరికెళ్ళి బొత్తాన్ని నొక్కేడు. లిఫ్టుమీదికి వెళ్తూంది. కుర్రాడు యింకోసారి బొత్తం నొక్కేడు. లిఫ్టు కిందికి దిగుతూంది. ఈ విధంగా కనీసం ఒక పదిపన్నెండుసార్లు లిఫ్టును నడిపేడు. ఏదో ఊసుపోని ఉద్యోగంగా యీపని కుర్రాడు చేస్తున్నట్టు మాకు స్పష్టమయింది. మాలోఒకరు కుర్రాణ్ణి లిఫ్టుదగ్గరనుంచి తొలగించబోయేరు. కుర్రాణ్ణి ఆటంకపర్చవద్దు, తన యిష్టంవచ్చినట్టు చేసుకోనివ్వండి అని అ సమయానికే అటెండెంటు సౌజ్ఞలుచేసేడు. ఇందువల్ల మాకుకొంత సిగ్గువేసింది; కాని అతను చెప్పిందే నిజం. ఇంకొన్నిసార్లు లిఫ్టునడిపి హాలులోంచి కుర్రాడు వెళ్ళిపోయేడు. ఊసుపోని ఉద్యోగంగా యిదంతా చేసేడు. కాని కుర్రాడికి యిందులో ఆసక్తి యేమీలేదని విశదమైంది. కుర్రాడు హాలులోంచి వెళ్ళిపోగానే ఇన్స్ట్రక్టరు మమ్మల్నిచూసి మందహాసం చేసేడు. మేమూ మందహాసం చేసేం. ఇది యదార్థంగా అద్భుతమైన హాలు.

పార్కు యింకోభాగంలో కార్నివాల్ జరుగుతూంది. రంకుల రాట్నాలూ, జయంట్ వీలు, స్విచ్ బేక్ రైల్వే, పెద్దసీసాస్, మోటారుసైకిల్ గారడీలు మొదలైనవి జరుగుతున్నాయి. స్త్రీలు అటెండెంట్లుగావున్న

చిన్నదుకాణాలు చాలా వున్నాయి. ఇక్కడ కొంచం రుసుము చెల్లించి చిత్తమొచ్చినంత సర్దా పొందవచ్చు. ఒక మరమీద నిలబడితే మీ తూకం వేసిన టికెట్టు వస్తుంది. ఒకసుత్తివిసిరి, ఆదెబ్బ బలాన్ని తెలుసుకోవచ్చు; మీ పిడికిలిశక్తి యెంతవుందో తెలుసుకోవచ్చు. మీ దస్తూరిబట్టి మీ నడవడి యెలాంటిదో కూడా తెలుసుకోవచ్చు।

## రాజకీయ విజ్ఞానం

ఆ పక్కగానే, మా ముందుగా ఒక చిన్న వేదికమీద ఎర్రసైనికుడు ఒకతను వున్నాడు. స్పెయిన్, చైనా, దేశాల పటాలు అతనిపక్కనున్నాయి. చిన్నసూదులు వాటికి గుచ్చివున్నాయి. పెద్దశ్రోతల సమూహం అతని ముందునవుంది. ఈ యుద్ధాల్లోని వివిధ సైనిక విన్యాసాల్నీ వాటి రాజకీయ ప్రాముఖ్యతనీ, ఎర్రసైనికుడు విశదపరుస్తున్నాడు. ఫ్రాంకోకు సహాయంగా వచ్చిన నాజీ వైమానికులు గువెర్నికాను ధ్వంసంచేయడం గురించి అప్పుడతను విపులంగా చెపుతున్నాడు. శ్రోతలు అనేక ప్రశ్నలు వేసేరు. వాటి కతను జవాబులు చెప్పేడు.

తరవాత సోవియట్ దేశ అల్పసంఖ్యాజాతుల ప్రదర్శనశాలవుంది. ఇంతకు పూర్వమే దీన్ని చూసేం.

తరవాత రాజకీయ ప్రదర్శనశాలవుంది. ఇందులో ఒకభాగము ఐదేళ్ళ కార్యక్రమాలకు వినియోగించబడింది. ఇక్కడ విశేషంగా విషయ సామగ్రివుంది. చక్కగారాసిన చిత్రపటాలూ, ఛార్టులూ, డయాగ్రాములూ. వివరాలతో వున్న పోస్టర్లు, ఛాయాచిత్రాలూ, యీకార్యక్రమాలు యెలాగ ప్రారంభం అయ్యేయో చర్చించేక చివరికు యెలాగ నిర్ణయింపబడ్డాయో, ఈకార్యక్రమాల పని యెలాగసాగాలో, అవిఎలాగ నడుస్తూవున్నాయో— యివన్నీ వ్యవసాయం పరిశ్రమలు, విద్య, ఆరోగ్యం, విశ్రాంతి మొదలైనవాట్లో తెలియజేస్తూ—ప్రదర్శింపబడ్డాయి.

చారిత్రక దృష్టితో ఐదేళ్ళ కార్యక్రమాలు బాగా విపులీకరించబడ్డాయి. యుద్ధసామగ్రి దేశరక్షణకు అవసరమైన వస్తువులను ఉత్పత్తి చెయ్యడమే ప్రప్రధమ బాధ్యతగా తెలియజేస్తూ, "దేశరక్షణే సర్వమూ" అన్ననినాదంతో 1929 లో మొదటి ఐదేళ్ల కార్యక్రమం ప్రారంభించబడింది. తరవాత "యంత్రాలే సర్వమూ" అన్న నినాదంతో విదేశాల నుండి యంత్రాల్నీ నిపుణుల్నీ రప్పించుకొన్నారు; భారీ పరిశ్రమల్ని

(హెవీ ఇండస్ట్రీస్) నిర్మించుకున్నారు. మెషీన్‌టూల్ పరిశ్రమల్నీ రసాయనిక పరిశ్రమల్నీ నిర్మించుకున్నారు. నాలుగు సంవత్సరాలలో—అంటే అనుకున్నదానికి ఒకసంవత్సరం ముందుగా—మొదటి ఐదేళ్ళ కార్యక్రమం పూర్తిఅయింది.

జీవితావసరవస్తువుల ఉత్పత్తిని జీవితస్థాయినీ అధికంచేసే సంకల్పంతో, "సాంకేతిక నైపుణ్యమే సర్వమూ" అన్న నినాదంతో రెండో ఐదేళ్ళ కార్యక్రమం ప్రారంభించబడింది. దీనివడి కొంచం తగ్గింది. కాని యిదికూడా అనుకున్నదానికి ఒక సంవత్సరం ముందుగా, 1937 లో పూర్తయింది.

తరవాత 1938 నుండి 1942 వరకూ మూడో ఐదేళ్ళ కార్యక్రమం. విదేశాలలో శాంతి స్వదేశంలో సిరిసంపదలనూ, భవిష్యత్తులో సౌభాగ్యాన్నీ ఆసించి, యింతకు పూర్వమే "కాడర్లమీదనే సర్వమూ ఆధారపడివుంది" అని స్టాలిన్ యిచ్చిన నినాదాన్ని సాధించడం యీ మూడో కార్యక్రమం ఆశయం.

తరవాత భూస్వాముల (కులక్స్) ను రద్దుచేయడం. "విజయం వల్లవచ్చిన బుర్రతిరుగుడు" అని స్టాలిన్ పెట్టిన చీవాట్లు - 1930 తరవాత మొదటిసంవత్సరాలలోని స్వల్పాభివృద్ధి - సమిష్టి వ్యవసాయపద్ధతి జయప్రదంగా నడవడం - రైతులకిచ్చిన సౌకర్యాలు - ట్రాక్టర్లూ కంబైన్లూ మొదలైనవాటితో వ్యవసాయాన్ని పూర్తిగా యంత్రమయం చేయడం - ఫ్యాక్టరీ కార్మికులతోబాటు రైతులకు యంత్రాలపట్ల ఆసక్తికలుగుతూండడం - యీవిషయాలన్నీ విపులంగా చిత్రించబడి, చూపరులకు వివరింపబడుతున్నాయి. పెద్ద భూగోళపటాల సహాయంతోనూ చిత్రపటాల సహాయంతోనూ, యింకొక యిన్‌స్ట్రక్టరు ఐదేళ్ళ కార్యక్రమాల్ని భూగోళశాస్త్రదృష్ట్యా ఉపన్యసిస్తున్నాడు. ఆర్కిటిక్ సముద్రానికి తోవచేసుకోవడమూ, అట్లాంటిక్ సముద్రయానానికి ఉత్తరంగా బాటను యేర్పర్చుకోవడమూ, ఉరల్స్ పర్వతప్రాంతాల అభివృద్ధీ, సైబీరియాఎడారిని పారిశ్రామిక ప్రదేశంగా చెయ్యడమూ, టర్క్ - సైబీరియన్ రైల్వే నిర్మాణమూ, ట్రాన్స్-సైబీరియన్ రైల్వే పునర్నిర్మాణమూ, సోవియట్ దేశంలోని ప్రాచ్యభాగంలో వున్న స్వాతంత్ర్యరాష్ట్రాలు అభివృద్ధిపొందడమూ - యీవిషయాలన్నీ, ఆతృతగా వింటూన్న శ్రోతలకు అద్భుతంగా వర్ణించబడ్డాయి.

## ఆ త్మ వి మ ర్శ న

కార్యక్రమాల్లోని విజయాలను వక్కాణించడమేకాకండా బుద్ధికుశలతగల దర్శకులు, కార్యక్రమాలు వెయ్యడంలోనూ ఆచరాణలోనూగల లోపాలనూ తప్పులనుకూడా చూపుతున్నారు. మొదట చేదామనుకున్నవి యెంత అసాధ్యమో విశాలమైన "జై గాంట్" "వెర్ బ్లడ్" ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలు, తరవాత చిన్న భాగాలుగా ఆ క్షేత్రాలు యెలాగ విభాగింపబడ్డాయో, రెండువేలూ మూడువేలూ టన్నుల సిమెంటు పరిశ్రమల నిర్మాణం, కాని వాటిని ఐదువందల టన్నులు ఉత్పత్తిచేసేవాటిగా విభాగించి ఆర్థికంగా లాభంపొందడమూ, రవాణాసౌకర్యాలను దృష్టిలోపెట్టుకోకండా కొన్ని ఫ్యాక్టరీలను అనువుకానిస్థలాల్లో కట్టడమూ చేసిన తప్పుల్ని మభ్యపర్చకండా, యివన్నీ పూర్తిగా వివరించబడ్డాయి.

స్టాలిన్ అధ్యక్షతక్రింద నిర్మింపబడిన సోవియట్ రాజ్యాంగచట్టానికి, యీప్రదర్శనశాలలోని యింకోభాగం వినియోగింపబడింది. చాలా పెద్దఅక్షరాల్లో ముద్రించబడిన రాజ్యాంగచట్టం పెద్దప్రతులు యిక్కడ వున్నాయి. పెద్దఅక్షరాలతో ముద్రించి చట్టంలోని ఒక్కొక్క ఆర్టికలూ, సంఖ్యలూ వ్యాఖ్యానాలతోసహా, వేరువేరుగా చదవడానికి వీలుగావుండేటట్లు బల్లలమీద అమర్చబడ్డాయి. చూపరులకు ఇవన్నీ దుబాసీ దర్శకులు విపులీకరిస్తున్నారు. రాజకీయ విద్యాప్రచారంలో ఇది చాలా గొప్పపాఠం. లెనిన్, స్టాలిన్ మహాశయుల పెద్ద విగ్రహాలూ, మోలటావ్, కలినిన్, కగనోవిష్, వొరోషిలావ్ మహాశయుల చిత్రపటాలూ, స్టఖానొవైట్ కార్మికుల పెద్ద ఛాయాచిత్రాలూ చాలామంది చూపరులను ఆకర్షిస్తున్నాయి. డియాపోసిటీవ్‌లూ వర్ణచిత్రాలూ, స్కీమేటిక్ రిప్రజెంటేషన్ల ద్వారా సోవియట్ విమానపరిశ్రమ, బొగ్గుగనులూ, భారీపరిశ్రమలూ, రసాయనిక పరిశ్రమలూ యెలాఅభివృద్ధి అయ్యేయో చిత్రింప బడ్డాయి. పెద్ద అక్షరాలతో ముద్రించబడిన విపులీకరణలను కార్మికులు శ్రద్ధగా చదువుతున్నారు.

పార్కు ఇంకోభాగంలో వృక్షశాస్త్ర పరిశోధన చెయ్యడానికి స్థలంతోబాటు, ఒకతోటవుంది. అంట్లు కట్టడంగురించి మిశ్రమజాతులఉద్భవం కృత్రిమసంయోగం గురించి చూపరులకు ప్రయోగములతో చెపుతున్నది ఒకామె. ఉపన్యాసాలకు ఒకచిన్నహాలూ, వృక్షశాస్త్ర పరిశోధనాలయమూ

(లెబొరెటొరీ) కూడావున్నాయి. బాలబాలికలకు ఒక ఉపాధ్యాయుడు ఆచ రణద్వారా చూపుతూ ప్రాధమిక పాఠాలు ఇక్కడ చెపుతున్నాడు.

వార్తాపత్రికలు యింకొకచోట వున్నాయి. మాస్కో దినపత్రిక లన్నిటినీ యిక్కడ చదవవచ్చు. జనసమూహాలు వీటిచుట్టూచేరి వార్తలు చదువుతున్నారు. ఐస్క్రీం అమ్మేవాళ్లూ పాలదుకాణాలు రిస్టారెంట్లు టీ దుకాణాలూ యెన్నో వున్నాయి. సమానఫాయిలో యువకులు వృద్ధులూ బాగా వాటి నాదరిస్తున్నారు. జట్లువేసుకొనివున్న ఒక యువతీ యువకుల ముఠా, వాళ్ళ నాయకుడు జంత్రవాయిద్యాన్ని వాయిస్తూంటే తక్కిన వాళ్ళందరూ బిగ్గరగా పాడుతూ, రహదారిలో నడుచుకుంటూ పోతున్నారు. పిల్లలతోవున్న తల్లులూ దండ్రులూ, ప్రేయసీ ప్రియులూ ప్రతీచోటా వున్నారు.

బయటికిపోయేద్వారం దగ్గర యింకో మందిరం వుంది. ఇదికూడా పిల్లలకే ప్రత్యేకింపబడింది. ఇక్కడ చిత్రలేఖనం, వర్ణచిత్రలేఖనం, మంటితో బొమ్మలుచేయడం నేర్పుతారు. ఒక స్త్రీ శిల్పి దర్శకత్వంతో పిల్లల కళాభిరుచి దోహదం చేయబడుతూంది. పిల్లలు తయారుచేసిన వస్తువుల్ని యిక్కడ ప్రదర్శించేరు.

వేలకొలదీ మాస్కో యువకులు యీ పార్కులో వున్నారు. ఆరోగ్యంగా దృఢంగా ధీయుతంగా ఉత్సాహంగా దేశభక్తితోవున్న యీ యువకులు. దేశసౌభాగ్యాన్నీ దేశరక్షణనీ తమ మాతృదేశ నాగరికతనూ కాపాడడానికి కంకణం కట్టుకున్న యీ యువకులు సోవియట్ యూని యన్‌లోని నూతన సమాజానికి సజీవమైన నిదర్శనలు!

హోటలు విశ్రాంతి స్థలంలో మా ఇంగ్లీషు స్నేహితుణ్ణి కలుసుకున్నాం. అతను మాస్కోకు రావడం ఇది రెండోసారి; మొదట .932 లో అతనొకసారి వచ్చేడు. సామానంతా సర్దుకొని, లెనిన్‌గ్రాడ్ మీదుగా ఇంగ్లాండుపోయి తన కార్మికసంఘంపని చేసుకుంటానని మాతో చెప్పేడు. మేంకూడా మర్నాడు మాస్కోనుండి వెళ్ళిపోతున్నాం. సోవి యట్ యూనియన్ యాత్ర గురించి రాసుకున్న విషయాలు అతనూ మేమూ సరిచూసుకున్నాం. రెండోసారి చూసేక మాస్కో గురించి తన అభిప్రాయమేమిటని అతణ్ణి అడిగేం. తన అభిప్రాయాన్ని అతను చెప్పేడు:

"ఇంతకుపూర్వం యెప్పుడూ లేనంతగా మాస్కోలో యిప్పుడు సంతోషమూ, ప్రేమా జీవితమూ చిందులాడుతున్నాయి!"

## కుశ్శంకలకు అతీతమైన సోవియట్ భూమి

మా కాస్త పర్యటన ముగిసింది. మాస్కో-పట్టణాన్ని చూసేం. గృహజీవితంలో కుటుంబజీవితంలో సోవియట్ ప్రజలను చేరువగాపోయి చూడగలిగేం. పనిచేస్తున్నప్పుడు, పఠిస్తున్నప్పుడు, ఆడుతున్నప్పుడు, పాడుతున్నప్పుడు సోవియట్ ప్రజాజీవితాన్ని పరిశీలించేం. నిష్కపటంగా హృదయసాక్షిగా మా అనుభవాల్నీ అభిప్రాయాల్నీ రాశాం.

ఇంచుమించు యీ విధంగా స్నేహితులు మమ్మల్ని అడుగుతారు: "సోవియట్ యూనియన్‌లో మీ చిత్తమొచ్చినట్టు తిరగడానికి స్వాతంత్ర్యం వుండేదా? ఇష్టంవచ్చిన చోటికి వెళ్ళగలిగేవారా? ఇష్టం వచ్చినది చూడ గలిగేవారా? ఇష్టంవచ్చినది చెయ్యగలిగేవారా?"

మమ్మల్ని యీ ప్రశ్నలడిగినవాళ్లు ఒకరినొకరు చూసుకొని కన్ను గీటుకొంటూ, సాభిప్రాయంగా మావేపుచూసి చిరునవ్వునవ్వుతారు. వాళ్లు చెప్పకపోయినా దాని అర్థం యీ విధంగా వుంటుంది: "పాపం మోస పోయిన గొర్రెలు! సోవియట్ ప్రభుత్వం వీళ్ళ నక్కడికి తీసుక పోయింది; వీళ్లు సోవియట్ దేశంలో వున్నంతకాలం గూఢచారిదళం వీళ్ళను నడిపించేది; ప్రభుత్వ మనుష్యులు చూపిందే వీళ్లు చూసేరు: విదేశయాత్రీకులతో మాటాడడానికి తర్ఫీదుపొందిన సోవియట్ దేశీయుల తోనే వీళ్లు మాటాడేరు!"

మిలటరీ కీలకస్థానాలుతప్ప, వెళ్ళదలచుకొన్న చోటికల్లా నిరాటంకంగా వెళ్ళగలిగామనీ. చూడదలచుకున్నదల్లా నిరాటంకంగా చూడగలిగామనీ మాటాడదలచుకున్న వాళ్ళందరితోనూ మాటాడేమనీ—యెవరి నుండీ ఏవిధమైన ఆటంకం లేకుండా, మొత్తంమీద అక్కడమేంవున్నంత కాలమూ స్వేచ్ఛగా గడపగలిగేమనీ హృదయసాక్షిగా చెపుతున్నాం. బహిరంగస్థలాలూ, సంస్థలూ, క్లబ్బులూ, షాపులూ, ఫ్యాక్టరీలూ మొదలైనవి వందలూ వేలూ మేం చూడగలిగినవి వున్నాయి. సోవియట్ దేశ యాత్రాసంఘం ఆయాస్థలాలకు మేం వెళ్ళడానికి యేర్పాట్లు చెయ్యడం నిజమే. ఒకస్థలం చూడడంకోసం యేర్పాట్లు చెయ్యడానికి తగినసంఖ్య యాత్రీకులున్నట్టయితే యెక్కడకైనా మాయిష్టం వచ్చిన స్థలానికి వెళ్ళ వచ్చును. అది సాధ్యం కాకపోతే ఒకదర్శకునితోపాటు వెళ్ళి ఆయాస్థలా లనైనా చూసేవాళ్ళం లేకపోతే మాయంత మేమైనా వెళ్ళేవాళ్ళం. ఇన్ని

వేల ప్రదేశాలూ యాత్రీకుల కళ్లకప్పడానికి అలంకరించి వుంచడం చాలా అసాధ్యం. పోనీ మాస్నేహితుల అనుమానాలన్నీ నిజమే అయినా, సోవియట్ సంస్థలు ఆదర్శవంతంగా నడుపబడుతున్నాయనీ, యాత్రీకులకోసం బాగాఅలంకరింపబడి వున్నాయాఅన్నట్టు పని చేస్తున్నాయనీ, వాళ్ల ఆదర్శము త్వరిత గతిలో వాస్తవం అవుతూందనీ రుజువు కాకతప్పదు.

మే ము

మాస్కోకు మాయంతటమేమేవెళ్ళేంకాని మమ్మల్నేపార్టీపంపించలేదు; మాఖర్చులు యెవరూ భరించలేదు; యేసంఘం ప్రతినిధులుగాగాని మేం మాస్కో వెళ్ళలేదు; ప్రచారకగ్రంథం మాచేత రాయించడానికి యేప్రచురణకర్తా మమ్మల్ని అక్కడికి పంపలేదు. మా సంతుష్టికోసమూ మాసరదాకోసమూ మేమక్కడికి వెళ్ళేం. అక్కడ పరిస్థితులు కళ్ళారా చూద్దానికీ, యెన్నాళ్ళనుంచో వెళ్దామనుకుంటూన్న వుబలాటాన్ని నెరవేర్చుకోవడానికీ మాస్కో వెళ్ళేమన్నమాట. సాంప్రదాయాన్నిబట్టీ, తర్ఫీదుబట్టీ, మేము కార్మికవర్గసభ్యులము అని భావించుకుంటున్నాం, మేము జాతీయవాదులం. పనికాలానికి రోజుకు యెనిమిదిగంటల పరిమితిని నిర్ణయించుకోవడంకోసం, 1923 లో జరిగిన స్విట్జర్లాండ్ కార్మికోద్యమంలో మేమిద్దరమూ పాల్గొన్నాం. 1930, 1936 సంవత్సరాలలో జరిగిన భారత జాతీయోద్యమాలలో ఉడతాభక్తిగా మాచేతనైనంతచేసేం. తరవాత మాస్కోవెళ్లేం. అక్కడికి మేము విమర్శకులగా వెళ్ళలేదు - అక్కడ జరుగుతూన్న మహానిర్మాణాన్ని చూసే స్నేహితులుగా సానుభూతిగల పరిశీలకులుగా మాస్కోకువెళ్ళేం. సోవియట్ దేశం మాకు చూపగల ఉత్కృష్టవిషయాల్ని చూడడానికీ, యేఘనకార్యాలు సాధించేమని సోవియట్ ప్రజలు అధికంగా గర్విస్తున్నారో వాటిని మా అంతట మేం చూడడానికీ వాళ్ళమాటలలో వాళ్ళ యిళ్ళల్లో వాళ్ళఆశయాల్నీ ఆదర్శాలనీ వినడానికే మేం సోవియట్ దేశానికి వెళ్లేం.

కుళ్లుకాలవలను తనిఖీచేసే మనుషులుగా మేం మాస్కోవెళ్ళలేదు; మనసులో దురభిప్రాయాన్ని స్థాపించుకొని వెళ్ళవేదు; కుళ్లుకాలవలు యెక్కడున్నాయా అని వెతుక్కుంటూ వేళ్ళతో ముక్కుబిగించుకొంటూ మేమక్కడికి వెళ్ళలేదు. అక్కడ లోపాలున్నాయి; చూద్దామనుకున్న వాళ్ళకు లోపాలుకనిపిస్తాయి. బాల్షుగ్ నుండి రెడ్స్క్వేర్కు తిరిగి

వస్తున్నప్పుడు ప్రతిరోజూ "మంగోల్‌లాండ్రీ" పక్కగా మేం రావలసి వచ్చేది. "లాండ్రీ" పైకప్పు చాలకిందికి వుంటుంది. పొగలమధ్య, కుళ్లుబట్టలవాసనలమధ్య, అర్ధనగ్నంగావున్న చాకళ్లు అందులో పనిచేస్తుండే వారు. తమ పుర సౌందర్యాన్ని మా మాస్కో-స్నేహితులు గొప్పగా వర్ణిస్తున్నప్పుడల్లా, "చైనీస్ లాండ్రీ"ని వాళ్ళకు జ్ఞాపకంతెచ్చేవాళ్ళం. చాలినన్ని ఇళ్ళు లేకపోవడమూ కొందరువ్యక్తులకు సౌకర్యాలు కొన్ని లోపించడమూ వాళ్లే వొప్పుకొనేవారు; కాని వేసుకొన్న కార్యక్రమం ప్రకారం యీలోపాలన్నీ తొలగింపబడతాయనీ, అభివృద్ధిని చూడడానికి మాస్కోకు ఐదేళ్ళలో రావలసిందని కొందరూ రెండేళ్లలో రావలసిందని కొందరూ మాస్నేహితులు మమ్మల్ని ఆహ్వానించేవారు.

## మాస్కో, సెలవు!

సోవియట్ దేశం గురించి డెలాఫెల్డుగారు రాసిన నల్లులూ, సిట్రిన్ గారు రాసిన మరుగుదొడ్లూ, చిర్రూ బుర్రూమంటూ వుంటారని భయంకరంగా రాసిన హేడెకాగెస్టుగారి సోవియట్ పౌరులూ బహుశా మాదృష్టిని పడకపోవచ్చు; క్లైబర్ లెగేగారు రాసిన బిచ్చగాళ్లను మేం నిశ్చయంగా చూడలేదు. మేం వీటన్నిటినీ చూసినప్పటికీ, ఇవి సోవియట్ దేశంలో వున్నాయిగాబట్టి సోవియట్ దేశం సాధించిన మహాత్కార్యాలన్నీ గవ్వకు మారవనీ, సోవియట్ ప్రజల్లో వ్యాపిస్తున్న నూతన నాగరికత పెద్దబూటకమనీ నిర్ణయానికి రావడం చాలా అన్యాయమని మాదృఢమైనవమ్మకం.

ఒక కొత్తప్రపంచం నిర్మింప బడుతూంది; ఒక కొత్తజీవిత విధానము ఆచరణలోనికి వస్తూంది. పాతపద్ధతి పాత భావాలు త్యజింపబడుతున్నాయి; పాత కొలతబద్దలను పెంటకుప్పలమీదికి విసిరి వేస్తున్నారు. కొత్తధర్మాలను మనతరంలోనే సృష్టిస్తున్నారు. కొత్త విలువలను యేర్పరుస్తున్నారు. ఒకకొత్త పరిణామం ప్రత్యక్షమవుతూంది. దాని విలువను తోసిపుచ్చినా తక్కువ చేసినా, మానవ చరిత్రలోని సత్యాల్నే అంగీకరించకపోవడం అన్నమాట.

మాస్కో సెలవు!

ఆగస్టు, 1937. ]

నేషనల్ ప్రెస్, హైదరాబాద్ (దక్కన్).

## సోవియట్ దేశం-భూతలస్వర్గం చదివారు.

సోవియట్ చరిత్రలో ఇది ఒకభాగం మాత్రమే !

సోవియట్ చరిత్రను, నిర్మాణాన్ని, రాజ్యాంగాన్ని,

ప్రజాజీవితాన్ని, సమగ్రంగా తెలిసికోవాలంటే

చదవండి !

ప్రజానాయకుడు స్టాలిన్
మన లెనిన్
నేటి సోవియట్ యూనియన్
సోవియట్ స్త్రీలు
గుండెదిబ్బరం
వీరమాత
సోవియట్ విజ్ఞానసమితి : కాంగ్రెసు
జాతీయస్వాతంత్ర్య సమస్యలు మార్గం
స్టాలిన్ : జాతుల సమస్య
స్వాతంత్ర్య సంగ్రామం (స్టాలిన్ ఉపన్యాసాలు)
లెనిన్ : పల్లెటూరి పేదలకు
స్టాలిన్ : నిర్మాణసమస్యలు

 గ్రంథాలయాలకు ప్రత్యేక తగ్గింపు ధరలు

కావాలంటే—

ప్రజా ప్రచురణాలయం, కుద్బిగుడ (హైద్రాబాద్ దక్కన్)
ప్రజాశక్తి కార్యాలయం, గవర్నర్ పేట, బెజవాడ.

Title Printed at Prajasakti Press, Bezwada.
Paper Permit No. 33/44
25th May. 1945 Copies 2,000